ఆంధ్రసచిత్రవార

# పత్రిక

2-11-1962

25 నయాపైసలు

చిత్రాల్లో విచిత్రాలు



వచ్చే వారం!

'ఆంధ్రసచిత్రవారపత్రిక'లో

# 'వేసక్టమీ'

('కుటుంబనియంత్రణం')

పై ప్రత్యేక వ్యాసం

*

త్వరలో ప్రారంభం!

# 'డిటెక్టివ్ సీరియల్ కథ'

వివరాలకై ఎదురుచూడండి!

# ఉత్తరాలు

## దీపావళి సంచిక

దీపావళి పండగను జ్ఞప్తికితెస్తూ, మా ఇంటికి వచ్చిన మీ పత్రికను మేము ఎంతో ఆదరముగా ఆహ్వానించినాము. లోగా సూర్యకాంతం సినిమాలో ఎంత దుడుకుగా ప్రవేశించారో చదివి, నవ్వుకున్నాం. ఆమె అసలు ఫోటో మాకు మీ పత్రికద్వారా అందజేసిన 'రూప' గారికి అభినందనాలు.

షేక్ నజీర్ అహమ్మద్, (వెన్నూరు.)

* * *

'దీపావళి సంచిక' ఆంధ్ర సచిత్ర వారపత్రిక అనుకొన్నంత ఆకర్షణీయంగా వెలువడినందుకు చిత్రకారులకీ, రచయితలకీ ముఖ్యంగా సంపాదకులకీ అభినందనలు.

ఆళ్లచెర్వు అన్నపూర్ణా రంగయ్య (గుంతకల్లు)

## ముఖచిత్రం

దీపావళి సంచికలో బాపుగారి ముఖచిత్రం చూడ ముచ్చటగా నున్నది. కథలన్ని విశేషంగానే ఉన్నాయ్. అందులో హవిప్ రచించిన మమత అను కథ చాల బాగున్నది.

హెచ్. బాబున్‌గౌడ్, (గుంటకల్)

## కథలు

కెంతర బహుమతి పొందిన శ్రీ కె. ఆర్. కె. మోహన్‌గారు రచించిన అనుబంధం కథ చదువుతూంటే, చెలిమిలోంచి వూరు నీటివలె నా కండ్లనుంచి నీటి బిందువులు కారసాగాయి. మాతృప్రేమ ఎటువంటిదో, కడుపుబాధ అంటే ఏమిటో ఈ కథ ద్వారా తెలుసుకొనవచ్చును. పరాయివాడైన రాజాపై సుబ్బమ్మకుగల పుత్ర భ్రాంతి రాజాకు సుబ్బమ్మపైగల మాతృప్రేమ, సంబంధములేనివారికి ఈ అనుబంధం ఎట్లేర్పడినదో ఆశ్చర్యము ?

బి. రాయికుమారి (కమలాపురము)

* * *

'నా పొరపాటు తలిస్తే....' అన్న కథ చిన్నదైనప్పటికి చాలా బాగుంది. "భాయు" గారికి అంత మంచి కథ వ్రాసినందుకు, ప్రచురించినందుకు మీకు, మా ధన్యవాదాలు.

కె. బాబుమోహనరావు (మద్రాసు)

* * *

భాయుగారు రచించిన 'నా పొరపాటు తలిస్తే' చాలా బాగుంది. కథ చివరదాకా సస్పెన్స్‌తో బాగా నడిచింది. చాలా బాగుంది అనడానికి సందేహంలేదు. కథకు తగ్గ చిత్రం వేసిన చిత్రకారునకు, రచయితకు నా హృదయపూర్వక అభినందనాలు.

కాదంబరి శ్యామలరావు (కాకినాడ)

* * *

సీతారామయుద్ధం అన్న కథ చాల బాగా ఉంది. నిజంగ జరుగుతున్నట్లే అనిపించింది. రచయిత్రి, రామలక్ష్మి గారికి, నా హృదయపూర్వకధన్యవాదాలు.

వి. ఎస్. మహంతి (విజయనగరం)

* * *

రామలక్ష్మిగారు రచించిన "సీతారామయుద్ధం" నాకు బాగా నచ్చింది. చమత్కృతి మెండుగా మనోజ్ఞంగా ఉంది. కథ రూపేణా మా మనస్సుకు ఆహ్లాదమును అందచేసిన రచయిత్రిగారికి నా అభినందనములు.

కామర్తి వెంకటేశ్వరరావు (మద్రాసు)

* * *

రామలక్ష్మిగారు వ్రాసిన సీతారామయుద్ధం అను కథ చదివినాను. నిజం చెప్పాలంటే డబ్బింగు చిత్రాలలో డైలాగులు ఏర్చి కూర్చి రాసినట్లుంది.

వా. పింబిరెడ్డి (మండూరు)

## సీరియల్ కథలు

"గ్రేస్‌కెల్లీ" కథ చాలా బాగుంది. ఆమెయొక్క కుటుంబములోని అలవాట్లు, పిల్లల తీరు చదివి తన్మయము చెందాను.

కె. సన్యాసినాయుడు (దువ్వలపూడి)

* * *

"గ్రేస్‌కెల్లీ" వ్రాసిన "నేనూ—మా రాజాగారూ"లో రాజబాంధవాల్లో సంగీతానికి ఆమె అంత ప్రాముఖ్యత ఇచ్చినందుకు నాకు సంతోషమైనది. వ్యాసం ప్రచురించినవారికి ధన్యవాదాలు.

గోవగాని సీతమ్మ (హైదరాబాదు)

* * *

ఉ. కమ్మని భావ సంపదయు గ్రాంగ, తీయని<br>
యాంధ్రభాష, మై<br>
కమ్మిన మంచిరుత్త యధికమ్ముగ మా<br>
హృది సంతసింప, నీ<br>
రమ్మల గ్రుమ్మరించ నవలా నవలోకము<br>
మించి పోల్చ మీ<br>
తిమ్మల పెల్వరింపగ కవీశుడు శాస్త్రి "విశాల<br>
నేత్రముల్."

బాలకీ శ్రీకృష్ణ (గుంటూరు)

## సందేహాలు

"సందేహాలు" క్రింద ప్రచురింపబడిన సందేహానికి జవాబు తెలియవచ్చి యున్నారు.

"విర్మల ఆల మువ్వకొని పూలు పెట్టుకోలేదు. అమె ఆల మువ్వకుని పువ్వులు పెట్టుకుందనే ఎందు కనుకోవాలి ? బాదుగా వేసుకున్న ముడిలో బాలుగైదు "విడిపూలు" మా తురుము కుంది. అంతే. అందుకే "విడిపూలు" అని స్పష్టంగా వ్రాయబడింది.

12—10—62 సంచికలో నవిని వేతిమీద చక్కెరడబ్బా పడిందంటే మరొకరు తీసుంటే పడొచ్చు. లేదా తనే తీసుంటే మిగతా డబ్బా లేనైనా జారి పడమూ వచ్చు.

అదే సంచికలో కామధేనువు .... సందర్భంలో "....మరొక గోవునుకొనుక్కొమంటే" అనుండాలి. చిన్న తప్పులను సవరించుకుని చదువుకోవాలి.

విమర్శకు ముందు క్షుణ్ణంగా చదివి మరీ విమర్శించాలని ప్రార్థన.

కోమలాదేవి (తెనాలి)

## ప్రపంచ ప్రముఖులు

"ప్రపంచ ప్రముఖులు" గురించి ఇంకొంచెం విపులంగా వ్రాసినట్లయితే ఇంకా బాగుంటుందని నా మనవి. మన పత్రికలో రాజ్యాంగ విషయాలకు అంతగా ప్రాతినిధ్యం ఇవ్వవద్దని నా రెండో మనవి.

గరిమెళ్ల మోహనరావు (పాలకొల్లూరు)

## సరాగమాల

సరాగమాలలో ప్రచురించే వ్యాసాలు చాలా బాగుంటున్నాయి. 12—10—62 పత్రికలో సిరి సంపదలు సినిమాలో 8 పాటలు ఉంటాయని కొంటూ అని వ్రాశారు. కాని అందులో ఉన్నవి కూడ 8 పాటలే. పుస్తకంలో మాత్రం (సిరిసంపదలు) 7 పాటలే వ్రాశారు. అందులో వాహినికి అందించిన గొంతు ఎవరిదో తెల్పి, ఆ పాట ఎందుకు పాటల పుస్తకములో ప్రచురించలేదో తెలుపుతారని ఆశిస్తున్నాను.

కే. ఉమామహేశ్వరరావు (కుమారదేవం)

* * *

బాబూమూవీస్‌వారు సమర్పించిన "మంచి మనసులు" తెలుగుచిత్రంలో ఘంటసాల వెంకటేశ్వరరావుగారు పాడిన "అహా ఆంధ్రభోజా" అన్న పాటలో "ఆ జులే పోయినా, రాజ్యాలు కూలినా, కాలాలు మారినా, గాడ్పులే వీచినా, మనుజులే దనుజులై మట్టిపాల్చేసినా, చెదరని, కదలని శిల్పాలవలనే నీవు నాహృదయాన నిల్చావే, నిల్చావే నిలిచివుండువు చెలి, నిజము నా జాబిలి" ఈ చివరి చరణాలు గ్రామఫోన్ రికార్డింగ్‌లో లేవు. కారణం చెప్పరూ?

ఎస్. రామవరావు (పెనుమలం)

* * *

"విజయావారి "మాయాబజార్"లో "ఆహా నా పెళ్ళంట...." అను పాట చివర పాడిన పురుష కంఠం శ్రీ మాధవపెద్దిగారిదా? లేక శ్రీ ఘంటసాల వారిదా?"

హెచ్. జి. శివరామ్ (బెంగుళూరు)

* * *

కొద్దిరోజుల క్రితం రేడియోలో "బాటసారి" లోని పి. బి. శ్రీనివాస్, జమునారాణి పాడిన ఒక శోకగీతం విన్నాను. ఈ రికార్డు పిక్చర్లో వినిపించ లేదు. కారణమేమిటో తెలియపరచకోంటున్నా!

కె. ఆర్. కృష్ణమూర్తి (అనంతపురం)

* * *

మీ సరాగమాల కార్యక్రమము చాలా బాగుంటోంది. నా కొక చిన్న అనుమానం వచ్చింది. తీర్చగలరని తలుస్తాను. రాజ్‌కమల్ కళామందిర్ వారి "శ్రీ" (అభిజ్ఞానశాకుంతలము) హిందీ చిత్రంలో మహేంద్రకపూర్ పాడిన "కౌన్ హూ తుమ్" అను పాట సంతోషములో, విచారములో రెండు రకాలుగా రేడియోలో వినిపించారు. కాని సినిమాలో సంతోషములో పాడిన పాట ఒక్కటే ఉంది. ఇంకొకటి లేదు. ఇది నా పొరపాటా వింటం! లేక పిక్చర్‌లో లేదా! నా సందేహము తీరుస్తారని ప్రార్థన.

ఓ. ఎస్. మూర్తి (పెడన)



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం : 2-11-62

శుభకృత్ సం॥ కార్తీకమాసం శు॥ పంచమి

సంపుటము : 55 సంచిక : 9

స్థాపితము :
1908

*

ముఖ్యసంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రూ. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.

సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టివీధి, మద్రాసు-1





ముఖచిత్రం

## లోకం పోకడ



సరిహద్దుల అక్రమణపట్ల ఆవేశం పొంద
తున్న భారత కమ్యూనిస్టు సోదరులారా
నే చెప్పేదేమంటే కమ్యూనిస్టుకు ఒక
హద్దంటూ లేనేలేదు. ఏదో ఖర్మకాలి మనం
భారతదేశంలో పుట్టినా మనం చైనాకి
రష్యాకి దగ్గిరా దగ్గిరాలకూడా చెందము
కురి!


కథలు

| | | |
|---|---|---|
| బురఖా | — | 8 |
| జీవితం | — | 16 |
| కన్నుపిశాచి-ఫ్యాన్స్ట్రిరన్ | — | 32 |

సీరియల్సు

| | | |
|---|---|---|
| హరివంశం | — | 14 |
| కుమారి కళ (బొమ్మల కథ) | — | 19 |
| విశాల నేత్రాలు | — | 23 |
| బంగారు పంజరం | — | 26 |

శీర్షికలు

ఉత్తరాలు-3, టామెన్ కార్టూన్-6, ఫ్యామిలీ రేఖ-7, వివిధప్రాంతాల వింత ప్రదేశాలు-9, రాజధానికబుర్లు-11, చిత్రవ్యక్తులు-12,22, కథకాని కథ-15, సిటీలో సినిమాలు (వ్యాసం)-17, వనితావాణి-18, మనమూ-మన దేహస్థితి-21, తమాషా-తమాషా-25, కన్నీటి కలువ (గేయం)-27, వారఫలాలు-28, పరాగమాల-31, ఇదీవరస-39, బ్రహ్మానందం (గేయం)-45, యువప్రపంచం-61, కొత్తినుడికట్టు-63.


ఛీ! పాడు కుక్క!
చైనా


పెద్దవాడికే ఆకలెక్కువ మరి!
గృహ నిర్మాణం
పరిశ్రమలు
వ్యవసాయం
రక్షణా శాఖ


అట్టే నాకేం వినిపించటం లేదే!
రష్యా
చైనా

చైనా చేస్తున్న దురాక్రమణను విమర్శిస్తూ ప్రధానమంత్రి ఇటీవల ఆకాశవాణిలో ప్రసంగించారు.

# శ్రీ కృష్ణ

జాతీయ పారిశుద్ధ్య ఉద్యమం ఈ వారంతో అయిపోయింది. ఆరోగ్యశాఖ మంత్రి గత ఈ పది హేను రోజుల్లోను ప్రశంసనీయమైన కృషి జరిపిన వారందరికీ బహుమతులు యోగ్యతా పత్రాలు ఇచ్చారు. ఈ యేటి ఉత్సవాల్లో సంసార పక్షంగా జరిగిన సుగుణం ఒకటుంది. బహుమతులు ఎవరికివ్వాలో వాళ్ళను, ఈపారిశుద్ధ్య ఉత్సవాలు ప్రారంభం కాకముందే నిర్ణయం చేశారు. సరే, ఆరోగ్యశాఖ మంత్రిగారు ఇలా ఉంటే, వ్యవసాయమంత్రి వన మహోత్సవాల్లో మునిగి తేల్తున్నారు. ఇంకో ప్రక్కన అటవీ నిర్మూలన కార్యక్రమం జోరుగా సాగుతున్నది. విద్యామంత్రికి సభలు, సమావేశాలు, గోష్ఠులూలాంటి వాటితో తీరికే ఉండటంలేదు. వీటన్నిటి ఫలితాలు విద్యారంగంలో ఒకే గంద్రగోళం అన్ని విషయాల్లో ప్రమాణాలపతనం. ఒప్పందాల ద్వారా మన దేశంలో సాంస్కృతిక, శాస్త్రీయ పరిశోధనలు జరగటానికి మన సాంస్కృతిక వ్యవహారాల మంత్రి బాధ్యులు. ఓ కొన్ని లక్షల రూపాయల ఖర్చుతో ఢిల్లీలో ఆరుబయట రంగస్థలాన్ని ఒక దాన్ని నిర్మించారు. జాతీయ రంగస్థలమనేది ఒకటి ఇంకా పథక రూపంలోఉంది. వీటన్నిటికీతోడు, ఢిల్లీని మురికి ప్రాంతంగామార్చే ప్రయత్నాలుకూడా జోరుగా సాగుతున్నాయి. ఒకప్పుడు పారిశుద్ధ్యానికి నిదర్శనంగాఉండే కేంద్ర సచివాలయంలో ఆఖరి అంతస్థు గదులను కూడా మురికి కూపాలుగా తయారు చేశారు. అసలీ మురికి పేటలు నిర్మాణం జరిగేటప్పుడు ఆ వాడల్లో వాళ్ళని కదిలించనేకూడదట! ఇక జరగాల్సిందల్లా మురికివాడల అభివృద్ధి. ఈ అభివృద్ధి [illegible] వృద్ధినిబట్టికాక, అయిన ఖర్చు అభివృద్ధినిబట్టే నిర్ణయించాల్సి ఉంటుంది!

పరిశ్రమల సలహా మండలి ముందు కేంద్ర వాణిజ్య, పరిశ్రమల మంత్రి శ్రీ కె. సి. రెడ్డి చేసిన ప్రసంగంపై ఇంకా చర్చ కొనసాగుతూనేఉంది. ఈ చర్చలో రెండు ముఖ్య విషయాలు అడుగున పడి పోయాయనిపిస్తుంది. తృతీయ పంచవర్ష ప్రణాళికలో లభించగల 2,600 కోట్ల రూపాయల విదేశీ సహాయం, ప్రణాళికలోని మొదటి 18 నెలల్లోనూ ఇచ్చిన పరిమితి అధిక లైసెన్సులు ఈ మరుగునపడ్డ ముఖ్యాంశాలు.

ప్రణాళికలో విదేశీ సహాయం అనేది కేవలం పి. యల్. 480తో, దిగుమతులకే చెందుతుంది. ప్రణాళికాకాలంలో వివిధ ప్రాజెక్టులకు కావలసిన ముఖ్య సామగ్రి దిగుమతికిగాను 1,900 కోట్లు కూడ లోగడ చేసిన కొన్ని వాగ్దానాలను పూర్తి చేసేందుకుగాను మళ్ళీ వెచ్చించాల్సిన ధనం రు. 500 కోట్లు, నిత్యావసరమైన దిగుమతి వస్తువులకు అయ్యే రు. 200 కోట్లు కూడా ఈ సహాయంలోనే వస్తాయి. ప్రణాళికలోని ఈ అంశాన్నిగూర్చిచర్చిస్తూ ప్రణాళికా సంఘం ఇలా పేర్కొన్నది:

"దేశీయమైన సంపదల్లో ఏదైనా కొద్దిగా కొరత ఏర్పడితే కొద్దిగా ఆర్థిక విధానాన్ని కుంచించి, ఖర్చు చేసుకోవచ్చు. విదేశీ ద్రవ్య మారకం అనేది మనకున్న ప్రత్యేక ఆదాయం. భారీ ఎగుమతుల ద్వారాగానీ, నిరంతరం విదేశీ సంపదల దిగుమతి ద్వారాగాని సంపాదించుకోగల ఆదాయం ఇది."

సరే బాగానేఉంది. ప్రణాళిక ఆరంభంలో 18 [illegible] మాటేమిటి? విదేశీ వాణిజ్యం మనకు తృప్తికలిగించేటంతగా పెరగలేదు. అసలు పెరుగుదల అంటూ ఉంటే అది ఎగుమతి, దిగుమతుల సంఖ్యలోనే తప్ప ధన రూపేణా పెరుగుదలమాత్రం కాదు. పైగా విదేశ సహాయావకాశాలు ప్రణాళికారంభంలో అంటే 1961 ఏప్రిల్ 1 నాటికివున్నంత ఆశాజనకంగా ఆ తరువాత లేకపోయాయి.

తృతీయ పంచవర్ష ప్రణాళిక అంతటికీ రు. 450 కోట్లు కేటాయించగా, ప్రణాళికారంభమైన 9 నెలల్లోనే సుమారు రు. 400 కోట్ల రూపాయల విదేశీ ద్రవ్య మారకపు విలువతో పరిశ్రమలకు లైసెన్సులు ఇచ్చారు. పరిమితికి మించి లైసెన్సు ఇవ్వటం కూడా జరిగింది. ఉదాహరణకి థాలిక్ ఏన్ హైడ్రైడ్ తయారీ సంస్థను తీసుకోవచ్చు. బిటానేఫ్థాల్ అనేది అద్దకంలో ప్రేరకంగా పని చేస్తుంది కనక చాలా ముఖ్యమైంది. ఇలాంటి ప్రేరకాలన్నిటి తయారీకి ప్రభుత్వ రంగంలో ప్రాజెక్టు ఉండనే ఉంది. అయినా ఈ పరిశ్రమకు లైసెన్సు ఇవ్వటం జరిగింది.

విదేశీ ద్రవ్య మారకం రు. 10 లక్షలకుమించే ఏ పరిశ్రమకు (అఖరికి ఉచితంగా లైసెన్సులిచ్చే వాటితో సహా) లైసెన్సులు ఇవ్వవద్దని కేంద్ర, ఆర్థిక శాఖ వాణిజ్య పరిశ్రమల శాఖకు ఈఏడు మార్చినెలలో సలహా ఇచ్చింది. అంతే గాకుండా వాణిజ్య పరిశ్రమ శాఖ ఏ పరిశ్రమనైనా అనుమతులు ఇచ్చేముందు ఆ పరిశ్రమ అవశ్యకత, ఎంతవరకు విద్యుత్తు, రవాణా సదుపాయాలున్నాయనే విషయాలు క్షుణ్ణంగా పరిశీలించమని కూడా ఆర్థికశాఖ సలహా ఇచ్చింది.

62-వ పేజీ చూడండి



ఉదయంనుంచి వెల్లువెదురుగాఉన్న మేఘాలు గర్భాల్ని 'గడువుచెప్పని' ఇవ్వని పమ్మెదారుల్లా కూడుకొని భోరున వర్షం కురవ నారంభించింది. యాతాయాత జనం వికావికలై ఎక్కడ చోటు దొరికితే అక్కడ తలదాచుకుంటున్నారు.

చీర కుచ్చెళ్ళు పైకెత్తి సంధ్య నాలుగు వేపులా చూసింది. అనువైన స్థలం ఎక్కడా కనిపించలేదు. అర ఫర్లాంగుదూరంలో ఒక పోర్టికో ఉన్నది. కాని, అక్కడకు చేరుకోవడమంటే తడిసి ముద్దయిపోవడమే! వెనక్కు తిరిగి చూసింది. చిన్న 'టీ' దుకాణం కనిపించింది. అదే గత్యంతరమైంది.

ఆకాశాన్ని చీల్చుకుంటూ మెరుపులు పేచ్చా విహారం చేస్తున్నాయ్! ఉరుములు ఉవ్వెత్తుగా విజృంభిస్తున్నాయ్!......సంధ్య దుకాణం పంచలో చేరుకున్నది. మిఠాయీలున్న అద్దాల డొక్కుకు వీపానించి నిల్చున్నది. ఉన్నట్టుండి వర్షంజల్లు దుకాణంలోకి కొట్టనారంభించింది. సంధ్య చీరనూ, ముఖాన్నీ వాన తుంపర ఆక్రమించింది. పాపం ఆమె ముఖానికి చేతులడ్డం చేసుకొని కంగారుపడుతున్నది. —56 వ పేజీ చూడండి

## వివిధప్రాంతాల వింతప్రదేశాలు-8




సింగపూర్ చూడాలని చాలా చాలా దూరం నుంచి సైతం వస్తారు విలాస యాత్రికులు. వారిని యెంతమాత్రం నిరుత్సాహపరచదు సింగపూర్. సింహపురం అన్నందుకు ఆ పేరు సార్థకం చేసుకుంటుందది. ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాల ముద్రలు దీనిమీద బాగా వుంటాయి. రకరకాల ప్రజలు, మతాలు-వారివారి ఆచార సంప్రదాయాలు యిక్కడ వేటికవే చెక్కు చెదరక వుంటాయి.

సింగపూర్ 220 చదరపు మైళ్ళ వైశాల్యంగల ద్వీపంమీద వున్నది. సాహెబ్‌లు, దొరలు, 'ఆసామీ'లు కంట్రాక్టర్‌లు మొదలు సాధారణ కూలీనాలీల వరకూ యిక్కడ అందరూ అగుపిస్తారు. 1958 నుంచి దీనికి స్వయంప్రతిపత్తి ఏర్పడింది.

సింగపూర్‌లో సర్దాగా కులాసాగా గడిపేవారికి చాలా పెద్ద పెద్ద అమ్యూజిమెంట్ పార్కులు, అందులో బాక్సింగ్‌లూ, కుస్తీలూ ఇతర వినోదాలు వుంటాయి.

చైనా, మలయా సంప్రదాయ బద్ధమైన నాటకాలు, డ్యాన్సులూ, ఆటపాటలు ముమ్మరంగా వుంటాయి. ఇక పిల్లలికి పరమానందంగా వుండే పార్కులో లేని వస్తువూ, జంతువూ లేదని చెప్పాలి. దీన్ని "ఓరియంటల్ పార్క్" అంటారు. ఇందులో 'పగోడాలు', 'బొమ్మలు', 'శిల్పాలు' మొదలు రకరకాల పురాణ గాథల శిల్పాలు, చిత్రాలు, జంతువులూ, పక్షులూ అన్నీ వున్నాయి.

సుల్తాన్ మసీదు దగ్గర అరబ్ వీధి అని ముస్లిం ప్రాంతముంది. ఇదంతా పూర్తిగా మహమ్మదీయ సంప్రదాయాలతో, మార్కెట్లతో, ప్రార్థనలతో నిండి వుంటుంది. ఇక ఇక్కడ ఘుమఘుమలాడే అత్తర్‌లూ వాసనలు సెంట్లూ మత్తెక్కించేస్తాయి.

త్వరలో హిందువుల పేటవున్నది. పంచెలవాళ్లు, తలపాగలవాళ్లు, చీరెలవాళ్లు కళకళ లాడుతూ అగుపిస్తారు.



సింగపూర్‌లోని ఒక వీధిలో ట్రిక్షాబండి

మసాల కూరల వాసనలు కూడా బాగా వస్తాయి.

అన్నింటికన్నా ఎక్కువైనది చైనా క్వార్టర్సు. జనసమ్మర్దం, హడావుడీ జాస్తి. ఇక ఇవన్నీ తిరిగి హోటల్లోకి వచ్చి చేరామంటే, బాగా అలసివుంటామేమో-అదో స్వర్గంలాగుంటుంది. హోటల్‌లో సదుపాయాలు చాలా బాగా హాయిగా వుంటాయి. ఈతలకు పైర్లకు ఏర్పాట్లు వుంటాయి.

ఇక రకరకాల వస్తువులు ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకు చెందినవి ఇక్కడ అమ్ముతారు. దుకాణాలు చాలా చూడ సంబరంగా వుంటాయి. వస్తువులు చౌకగా వుంటాయి. ఆశ్చర్యం యేమిటంటే యీ వస్తువుల ధరలు అసలు అవి తయారైన దేశాలలో కంటే యిక్కడే తక్కువ! సింగపూర్‌లో రిక్షాలు కాదు. ట్రిక్షాలు (బొమ్మ చూడండి) వుంటాయి!

టెంపిల్ మానింగ్





హైదరాబాదులోని రవీంద్ర భారతి థియేటర్‌లో ఈ నెల 19న జరిగిన గురజాడ శతజయంతి ఉత్సవసభకు సమాచారశాఖమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షత వహించారు.

**రాజధాని కబుర్లు**

# నగరంలో ఉత్సవాల సంరంభం
# అంగ్రేజీహటావో ఉద్యమం ఆరంభం

**బి. ఎల్. ఎస్.**

విశాల హైదరాబాదు నగరమంతా రకరకాల సంరంభాలలో పూర్తిగా మునిగిఉంది. ఓ ప్రక్కన సభలు, సమావేశాలు, సెమినార్లు జరుగుతూ ఉంటే, మరోవైపేమో ప్రారంభోత్సవాలు, ఆవిష్కరణోత్సవాలు, స్నాతకోత్సవాలూను. ఇంకోచోట నిరశనవ్రతాలు, ఆందోళనలు ప్రారంభ మయ్యాయి. ఎవరి గొడవ వారిదే! దేనికదే ప్రత్యేకత. అన్నీ కూడా యాంత్రికంగా సాగిపోతున్నాయి.

పుష్టికరమైన ఆహార సమృద్ధికోసం చేయవలసిన కృషి విషయంలో చర్చకుగాను ఓ సెమినారు ఏర్పాటయింది. ఇతర దేశాల్నుంచి కూడా ప్రముఖులు చాలామంది విచ్చేసి వారివారి అమూల్య సలహాలను ధారాళంగా ఇచ్చేశారు. ఇంతకీ ఏమిటి వీళ్ళు తేల్చింది అంటే, పల్లెపట్టున నివసించే అశేషమైన జనానికి, పుష్టిగల ఆహారమంటే ఏమిటో తెలీదని, వాళ్ళింకా అజ్ఞానంలోనే ఉన్నారని, వారికి పుష్టిగల ఆహారమంటే ఎట్లా ఉంటుందో తెలుసుకోడానికి వీలుపడే విజ్ఞానం ప్రసాదించాలని; చాలా గొప్పగా ఉంది! ఏ తిండి తింటే మనిషికి శక్తినిస్తుందో ప్రజలకు తెలీకనా! అలాంటి తిండి దొరకనప్పుడు చేసే పనేమిటి! ఉన్నదాంతోనే తృప్తిపడి ఊరుకోవటం! అదే ప్రస్తుతం అందరూ చేస్తున్న పని! అంతమాత్రంచేత ప్రజలకు పుష్టికరమైన తిండి అంటే—విషయమే తెలియదంటే ఎట్లాగు! అసలు పుష్టికరమైన ఆహారమంటూ ఎక్కడైనా కలినిపిస్తోందా అని! ఓవేళ అంత అదృష్టమే కలిగితే దానిని పొందగల కొనుగోలు శక్తి ప్రజల్లో ఉన్నదా? ఈ రెండూ కూడా పూజ్యమే!

శాకాహారులకు పాలు, పెరుగు, వెన్న, పళ్ళూ వగైరాలు తీసుకుంటూఉంటే శక్తి వస్తుందని తెలుసు. అయితే ఆ పాలు లభించేదెట్లా! ఎన్ని పాల సరఫరా కేంద్రాలు పెడితే, లక్షల ప్రజలకు పాలు సప్లయి అవుతుంది. ఇక 'బర్రెల్ని' ఇళ్లకు తీసుకువచ్చి, మన కళ్ళ ఎదుటె స్వచ్ఛంగా పాలు పిండి పోస్తామని బెదిరిస్తూ ఉంటారు. పిల్లదో పెద్ద నాటకం. తీసుకువస్తారు గేదెల్ని. 'జీతగాడు' చెంబులు, 'దూడల్ని' పట్టుకు వస్తాడు. సర్కసులో కోతుల్నాడించినట్లు, ఈ వచ్చిన సాధు మృగాన్ని కాస్సేపు మన కళ్ళ ఎదుట ఆడించేసి పాలివ్వటం లేదమ్మ, తంతున్నాయి అంటూ వెనక్కు తీసుకుపోతారు. తప్పవూ మరి! తామిచ్చిన పాలు సూటిగా పొయ్యకుండా అవీ ఇవీ కలుపుతూ ఉంటే? ఓ అరగంటకు చెంబుల్నిండా పాలు నింపుకుని జీతగాడు వస్తాడు; వాడికల వాళ్లను ఉద్ధరించటానికి! ఎక్కడినుంచి వచ్చిపడ్డాయి ఇన్ని పాలు! పొడరుపాలు. అది గాకపోతే, అమాం బాపతు కల్తీలు కలిపి తెచ్చి, పాలని నమ్మమంటారు. వేరే గత్యంతరంలేక అవే తీసుకోవటం, ఇలాంటి పాలు సేవించిన తర్వాత, ఎలాంటి శక్తి వస్తుందో ఇంకా చెప్పక్కర్లేదు! పాల గతే ఇట్లా ఉంటే, దానిమీద నుంచి రావాలసిన పెరుగూ, వెన్న విషయం ప్రస్తావించటం అనవసరం.

— 52వ పేజీ చూడండి



# పసందైన పద్మనేత్ర : సుందరాంగి సుజాత

"అమ్మా—నేను సినిమాల్లో వేస్తానే"— అప్పటి సుజాత ఒకమాట—మాటలువస్తున్న 'ముద్దు' తొజల్కు! "అట్లాగేనమ్మా" అన్నది వాళ్లమ్మగారు. ఐతే అంతలోనే ఆమెకు పెద్ద సందేహమే కలిగింది. ఇంత చిన్న వయస్సులో ఈ పిల్లకు అంత పెద్ద ఆలోచన ఎట్లా వచ్చిందని ఆమె ఆలోచించసాగింది. ఈ ఆలోచన ఆ పిల్లకు ఎవరో కలిగించిందికాదు—ఆమెకే కలిగింది! తెరమీద చూసేవి బొమ్మలుకావు, మనుష్యులే వేషాలు వేసుకుని బొమ్మల్లాగా కదులుతారు అని కూడా ఆ పిల్లకు తెలిసిపోయింది!..... ఇవన్నీ పెద్దవాళ్లెవరో చెప్పిఉంటారుగాని—వేస్తానని అన్న ఆలోచన మాత్రం ఆమెదేనన్న నిర్ధారణకు వచ్చింది—సుజాత తల్లిగారు.

సినిమాలు చూడటం అంటే పాయసం తాగినంత ఇష్టం ఆ అమ్మాయికి. సినిమా అంతా చూశాక అందులోఉన్న ఒకటి రెండు పాటలను ఇంటికొచ్చి పల్లవి దాకానన్నా సాధించేది. సినిమాలో నృత్యం జరుగుతున్నప్పుడు ఆ పిల్ల కాలితో తాళం వేసేది, పాటవస్తే చేత్తో తాళం వేసేది! ఈ ఉత్సాహాన్ని చూసే సుజాత తలిదండ్రులు ఆమెకు నాట్యం నేర్పించాలనే నిర్ణయానికివచ్చి నాలుగోఏటనే నృత్యం నేర్పించారు. అభిలాషఉన్న పిల్ల కాబట్టి—కొద్ది నెలల్లోనే ముచ్చటగా నృత్యం చెయ్యటం అలవరచుకున్నది. అది అంతలో ఆగిపోలేదు— ఆ పిల్ల నృత్య ప్రదర్శనా లివ్వటం కూడా సాగించింది. 'సుజాత అండ్ పార్టీ' అన్న పేరుతో ఆరవఏటనుంచీ ఊరూరా నాట్య ప్రదర్శనా లిచ్చేది! ముద్దు ముద్దుగా, ముచ్చటగా అడుగులు వేస్తూ, చేతులూ, కళ్లూ లక్షణంగా తిప్పుతూ ఆడుతూఉంటే ప్రేక్షకులు సరదా పడేవారు. మొత్తం రెండు మూడు గంటల ప్రదర్శనమూ ఆ పిల్ల ఒక్కతే ఇచ్చేది!

అట్లా ఆ అమ్మాయి మైసూరు, బెంగళూరు, నల్గొండజిల్లా మొదలైన చాలాచోట్ల నాట్య ప్రదర్శనాలు ఇచ్చింది—చాలా బహుమతులు కూడా తెచ్చుకున్నది. గ్రీన్‌రూములో ఆ అమ్మాయికి వేషం వేసి—స్టేజిమీదకు ఎత్తుకుని తీసుకొచ్చేవారు! ఒక్కొక్కప్పుడు ప్రదర్శన ప్రారంభం కావటానికి ఏదన్నా ఆలస్యంఉంటే ఆ అమ్మాయి చక్కగా నిద్రపోయేది. ప్రదర్శనవేళకు పెద్ద వాళ్లెవరో లేపి తీసుకెళ్ళి స్టేజి ఎక్కించేవారు. ఎంత ఆకలివేస్తున్నా, నిద్రవస్తున్నా సరే—ఆ అమ్మాయి డాన్సు అంటే మాత్రం అవన్నీ మరిచిపోయేది. మంచి నిద్రలో లేపి—"డాన్సు చేస్తావుటే" అని ఎవరన్నా అడిగితే—"ఓ"అని లేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని—అంతే పువ్వుల్లే పరికిణి నేలమీదపరచుకుంటూ కూచుని—ఆట ప్రారంభించేది.

అట్లా—చిన్నప్పట్నుంచీ సుజాతలోఉన్న ఈ ఉత్సాహం 'ఇంత' అని చెప్పటానికి లేదు......

1944 వ సంవత్సరం సెప్టెంబరునెల 2 వ తేదీన సుజాత తెనాలిలో పుట్టింది. వాళ్ల నాన్నగారు ఇప్పుడు కూడా అక్కడేఉండి వ్యవసాయం చూసుకుంటున్నారు. సుజాతే వాళ్ళ ఆఖరి సంతానం. ఆ అమ్మాయికి ఇద్దరు అన్నయ్యలు. ఒకాయన ఉద్యోగంలోనూ, ఇంకోయన చదువులోనూ ఉన్నారు. చెప్పొచ్చేదేమిటంటే వాళ్ళింట్లో ఎవరికీ ఈ 'పిచ్చి' లేదు. వాళ్ళ నాన్నగారు ఏనాడూ స్టేజి మొహమన్నా చూసి ఎరగరు. ఆమె అన్నయ్యలకు కనీసం ఆ సరదా అన్నాలేదు. ఐతే సుజాతకుమాత్రం ఆ ఉత్సాహం చిన్నప్పుడే అబ్బింది. ఆ ఉత్సాహానికి బాగా ప్రోత్సాహం ఇచ్చింది వాళ్ళమ్మగారు.

ఓమూల డాన్సు నేర్చుకుంటూనే నృత్య ప్రదర్శనాలు ఇస్తూనే సుజాత బడిలోచేరి బుద్ధిగా చదువుకోనారంభించింది. తెనాలిలోఉన్న ఆడపిల్లలబడిలో ఆ అమ్మాయి ఐదోఫారందాకా చదువుకొన్నది. అప్పుడే నటి శారద కూడా అక్కడ చదివేది. శారదా, సుజాతా ఒక తరగతిలోనే చదువుకునేవాళ్లు. బడిలో చదువుకుంటున్నప్పుడు—బడిలో కూడా సుజాత నాట్యాలు చేసేది.

ఒకసారి బడిలో 'శకుంతల' నాటకం వేశారు. అందులోని దుష్యంతుడి పాత్రను సుజాతకు ఇచ్చారు. నాటకంలో వేషం వెయ్యటం ఆ అమ్మాయికి అదే ప్రథమం! ఐనా— చక్కగా చేసిందని టీచర్లంతా మెచ్చుకున్నారు. టీచర్లు మెచ్చుకోవటంతో ఊరుకోలేదు. "అమ్మాయ్, నీవు సినిమాల్లో వేషాలు వెయ్యరాదూ!" అని ప్రోత్సహించ సాగారు. చిన్నప్పట్నుంచీ సినిమాలో వేషం వెయ్యాలని ఉబలాటపడుతున్న సుజాతకు టీచర్ల మాటలు మరింత మధురంగా వినిపించసాగాయి. తనకైతే సినిమాలో వెయ్యాలని ఉందిగాని— ఎట్లా?......ఈ మాటలు విన్నప్పుడల్లా సుజాత, తన తల్లితో అనేది. "మనకు సినిమాల్లో ఎవరిస్తారమ్మా!" అని వాళ్లమ్మగారనేదేగాని, లోపల్లోపల మాత్రం తన కుమార్తె కోరిక తీర్చటం ఎట్లాగా అని ఆవిడ మథనపడేది.

ఇట్లాఉండగా—సుజాత టీచరు ఒకావిడ, సుజాతకు రికమెండేషను ఉత్తరం ఇచ్చింది. ఆ ఉత్తరం డి. యల్. గారికి. డి. యల్.గారు అప్పుడు 'సిపాయి కూతురు' నిర్మిస్తున్నారు. సుజాత ముందుగా ఫోటోలు పంపింది. కొన్నాళ్ళకు ఆమే మద్రాసు వచ్చింది—తల్లిని తీసుకుని. ఆ అమ్మాయిని చూసి— "అమ్మాయ్, నీవు చాలా చిన్నపిల్లవు. ఇంత చిన్న వయస్సులో నీకు వేషాలు దొరకాలంటే—ఆ ఈడు పాత్రలు అరుదుగా ఉంటాయి. కొన్నాళ్ళు పోయాక,

మళ్లీ రా!" అని డి. యల్ గారు సలహా ఇచ్చారు. ఈ సలహా నచ్చినా, నచ్చకపోయినా, ఇక్కడ చేసేది ఏమీ కనిపించక, సుజాత వాళ్ల ఊరెళ్ళిపోయింది!

సుజాతను సినిమాల్లో పెట్టాలని వాళ్ల నాన్న గారికి ఏ కోశానా ఆలోచనలేదు; అన్నయ్యలకూ అసలు లేదు. ఆ అమ్మాయికి పెళ్ళి చెయ్యాలని వాళ్ళ నాన్న గారు ఒక సంబంధం కూడా మాట్లాడుకొచ్చారు. ఈ మాట విని, సుజాత కొయ్యబారిపోయింది. తనకు పెళ్లా!........ఐతే ఇకమీదట తను నాట్యానికీ, నాట కాలకూ స్వస్తిచెప్పి, సంసారంలో పడాలన్నమాట! తన సినిమాలు?......సినిమాల్లో నటించాలని ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్నదే తను! మరెట్లా?......పెళ్ళి చేసుకొంటే, ఆ భర్తకు ఇవన్నీ నచ్చకపోవచ్చును. అప్పుడింక తన కోరిక గాలిలో కలిసిపోవలసిందే! తన ఊహలన్నీ నీటిమీద గీసిన గీతలల్లే కలిసిపోవలసిందే నన్నమాట!.......

"నాకు పెళ్లొద్దు నాన్నా!" అన్నది సుజాత తప్పీమని.

ఈ మాట విని ఆయన కొయ్యబారిపోయినారు. తాను అన్నీ నిశ్చయం చేసుకొచ్చారు—ఇంక తాంబూలాలు ఇచ్చి పుచ్చుకోవటమే తరవాయి! ఇటువంటి సమయంలో ఈ పిల్ల ఈ మాట ఎందుకన్నదో ఆయనకు అర్థం కాలేదు!

"ఏంచేత? అబ్బాయి నచ్చలేదా?" అని అడిగా రాయన.

సుజాత సమాధానం చెప్పలేదు.

"బాగా చదువుకున్నవాడు కావాలా? అందగాడు కావాలా?" అని మళ్ళీ అడిగా రాయన.

దీనికీ ఆ పిల్ల సమాధానం ఇవ్వలేదు.

"ఏమంటావో చెప్పు" అన్నా రాయన.

కొన్ని నిమిషాలపాటు సుజాత మౌనం వహించి "ఊహూ - నాకొద్దు" అన్నది బుంగమూతిపెట్టి. వాళ్ల నాన్నగారు, వాళ్లమ్మగారిచేత అడిగించగా తేలినసారాంశం ఏమిటంటే—తాను సినిమాల్లో వేద్దామనుకుంటు న్నది—ఇప్పుడీ పెళ్ళి అంటే సినిమాకు ఆటంకం కలగవచ్చును! తన ఉత్సాహం అంతా భంగమై కూచుంటుంది!

పెళ్ళిప్రయత్నం రద్దయిపోయింది. సుజాత, వాళ్లమ్మగారూ ఒకనాడు బయల్దేరి మద్రాసు చేరుకున్నారు. ఎక్కడో చిన్న ఇల్లు తీసుకుని, సుజాత సినిమా ప్రయత్నం మొదలెట్టింది. మద్రాసు వచ్చినా ఆమె నాట్యాలు మానలేదు. ఇక్కడ కూడా ఆమె శ్రద్ధగా నాట్యం అభ్యసించసాగింది. ఇంతలో సుజాతకు మంచి నాటకం ఛాన్సు ఒకటి తగిలింది.

—49వ పేజీ చూడండి



ఆర్. ఆర్. పిక్చర్సువారి ప్రొడక్షన్ చిత్రంలో నాగభూషణం

సుబర్ణాఫిలిమ్సువారి "మహాభారతము"లో శ్రీకృష్ణుడుగా మహీపాల్.

# హరివంశము

హారీత శివశర్మ

## ఉజ్జయినీపర్వం-3

రాజాధిదేవి దేవాలయములో ప్రవేశించినది. మహారాణి వచ్చునని అర్చకులకు తెలియునో, ఏమో, వారు దేవాలయమును ప్రమథులు కైలాసమునువలె నలంకరించిరి. మహారాణికి అది చూడగా నాశ్చర్య మైనది. తాను వచ్చునని దేవాలయాధికారులకు కబురు పెట్టలేదు. మరి ఇట్టి అలంకారము లెట్లు జరిగినవి. రాజాధిదేవి అర్చకులతో నన్నది:

"స్వాములు! దేవాలయమును బాగుగా నలంకరించినారు. రెండవ కైలాసమువలెనున్నది. అవును. మహాకాళనాథుని కిది రెండవ కైలాసము—తల్లి కూడా ఇక్కడ నున్నట్లనే వెంచేసియున్నది. ఏమందురు?"

అర్చకులలో ఒక్కడు ఉట్లనినాడు:—"ఏమనుట కేమున్నది తల్లి! తాము అన్న మాట బాగున్నది."

"అది సరే! దేవాలయము నిట్లు శిల్పుల నలంకరించినారు?"

"తమకు తెలియదా!"

"మరి మహారాజులు నాకు తెలియనిత్తురా! నాకు తెలియకుండా నన్నియు చేయుట ఆయనకు నైజము."

"తల్లీ! ఆచార్య సాందీపని మన గ్రామము వచ్చినట. ఆయన మహాకాళనాథునకు పరమభక్తుడు కదా! మొదట నాయన మన ఈ దేవాలయము లోని పాఠశాలయందే అక్షరాభ్యాసము చేసెను. తర్వాతగాని, కాశికి పోలేదు. ఇప్పుడాయన తిరిగి మహాకాళనాథుని సేవించుటకు వచ్చుచున్నారు. మహారాజులు దేవాలయమునందులకు తగినట్లు అలంకరించవలసినదిగా ఆజ్ఞ ఇడినారు. చూచుచున్నారు గదా ఇంకను శిల్పులు పనిచేయుచున్నారు."

రాజాధిదేవి యంతయును చూచినది. పరమశివుని లీల లన్నియు దేవాలయ భిత్తికలపై రచింపబడు చున్నవి. విచిత్రమేమనగా ఒక్కచో సముద్రమథనము, పరమశివుడు హాలాహలమును మ్రింగుట, విష్ణువు మోహినియై అమృతమును దేవతలకు పంచుట, మరియు నా విష్ణువు శివుని యానతిమతో శివు రించుట—అన్నియు మరియుసుందరముగ రచింపబడినవి. ఆ భిత్తికా చిత్రమును చూడగా మహారాణికి నవ్వు వచ్చినది. తనలో తాను అనుకొనుచున్నట్లు టిట్లు లన్నది.

"మహారాజు లెంతయైనను పరమ శివభక్తులు. మా పుట్టినింటి వంగడమున విష్ణువవతరించుట ఎరిగి, ఇది మరియు రచింపజేసియుందురు."

అనుకొని, ఆమె యుసురిరనుకొన్నది. ఆ విష్ణువు శ్రీకృష్ణుడా! వానికి ఈ తన కూతురు తాను భార్య గల్గునో! ఆమె వామాక్షి ద్వితీయయై చిత్రములను తిలకించుచున్న కూతునుచూచినది. ఒక్కచో వామాక్షి ఏమో యనుటయు, మిత్రవింద సిగ్గుపడుటయు, ఆమె గమనించినది. తానును అచ్చటికిపోయినది.

అచ్చట మరియు విచిత్రములైన చిత్రములు రచింపబడినవి. శివుని దారుకా వన విహారము ఒక చెంపను, శ్రీకృష్ణునిచే గోపికల వస్త్రము లపహరింపబడుట మరియొక ప్రక్కను రచింపబడినవి. మహారాణి వానినిచూచి ముందు ఆశ్చర్యపడినది. తరువాత నవ్వినది.

"మహారాజు ఎంతకైనను తగుదురు" అన్నది. అర్చకులును నవ్వినారు.

మిత్రవింద మరియు సిగ్గుపడినది.

వామాక్షి అన్నది:—వదినె! మా అన్న నీ వస్త్రములను అపహరించడులే! అందుకుముందు నిన్నపహరింపవలయునుగదా!

మహారాణి హరల ఉస్సురనుకొన్నది. తన పుత్రులేమో, దుర్యోధనుని మెచ్చుకొనుచు, వాడు ధృతరాష్ట్రుని తోవలె, వీరు తమ తండ్రితో వ్యవహరింప ప్రయత్నించుచున్నారు. ఒక్కసారి తాను ఆ తండ్రీ, బిడ్డల సంభాషణమును విన్నది. వారు ఆయనముందు దుర్యోధనుని గొప్ప తనమును చెప్పు చున్నారు. పాండవులు—వారు తమ నెరుగుదురు—దుర్మార్గులట. వారు ఎవరికి జన్మించిరి? మనుష్యులకు మనుష్యులు జన్మింతురు. వీరు దేవతలకు జన్మించినారటయ్యు! ఇదే విచిత్రము. బిరుకులేక పెద తల్లినిగూర్చి వారు అట్లు మాటాడుట! మరి దుర్యోధనుడు చెప్పినట్లు, అతని తండ్రి వినునట్లు అతడు రాజులకు రాజు కాతగ్గవాడు. మరి పాండవులకు రాజ్యమేమిటి? ధర్మునకు యౌవ రాజ్యమేమిటి? ఇట్లుగా వారు తండ్రి ఎదుటపడి మాట్లాడు చున్నారు. ఆ తండ్రి వారిని ఆజ్ఞలో పెట్టుటలేదు. ఆయన పరిహాసప్రియుడగుట ఇందులకు కారణమో! తెలియదు. అంతలో తాను వారియున్న చోటునకు వచ్చినది. మహారాజ తనతో నన్నారు: ఓసీ! రాజాధి! చూచినావా! పుత్రుల గొప్పతనము. వీరు దుర్యోధనులు కాగోరుచున్నారు. మరి నేను ధృతరాష్ట్రుడను పుట్టు గ్రుడ్డిని కావలదా! మహాకాళనాథుని దయవలన కాలేదు. మరి వీరు దుర్యోధను లెట్లగుదురు. వారికి అది చెప్పుము" అని నవ్వుచు వెడలిపోయినారు. తనకు ఆ నవ్వు రాలేదు. ఆ పుత్రుల విపరీత ధీకలత తమ్ము కలవర పెట్టినది. ఇప్పుడు వీరు తండ్రి చాటున, మిత్రవిందను గురించి దుర్యోధనునితో రహస్య మంతనాలు లాడుచున్నట్లు గూఢ వినుచు చున్నది. ఇంతయు తలపోసి ఆమె "ఓయి! మహాకాళ! అంతయు నీమీద నున్నది" అనుకొన్నది.

పరమశివుడు తనకూయిని వినుడా! ఆమె శివుని దర్శించియున్నది. "స్వామి! నీవు పరమనిర్లిప్తుడవు. అమ్మవారు పార్వతియై నిన్ను కోరిరాగా, మన్మథుని గూడా భస్మము చేసినావు. తుదకు అమ్మను చేసికొనక తప్పినదా! మా అమ్మ యాదవులకుల దైవము. పట్టుదల కలది స్వామి! నీయంత తపస్సు ఆమె చేసినది. ఆమెను మేము ఆరాధించుచున్నాము. నాతల్లిచేత గూడా తల్లినే ఆరాధింపజేయుచున్నాము. నాతల్లి నాతల్లినితప్పక కరుణించును. ఆమె శరీరములో సర్ధము నీవు స్వీకరించితివా యేమి. నీ కరుణ లేక ఎట్లు! నీవును విష్ణువును మిత్రులందురు. నీవే, విష్ణువనిగూడా యందురు. నీకును, విష్ణువునకును అభేదమందురు. ఆ విష్ణువు మా పుట్టినింటి వంగడమున శిశువై జన్మించినాడయ్యా! మహాకాళ! వానిని నాతో కూతుతో, నిన్ను హిమవంతుని భార్యమేన

64 పేజీ చూడండి

# కథ కాని కథ

## తమ్ముని తెలివి!

(మొదటి బహుమతి)

నేను నా తమ్ముడు ఒక రోజు అంగడికి వెళ్లాం. నావద్ద ఐదు నయా పైసలున్నవి. నా తమ్ముడివద్ద రెండు నయాపైసలున్నవి. మా తమ్ముడు వాడి రెండు నయాపైసలకు పిప్పరమెంట్లు కొన్నాడు. నేను నా ఐదు నయాపైసలలో 3 నయాపైసలకు పిప్పరమెంట్లు కొన్నాను. నాకు రెండునయాపైసలు తిరిగి రావాలి గనుక అంగడివాడు మా తమ్ముడిచ్చిన రెండు నయాపైసలే నాకు ఇచ్చాడు. మా తమ్ముడది చూచినాడు. ఇద్దరమూ ఇంటి కెళ్లాము. మా తమ్ముడు నన్ను తన రెండు నయాపైసలు తన కివ్వమని గోలచేశాడు. నేనెంత చెప్పినా వాడికి అర్థముగా లేదు. ఏడుస్తూ వెళ్లి మా నాన్నతో చెప్పాడు. నాన్న నాచేత యిప్పించారు. అప్పుడు మా తమ్ముడు ఏడుపు మానివేశాడు. నాన్నగారు వేరే నాకు రెండు పైసలు యిచ్చారు.

కు. శ్రీనివాసమూర్తి, (కొల్లిపొట్టుఖండ్రిక)

## సాహసం!

(రెండవ బహుమతి)

ఆ రోజు వాల్తేరులో మా గది నుంచి 'రూముమేట్సు' ము ముగ్గురం ముస్తాబై కాంటీనుకు కాఫీకి బయలు దేరాము. ఆరోజు ప్రొద్దుటనుంచి వర్షము కురిసి, మేము బయలు దేరేటప్పటికి కొద్దిగా తగ్గుముఖం పట్టింది. మేము కొద్ది దూరము వెళ్లాక మా వెనక ఒక కారు వేగంగా రావటం చూసి, మా 'రూము మేటు' క్రిష్ణ చేయిఎత్తాడు 'కారు ఆపమని' సైగచేస్తూ. మేము బిత్తరపోయి చూస్తున్నాం. పాపము ఆ కారాయన మెల్లిగా రానిచ్చి,మా దగ్గరగా ఆపి, ఏమిటి అని అడిగినాడు. అంతలో మా క్రిష్ణ "మాష్టారూ! కొద్దిగా మెల్లిగా వెళ్ళండి. మా మీద నీళ్ళు చిందుతాయి. థాంక్స్యూ"అన్నాడు. నేను, రవణ నవ్వు ఆపుకోలేకపోయాము. మాతో, కారులో ఉన్న ఆడవారు నవ్వకుండా ఉండలేకపోయారు. కారు—ఆయనకూడా కోపంతోనే నవ్వుకూడా కలిపి చూస్తూ వెళ్ళిపోయాడు.

'శివ' (మోపర్రు)

## దొందు - దొందే!

(రెండవ బహుమతి)

ఇది క్రిందటి నెలలో జరిగిన సంఘటన. నేను మా అక్కగారింటికి వరంగల్ చూడటానికి వెళ్లాను. ఒకరోజు మా బావగారు ఆఫీసుకు వెళ్లిన తర్వాత ఎవరో వచ్చి 'పాండురంగారావుగారున్నారాండీ' అని అడిగారు. మా అక్క వెంటనే 'లేరండీ' అన్నది. ఆయన వెంటనే టక్కున "ఆలమ్" అని చెప్పాడు. మా అక్కకూడా వెంటనే "ఏమి తాళమండీ"అన్నది.

"ఆయన నేను తాళ మడుగలేదండీ. మీరు పేరడిగారు కదా అని నా పేరు చెప్పా"నన్నారు. అప్పుడు మా అక్క "నేను మీ పేరడగలేదండీ. లేరండీ అని చెప్పానంతే" నని నవ్వాపుకోలేక నావైపు తిరిగి అతనికి 'జవాబు చెప్పి' పంపమన్నది. అంతవరకూ నేను నవ్వితే, మా అక్క దెబ్బలాడుతుందేమో నన్న భయముతో నవ్వాపుకుంటున్నాను. మా అక్క నావైపు తిరిగేసరికి ఫక్కున నవ్వి, ఆయనకు సమాధానం మర్యాదగా చెప్పగా ఆ వచ్చినాయన కూడ నవ్వుకుంటూ వెళ్లిపోయారు.

ఎస్. ఉమాబాల, (గొల్లప్రోలు) ★




ఆరోజు యేదో నవల చదువుతూ రేడియో వింటున్నా! ఇంతలో 'పోస్ట్' అనేమాట వినేటప్పటికి గబగబా బయటకు వెళ్ళి ఉత్తరాలు తీసుకొన్నాను. ఉత్తరాలన్నీ బల్లమీదపెట్టి ముందుగా పెళ్ళిశుభలేఖ తీసి చూశాను. ఒక్కసారి ఎగిరి గంతేయాలనిపించింది.

అసలు సంగతి—అన్నయ్య పెళ్ళి!

అన్నయ్యంటే మా స్వంత అన్నయ్యనుకుంటా రేమో! కాదు! ఎన్నో నిందలను లెక్క చెయ్యకుండా నేను సంపాదించుకున్న అన్న! కాని స్వంత అన్నకంటే ఎక్కువని గుండెమీద చేయివేసికొని చెప్పగలను. ఇంతకూ మా అన్నయ్యపేరు మీకు చెప్పనేలేదు కదూ! ప్రభాకర్! ఇక చదువంటారా కెమిస్ట్రీలో రిసెర్చి పూర్తిచేసి ప్రస్తుతం ఆంధ్ర విశ్వ విద్యాలయం లెక్చరరు వుద్యోగం చేస్తున్నాడు. ఇక కాబోయే వదిన ఎమ్. ఎస్. సి పూర్తిచేసింది! పేరు పద్మ!

అన్నయ్యను, కాబోయే వదినను తలంచుకుంటూ ఎప్పుడెప్పుడు ఆయనకు ఈ సంగతి చెప్పనా? ఎప్పుడు బయలుదేరాలా? పెళ్ళిచూస్తే యింకా ఆరురోజులే వుంది. ఇలా— ఆలోచిస్తుండగానే సాయంత్రమయింది.

సాయంత్రం అయిదు గంటలకు ఆయన రానే వచ్చారు. రాగానే కాఫీ, టిఫిన్ అందించి అది పూర్తి కాగానే 'ఏమండీ మా అన్నయ్యపెండ్లి, రమ్మని మరీమరీ వ్రాశాడు" యిక ఉండలేక చెప్పేసి శుభలేఖ చూపాను.

ఆ శుభలేఖ చదువుతుంటే ఆయన ముఖాన్ని పరిశీలిస్తూ కూర్చున్నా! "అరే నీకు అన్నయ్య వున్నాడా?" అని ఆయన ప్రశ్నిస్తే యింతకాలం వరకు చెప్పని సంగతులన్నీ చెప్పి ఆయన్ని ఆశ్చర్యపెడదామనుకున్న నా ఆలోచనలకు విరుద్ధంగా ఆయన ముఖం తీవ్రరూపం దాల్చేటప్పటికి నా పరిస్థితి యెలా మారిందో మీకు చెప్పనక్కరలేదనుకుంటా!

ఆయన తన భావాన్ని ఎలాగో అణచిపెట్టుకొని "నీకింతవరకు అన్నలున్నట్లు నాకు తెలియదే! స్వంత అన్నలు కాకపోయినా కనీసం పెద్దమ్మ చిన్నమ్మ కొడుకులు కూడా లేరుకదా! మరి ఈ అన్న ఎక్కడ నుండి వచ్చాడు?"

ఎంతో విశాల హృదయులనుకున్న ఈయన కూడ అపార్థం చేసుకొన్నారు. అబ్బ! ఆ మాటల్లో ఎంత అనుమానం!

అన్నయ్య సంగతి ఆయనతో చెప్పుదామని నోరు తెరిచానుగాని ఇంతలోనే ఆయన "నాకు క్లబ్ కి టైమ్ అయింది. పోతున్నా" అంటూ విసురుగా బయటకు వెళ్ళిపోయారు!

ఇక నేను అలాగే కొయ్యబారిపోయి తర్వాత కొంచెంసేపటికి శరీరాన్ని ఆధీనంలోకి తెచ్చు

46 వ పేజీ చూడండి

## వనితాలోకం

# సిటీలో సినిమాలు

ఆర్. జగదీశ్వరి

మావారికి మా ఊరు (వెంకటగిరి) నుంచి హైదరాబాదుకి "ట్రాన్స్‌ఫర్" అయిందని తెలిసి నేనెంతో సంబరపడ్డాను. మావాళ్ళంతా ఇక "ఏకేం అమ్మా! 'రిలీజయిన' ప్రతి తెలుగుసినిమా మీ ఊరికి వస్తుంది, కోరిన సినిమా చూడవచ్చు. మాలాగ పాత సినిమాల్తో బాధపడక్కర్లా!!" అంటూ నన్ను ఆకాశానికి యెత్తేశారు. ఔనన్నట్లు టెక్కుగ తలూపాను.

ఇక్కడికి వచ్చిన తర్వాత మావారిని 'సినిమాకి పోదాం' అని అడిగాను. అందుకు వారు రానని, నన్నుమాత్రం ప్రక్కింటి పిన్నిగారితో పొమ్మన్నారు. నేను, ఆవిడ రిక్షాలో సినిమా హాలుకి బయల్దేరాం. మేము వెళ్ళేసరికి దాదాపు యిరవై మంది క్యూలో నిల్చుని ఉన్నారు. మేముకూడా 'క్యూ'లో చేరాం. టిక్కెట్లు యెంతెంత వెల అని గాని, ఒక్కొతరగతికి ఎన్నేసి టిక్కెట్లు యిస్తారని గాని అక్కడ వ్రాయబడలేదు. తర్వాత తెల్సుకున్నాం రూపాయి, రూపాయిన్నర, రెండు రూ. లవని. టిక్కెట్లు యివ్వడం ప్రారంభించారు. మావంతు వచ్చేసరికి రెండు రూ. టిక్కెట్లుమాత్రం వున్నా యన్నారు. తక్కినవి అయిపోయాయట. పరేనని తీసుకొన్నాం.

మేడమీద ప్రత్యేకంగా 'స్త్రీ'లకు కూర్చునేం దుకు యేర్పాటు చేసివుంది. మొత్తం యాభై సీట్లు ఉన్నట్లున్నై.

స్త్రీలకు తక్కువ తరగతిటిక్కెట్లు చాలా తక్కువగాఉన్నై. అందువల్ల యెంత త్వరగావెళ్ళినా అవి దొరకటం కష్టం. తప్పనిసరిగ హెచ్చుతరగతి టిక్కెట్లే తీసుకోవాల్సి వస్తుంది. అలాకాకుండా 'స్త్రీ'లకికూడా క్రిందనే సీట్లు యెక్కువగా పెట్టే వట్లయితే తక్కువతరగతి టిక్కెట్లు బాగా దొరి కేందుకు వీలుంటుంది. కొద్దిసీట్లు పెట్టడం, వాటిలో కొన్నే తక్కువ తరగతిగా పెట్టి తక్కినవన్నీ హెచ్చుతరగతివి ఉంటున్నందుకు మధ్య తరగతి కుటుంబికులు ప్రతి సినిమాకి ఒక్కొక్కరికి రెండు మూడు రూపాయలు ఖర్చుపెట్టాలంటే — సాధ్యంగా ఉండదు.

కొన్ని థియేటర్లలో—సీట్లు చాలా తక్కువగా ఉంటున్నై. వాటిలో కొన్ని యివ్వకనే, యిచ్చేసినా మనీ, తర్వాత యెక్కువ వెలలకు అమ్ముతుంటారు.

ఒకరోజు నేను, మా ప్రక్కింటావిడ సినిమాకి వెళ్ళాం. వెళ్ళేప్పటికి 'న్యూస్'రీలు వేస్తున్నారు. టిక్కెట్లు తీసుకొందామంటే— "హెచ్చు తరగతి టిక్కెట్లుకూడ అయిపోయినై, అయినా గేటు దగ్గరున్న ఆవిడని అడగండని" చెప్పింది—టిక్కెట్లిచ్చే ఆవిడ. ఆవిడని అడిగితే "అన్ని సీట్లు నిండి పోయినవమ్మా! కావాలంటే యిక్కడ కూర్చోం డని"—రూపాయితరగతి దగ్గరున్న రెండు కుర్చీలు తెచ్చి ఆవిడ 'స్టూలు'ప్రక్కనే వేసి, పాల్గు రూపాయలు తీసుకొంది.

కూర్చున్నామేగాని సినిమా మాత్రం చూడలేక పోయాం. అక్కడనుంచి సినిమా చూడాలంటే మెడలు 'జిరాఫీ' ల్లా, ముందుకు చాచుకోవాలి— మధ్యలో ఆవిడ—సోద, కొంతసేపటికి " 'టీ' తాగి యిప్పుడే వస్తా, కొంచెం చూసుకోండమ్మా!!"— అని వెళ్ళిపోయింది. సినిమా చూడ్డం అటుంచి— మాకు దొరికిన ఉద్యోగానికి నవ్వుకొన్నాం.

ఒక్కొ థియేటర్లో చిన్నతరగతి టిక్కెట్లు తీసుకొన్నవాళ్ళని ముందుగా లోపలికి పోనివ్వక— "ఉండవమ్మా! మహాకొన్నావ్‌గాని రూపాయి టిక్కెట్టు —ముందుగా వెళ్ళాలంటావ్!!"—అని దబాయించి నిలబెట్టేస్తున్నారు. వాళ్ళకి 'రూపాయ' అంటే అంత తేలికగా వున్నట్లుంది.

అన్ని సినిమాలకి 'సిటీబస్సు'ల్లో పోవటానికి వీలుండదు. ముఖ్యమైన వీధుల్లోతప్ప—అన్ని ప్రాంతాల్లో 'బస్సురూట్లు' లేవు. రిక్షాల్లో పోవాలంటే కనీసం 9, 10 అణాలయినా అడుగుతారు. అంటే రిక్షావాళ్ళు యెక్కువ తీసుకుంటున్నారనికాదు— దూరాన్నిబట్టి వాళ్ళు అడుగుతుంటారు అది తప్పదు.

ఇద్దరు సినిమాకి వెళ్ళాలంటే కనీసం 5, 6 రూపాయలన్నా వుండాలి. కొద్దిజీతాలు తెచ్చుకునే వాళ్ళు నెలజీతం రాగానే—అప్పులవాళ్ళకి, యింటి అద్దె మొదలైనవి యిచ్చేసి, చేతులు దులిపేసు కొంటారు. సినిమాలకి వెళ్ళాలంటే వీలుండదు. వీలు చూసుకొని బయలుదేరే సమయానికి, ఆ తెలుగు పిక్చర్ కాస్త మారిపోతుంది. యిలాంటి కారణాలు యింకా యెన్నో—అందుచేత మూడు, నాల్గు మాసాలకి ఒక సినిమా అయినా చూడలేకపోతున్నాం.

ఎంతో సంబరపడి 'సిటీకి' వచ్చిన నాకు మాఊరే నయమనిపించింది. అక్కడ రెండుసినిమా లుంటున్నై. వారానికొకసారైనా 'పిక్చర్' మార్చు తుంటారు. టిక్కెట్లు అరణాతో అయినందున ప్రతి సినిమాకి వెళ్తుండేవాళ్ళం. సినిమాలు రిలీజయిన కొన్ని మాసాలకి అప్పటికివచ్చినా— చూచే వాళ్ళకి కొత్తవేగా!










# వనితావాణి,
## ఆంధ్రసచిత్రవారపత్రిక,
## 7, తంబుచెట్టివీధి,
## మద్రాసు-1

## యువతులూ—ఉద్రేకాలూ

19—10—62 సంచికలో సోదరి "మారుతి" "యువతులూ—ఉద్రేకాలు" అనువ్యాసము వ్రాసి నారు. ఇది చదివితే నా కొక సందేహము కలిగినది. మారుతిగారు స్త్రీ (యువతి) పెళ్లి పెడాకులు లేకుండా ఆ జన్మాంతరము కన్యగా ఉండిపోవలె నన్నట్లు ఉద్దేశ్యముతో వ్రాసినట్లుగా ఉన్నది. ఇట్లా ఉన్న కన్యల (పెళ్లికాని యువతుల) బాధలు, వాళ్లు అనుభవించుచున్న ఒంటరితనము మనము కళ్లార చూస్తున్నాము. మన సోదరీమణులే క్షణిక ఉద్రే కాలకు లొంగిపోయి మగవారిని రెచ్చగొట్టి అవమానాలుపాలై జీవితాలను నాశనం చేసుకొం టున్నారు. ముల్లుమీద ఆకుపడినా—ఆకుమీద ముల్లుపడినా ఆకేకదూ! నాశనమైపోయేది. నేను ఇట్లావ్రాస్తున్నందుకు సోదరీమణులు అపా ర్థము చేసుకోరని తలుస్తా ?

యస్. సుభద్రా బలరామదుర్గ రాజు (రాజమండ్రి)

* * *

ఈ వారం వనితాలోకంలోని "యువతులూ—ఉద్రేకాలూ" అనే వ్యాసం సహజంగా ఉంది. క్షణికావేశానికి లోనయి, తమ జీవితాలను నాశనం చేసుకొన్న అభాగినులు యెంతోమంది వున్నారు. నిజంగా యీ వ్యాసం స్త్రీలకి ఒక గుణపాఠం. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం యేం లాభం ? రచయిత్రికి నా ధన్యవాదాలు.

కుమారి ఆరాధ్యుల ఛాయ (చెన్నూరు)

## భారతస్త్రీ-స్వేచ్ఛ

నాగరికతా, సంస్కృతి వృద్ధిపొందుతున్న నేటి సమాజంలో స్త్రీ—స్వేచ్ఛ కొన్నిచోట్ల విజృం భించి, విషమ పరిస్థితులకు దారితీయడం చాలా చోట్ల చూస్తున్నాం ! "భారత స్త్రీ—స్వేచ్ఛ" అనే వ్యాసంద్వారా మహాలక్ష్మిగారు పూర్వకాలం నుండి నేటి ఆధునిక కాలంవరకు సంఘంలో స్త్రీ స్థానాన్ని ఉదాహరణ పూర్వకంగా వ్రాశారు. వారికి ధన్యవాదములు. మహిళలు తమ స్వేచ్ఛా స్వాతం త్ర్యాలకై చేయు నినాదాలు, ఈ రోజుల్లో బాగా తగ్గినవి. మహిళాభ్యుదయం ఈ రోజుల్లో తక్కు వగాఉందని వ్రాస్తూ, దానివల్ల కలిగే అనర్థాలు కూడా సమస్థాయిలో వివరించారు ! ఇటువంటి విషయాలపై వ్యాసాలు మహిళా అభ్యుదయానికి తలమానికములు.

కుమారి శత్తుల అన్నపూర్ణమ్మ (కాకినాడ)

* * *

మన్నేపల్లి మహాలక్ష్మిగారు వ్రాసిన "భారత స్త్రీ — స్వేచ్ఛ" అను వ్యాసం చాలా బాగుంది. నేటి సమాజంలో స్వేచ్ఛా స్వాతం త్ర్యాలు గుర్తెరిగిన నాగరిక స్త్రీలు సైతం పాశ్చాత్య నాగరికతకు లోబడి పెడదార్లు తొక్కటం చూచాను. ఇది స్వేచ్ఛకు, సమాజానికి తీరని అపచారం చేయుటంలాంటిది. నవనాగరికత అభివృద్ధిచెందుచున్న ఈ ఇరవయవ శతాబ్దిలో ప్రతి "భారత స్త్రీ"కి ఎంతో అవసరం. అయితే దానిని నిర్మలమైన మన స్సుతో ఆచరిస్తే ఎంతో బాగుంటుందని నా అభి ప్రాయం.

గుండా జయలక్ష్మి (తుంగతుర్తి)

## పిల్లల విషయంలో...

విజయలక్ష్మిగారు వ్రాసిన పిల్లల విషయంలో ...అనే వ్యాసం చాలా బాగుంది. పిల్లల విషయంలో ఎలాగు జాగ్రత్త వహించాలో అంత చక్కగా వ్రాసిన విజయలక్ష్మిగారికి నాయొక్క అభివందనములు.

బి. సత్యవతి (జగత్యాల)

* * *

విజయలక్ష్మిగారు "పిల్లల విషయంలో" అను వ్యాసము చాలా బాగా వ్రాశారు. ఇది చదువు తుంటే ఒకవిషయము జ్ఞాపకము వస్తున్నది. మా బంధువులలో ఒకామె ఉంది. ఆవిడకు ఐదు గురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. వాళ్లందరికన్న పెద్ద పిల్లను చాలా అవస్థలుపెట్టేవారు. ఆ అమ్మా యికి పెండ్లిచేశాక చాలా సుఖపడ్డది. ఆ యింటిలో ఉన్నంతకాలము నరకములో ఉన్నట్లు ఉండేది.

ఉప్పు కోకిలాంబ (తుని)

* * *

విజయలక్ష్మిగారు వ్రాసిన ఈ వ్యాసంలో ఏదో కొరత కన్పిస్తున్నది. పిల్లల పెంపకాన్ని గూర్చి పూర్తిగా విశదీకరించలేక పోయారనియే చెప్పాలి. "ఆడపిల్లలైతే తల్లికి ఎక్కువ బాధ్యత, మగ పిల్లలైతే తండ్రికి ఎక్కువబాధ్యత" అని వ్రాశారు. 1 నుంచి 7 లేక 8 సం. రాల వయసుగల పిల్లల విషయంలో ఆడవారైనప్పటికి, మగవారైనప్పటికి తండ్రికంటె తల్లికే ఎక్కువ బాధ్యతలుంటాయని నా అభిప్రాయం.

వై. కమల (కొండేపల్లి)

* * *

సోదరి విజయలక్ష్మిగారు వ్రాసిన "పిల్లల విషయంలో" అనే వ్యాసంచూచి నేను ఆనందపర వశురాల నయినాను. బాలలకు చిన్నప్పటినుంచీ క్రమ శిక్షణఇచ్చి పెంచినట్లయిన నేటి బాలలే రేపటి పౌరులు అనే సూక్తికి మనం అవకాశం కల్పించినవారమే గాకుండా మనబిడ్డల జీవితానికి ఒక దారి ఏర్పరచి వారు వృద్ధిలోనికివస్తే చూచి ఆనందించని ఏమాతృ దేవత ఉంటుంది. అంతకన్నా ఆ మాతృ జీవితానికి కావలసినదేముంది.

యస్. సత్యవతి (ఏలూరు)

## అందం నేర్చుకుంటే ....

5—10—62 పత్రికలో కృష్ణప్రియగారు "అందాన్నిగురించి చాలా చక్కగా వ్రాశారు. సగానికి సగముమంది స్త్రీలు ఈ అనుకరణమువల్ల ఉన్న అందాన్ని పోగొట్టుకుంటున్నారనటములో సందేహము లేదు. ప్రతి స్త్రీ ప్రకటన చూడటము, ఆ సినితారలా నే నెందుకు ఉండరాదని అనుకోటము, వాడటము—దానివలన ఫలితాన్ని అనుభవించటము. ఉన్న అందాన్ని మెరుగులు దిద్దుకోటము లోనేఉంది స్త్రీ నేర్పంతా. ఈ వ్యాసము చదివైనా వనితలు మార్తారని ఆశిస్తున్నాను. వనితలకు అందాన్నిచ్చేది మాటల తీరులోనే. వనితాలోకానికి మంచి వ్యాసాన్ని అందించిన కృష్ణప్రియకు అభినం దనలు.

జి. శాంత (సీతారాంపురం)

* * *

అందం నేర్చుకుంటే వస్తుందా వ్యాసంలో రచయిత్రి స్త్రీలకు ప్రత్యేకంగా కొంత వెల్లడి చేశారు. చాలా బాగుంది. నిజంకూడ. స్త్రీలు ఎక్కువ సంసారబాధ్యతలు వహించవలెను. కాబట్టి అహం చంపుకొనవలెను. ఇందు, స్త్రీలను అనుకరణలు మాని జాగ్రత్తపడవలెనని చాలా ఆదరంతోవ్రాశారు. నేను వారితో ఏకీభవిస్తున్నాను.

వై. కామేశ్వరి (నల్గొండ)

### పరిశుభ్రత

మంతుకుమల్లి సుశీలగారు వ్రాసిన "పరిశుభ్రత" వ్యాసంతో వచ్చింది. నా మట్టుకు నాకు మాయిల్లు శుభ్రంగా వుండకపోతే తోచదు. సుశీలగారు విదేశీయుల శుభ్రతగూర్చి విపులంగారాసి మనదేశం దానిలో ఎంత వెనకబడిందో బాగా వ్రాశారు. నిజంగా మన దేశంలో విజయవాడ మొదలగు పట్టణాల్లోనే వీధులవీ అసహ్యంగా వుంటాయి. మా ఊళ్ళో అయితే చెప్పక్కరలేదు. దీనికి ఒక్క మునిసిపాలిటీదే బాధ్యతకాదు అయినా వారుకూడా ఇంకా ఈ విషయమ్మై తగు శ్రద్ధ వహించాలి. శుభ్రత అన్నది ప్రతిమనిషికీ వుంటేనే దేశం బాగుపడుతుంది.

వి. లక్ష్మి (శ్రీకాకుళం)

### బంధువులూ - ఇబ్బందులూ

జి. సత్యన్ జయగారు వ్రాసిన ఈ వ్యాసం చాలా మనోరంజకంగా ఉన్నది. లోకంలో నడిచే వాస్తవికతను ఈ వ్యాసంలో చాలా రమణీయంగా చిత్రించారు. ఈ వ్యాసం చదువుచున్నంతసేపు, నేను పడిన అనుభవాలు, పడే అనుభవాలు (ఇప్పుడు మా ఇంట్లో బంధువులున్నారు.) జ్ఞాపకానికొస్తున్నాయి. ప్రతి పత్రికలోను, ఇకముందు ఈ మాదిరి వ్యాసాలు ప్రచురిస్తారని భావిస్తాను.

మధుభాగ్యలక్ష్మి (ధర్మపురి)

* * *

వ్యాసం బాగున్నా, కొంచెము యెబ్బెట్టుగా వుంది. జిల్లా కేంద్రములో వుండే ఎక్కువగా బంధువులు వచ్చారు. తాలూకా కేంద్రములో ఆగినట్లు వస్తారు. రాకుండా మానరు. ఆప్యాయత భోజనం కోసరముకాదు దగ్గర బంధువుల సహచర్యలతోగూడా కనుబరుస్తారు. ఉభయుల క్షేమములు తెల్సుకొని ఆనందిస్తారు. కృష్ణకుమారి (నెల్లూరు) ★

---

## కుమారి కళ - బొమ్మలకథ - 8

దేవిక

భూషణం 'కళ' ను మభ్య పెట్టి పూరవతలి తనబృందావన గార్డెన్స్ అనే బంగాళాకు రప్పించాలనుకున్నాడు.

నిజంగా కళ అకరుడ పాటల రిహార్సిల్స్ వుంటాయనుకుంది. కాని రికార్డిస్టు సత్యం వచ్చి హెచ్చరించాడు. కళ శివరాంకు చెప్దామనుకుంది....

కళ శివరాముకు చెప్పాలని వాళ్ళ ఆఫీసుకు వెళ్ళింది గాని అతని మిత్రుడు శివరాం బయటవూరుకు వెళ్ళాడని చెప్పాడు.

ఆమె పాటల లిస్టు ఒకసారి పొందుకొని చూసుకుంది

# ఉచితమైన

## అత్యాకర్షకమైన

**స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్ర సామానులు —మీరు కోరునవన్నీ గలవు.**




అంద చందాల బహుమానాలు
మిమ్మల్ని తప్పక మెప్పించగలవు.
ఈ బహుమాన కూపనులను
ఓ.కే. తయారీ వస్తువులనుండి
చేర్చిపెట్టండి.




















మీరు కొను ఈ క్రింది ప్రతి ఓ.కే. తయారీ వస్తువునుంచిన్నీ బహుమాన కూపనులను చేర్చిపెట్ట ప్రారంభించండి.

- ఓ.కే. వనస్పతి • ఓ.కే. డబుల్ రిఫైన్డ్ ఆయిల్
- గోల్డెన్ సలడ్ ఆయిల్ • ఓ.కే. చందన సబ్బు
- ఓ.కే. ఓరియంటల్ రోజ్ సబ్బు • ఓ.కే. నీమ్ సబ్బు
- మియోకే సబ్బు • సోప్ చిప్సు



మరిన్ని ఆ మీ కూపనులకు మారుగా అత్యాకర్షణీయములగు స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలను — మీకు ఇష్టమైన పరిమాణ ప్రమాణాలలో — మీకు అతి సమీపమునగల ఓ.కే. వ్యాపారి వద్దనుండి పొందండి.

ఈ ప్రత్యేక బహుమానయోజనల గురించిన విశేష వివరాలు గల సచిత్ర ఫోల్డరుగురించి మీ ఓ. కే. వ్యాపారిని అడిగి పొందండి.





తయారుచేసినవారు :

**ది ఈస్ట్ ఏష్యాటిక్ కం. (ఇండియా) ప్రైవేట్ లిడ్., మదరాసు-1**

ఈ బహుమతి పథకం మద్రాసు, మైసూరు, కేరళ మరియు ఆంధ్ర రాష్ట్రములకు మాత్రమే వర్తించును.

# మనమూ - మనదేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## నైరిక జీర్ణదోషము

మనస్థితికీ, జీర్ణ దోషానికీ అత్యంత సన్నిహిత సంబంధం వున్నదని ఇదివరకే తెలుసుకున్నాము. అనేకరకములయిన మానసిక రోగములలో ఉదరాంగములలో, ముఖ్యంగా జీర్ణాశయ భాగములలో వాటి ధర్మములలో, అనేక మార్పులు ఏర్పడతవి. కోప్రోద్రేకము, నైరాశ్యము, తప్పుచేసిన తరువాత కలిగే ఆత్మాభిశంసనము (Guilt Complex) ఇటువంటి మనస్థితులన్నీ జఠరాశయ స్పందనములలోనూ ఆంత్ర స్పందనములలోనూ వాటి కండరముల సంకోచ వ్యాకోచములలోనూ చాలా మార్పులు కలిగిస్తవి. శక్తికిమించిన శ్రమ, అది కలిగించే అలసట, శవన్నీ జీర్ణదోషాలను కలిగించగలవు. ఆ జీర్ణదోషం స్వరూప స్వభావాలు, రోగి మనస్థితినిబట్టీ, మానసిక వ్యవస్థనుబట్టీ, వంశీయంగావచ్చే మానసిక లక్షణములనుబట్టీ మారుతూ వుంటవి.

నైరిక జీర్ణదోషములకు ఒక నిర్దిష్టమయిన స్వరూపమంటూ వుండదు. అటువంటి రోగి ఒకనాడు యమయాతన పడుతాడు. మరొకనాడు మహోత్సాహాన్ని ప్రదర్శిస్తాడు. ఈ రెండు పరిస్థితులకూ తగిన కారణాలు కనిపించవు. ఒక్క లక్షణంమాత్రం మారకుండా అటువంటి రోగులలో కనిపిస్తుంది: అది, ఉదరంలో ఎక్కడో వర్ణించడానికి వీలులేని బాధ.

పడకబెట్టించే స్థితికి అది ఎప్పుడోగాని రాదు. సాధారణంగా ఆ బాధ ప్రొద్దున్నే లేవంగానే అత్యధికంగా వుంటుంది. రోగి దినచర్యలో నిమగ్నుడయిన కొద్దీ తగ్గినట్లు తోస్తుంది. కాని, దినచర్యకు ఫలితంగా రోగి అలిసి విశ్రాంతితీసుకుంటున్న సందర్భంలో మళ్లీ బాధ అధికంగా తెలుస్తూవుంటుంది. భోజనం ఆ బాధను అధికం చేస్తుంది. కడుపులో రెండుముద్దలు పడగానే పొట్టనిండిపోయినట్లు కడుపు బోలెక్కి పోయినట్లు తోస్తుంది. అసలీ కడుపు నిండినట్లుండడం ఎప్పుడూ వుంటూనే వుంటుంది. కొన్ని సమయాల్లో అధికంగా వుంటుంది. మరికొన్ని సమయాల్లో తక్కువగా వుంటుంది. ఈ బాధకీ, తీసుకున్న ఆహారం రసాయనిక స్వరూపానికీ యే విధమయిన సంబంధమూ వుండదు. ప్రోటీనులు, తింటే అధికంకావడం, కార్బోహైడ్రేటులు పడకపోవటం అంటూ వుండదు. జఠరాశయంలో ఆంగిక వికృతులు ఏర్పడి కలిగిన రోగవిశేషాలకూ, నైరిక కారణములవల్ల ఏర్పడే ధార్మిక రోగాలకూ వుండే ప్రధాన భేదం యిదే!

ఆవేశాలూ, ఆందోళనలూ అధికమైనకొద్దీ యీ రకమయిన జీర్ణవ్యాధి అధికమవుతూ వుంటుంది. నూతనమయిన అభిరుచి, యిష్టమయిన సాంగత్యము, సంభాషణ, మానసిక అభిరుచి, వున్నప్పుడది తగ్గుతూ వుంటుంది: ఈ రకం రోగులు ఏ చికిత్సనూ, ఏ చికిత్సకుడినీ ఎక్కువ రోజులు అంటిపెట్టుకుని ఉండరు. కొత్త మందు వచ్చిందంటే విపరీతమయిన ఉత్సాహంతో దానిని సేవిస్తారు. కొంతకాలం అది చాలా అనుకూలంగా ఉంటుంది. కాని ఎంతో కొంతకాలం పోగానే అది పనికిమాలినదై పోతుంది. వికారం వుంటుంది.. దీనితోపాటు వాంతి వుంటుంది. అప్పుడప్పుడు కడుపు ఉబ్బుతూ వుంటుంది. ఇది, గాలి మ్రింగడంవల్ల తరుచు ఏర్పడుతూ వుంటుంది. పెద్ద శబ్దంతో తరచు త్రేన్పులు వస్తూవుంటవి. వయస్సు మళ్లినవారిలో ఈ లక్షణం మరీ అధికంగా వుంటుంది. ఆకలి అనేది వుండదు. ఇంట్లోవాళ్లని ప్రక్కవాళ్లని కటాక్షించడంకోసం అన్నట్లుగా ఈ రకం రోగులు ఆహారం కొస్తనంచుకొని మిగతాది విడిచేస్తారు. రెండుముద్దలు నోట్లోకి పోంగానే కడుపు నిండిపోతుంది.

వీరికి మలబద్ధకం అధికంగా వుంటుంది. విరేచనం కాకపోతే వారు భూనభోంతరాళములు ఏకం చేస్తారు. విరేచనం కావడంకోసం రకరకముల మందులూ మ్రింగుతారు. దానితో వారిస్థితి మరీ విషమిస్తుంది.

సాధారణ పరీక్షా విధానాలవల్లగానీ, ఎక్సురేవంటి ప్రత్యేక పరీక్షలవల్లగానీ ఏమీ తేలదు. అన్నీ మామూలుగానే వుంటవి. కాని కొందరిలో జఠరాశయంలోకి పోయిన ఆహారం అతిశీఘ్రంగా డువోడినంలోకి వెళ్లిపోతుంది. డువోడినంలో అల్సరున్నదేమోననే అనుమానం కలుగుతుంది. కడుపు కాళీ కాంగానే ఆకలివేసినట్లుంటుంది. స్పర్శకు ఉదర కుడ్యంలో కండరములు చాలా బిర్రుగా వుంటవి— కాని ప్రత్యేకించి బల్లకట్టి బాధకరమైన ప్రదేశం ఏదీ వుండదు. ఇటువంటివారిని, వారి లక్షణములు వారుగానే చెప్పనివ్వాలి. "ఇక్కడ ఉందా?" అని చూపిస్తే వెంటనే 'ఔ'నంటారు. మరొక సందర్భంలో ఆ లక్షణమే లేదంటారు. కొందరిలో కడుపు జారిపోయివుండవచ్చు. జీర్ణరోగ లక్షణములతోపాటుగా తరుచు నైరిక లక్షణములుకూడా ప్రదర్శింపబడుతూవుంటవి. తీరని తలనొప్పి, వికారం, నిద్ర పట్టకపోవడం, ఆకలి లేకపోవడం తరుచు కనబడే లక్షణాలు. వీటితో రోగి క్షీణిస్తాడు. అంతకంతకు బలహీనుడై పోతాడు. కడుపులో బాధతోపాటు,— మొగం ఎర్రగా కందిపోవచ్చును. గుండెల్లో దడ రావచ్చును. కాళ్లు చేతులు చల్లబడవచ్చును: రోగిలో మందకొడితనం, నిరుత్సాహం, నిరాశ అంతకంతకు పెరిగిపోతవి. అయినా తన రోగ పరీక్షలో అతిశ్రద్ధ ప్రదర్శించవచ్చును. ఇటువంటివారు గంటగంటకూ . నాలుక చూసుకుంటారు. నల్లు లెక్కపెట్టుకుంటారు. టెంపరేచరు చూస్తూ వుంటారు. జ్వరంలేకపోతే ధర్మామీటరు విజాయితీని శంకిస్తూ వుంటారు. ప్రతి మార్పునూ దుర్భిణీయంత్రంతో చూస్తూవుంటారు. కొత్త డాక్టరు దగ్గరకు వెళ్లినప్పుడల్లా అత్యంతమైన వివరాలతో తమ లక్షణములను వర్ణిస్తారు. తరుచు వారే తమ రోగ కారణములను ఉహించి సిద్ధాంతాలు లేవదీస్తూవుంటారు. కొందరు అంతకుముందు చూసి వదిలేసిన డాక్టర్లచేత కానితనాన్ని దౌష్ట్యాన్ని చిలువలు పలువలుగా వర్ణిస్తారు. తీసుకున్న మందులచీట్లు, రోజువారిగా అతిభద్రంగా దాస్తారు. తన రోగలక్షణములను వర్ణించడం మాని "కొద్దిగా జలుబుచేసి యిల్లా వచ్చిందనో" ఫలానా డాక్టరు యిల్లా అభిప్రాయపడ్డాడనో చెబుతారుగాని అసలు విషయానికి రారు: తన ఉదరంలో అంగములు స్థానాలు తప్పిపోయినట్లు, అక్కడేదో మహాభయంకరమైన వ్యాధి వున్నట్లు, అప్పుడప్పుడు అక్కడ కేన్సరే యేర్పడ్డట్లు భావించి రోగి భయపడతాడు. స్థానికమైన బాధతో మనస్థితి, మనస్థితితో స్థానికమైనబాధ అధికమవుతూ వుంటవి.

పరీక్షలలో ఏమీ తెలియనంతమాత్రాన ఇటువంటివారికి వ్యాధి లేదనుకోడం పొరపాటు. తన పరీక్షలకూ, సాధనములకూ అందనిదేదీ సృష్టిలో వుండదని వైద్యుడే నాడూ భావించరాదు. ఇటువంటి లక్షణములు హోమియోపతీ వైద్యానికి ప్రదానాధారములవుతూ వుంటవి. భౌతికమైన కారణమున్నా లేకపోయినా బాధ బాధే. రోగిని పూర్తిగా పరీక్షించి సానుభూతితో వారి గోడు వినడం వారిలో విశ్వాసమును కలిగిస్తుంది. వైద్యవిధానమూ రోగ పరీక్షా విధానములూ యీనాడున్న స్థితిలో కనుక్కోలేనంతమాత్రాన నిరాశ పొందనవసరం లేదనీ, ప్రతిరోజూ వైద్యప్రక్రియలు అభివృద్ధి పొందుతున్నవనీ, నూతనౌషధములు వస్తున్నవనీ రోగికి నచ్చచెప్పి ఉత్సాహం, ఆశ కలిగించడం అవసరం. ఇటువంటివారికి తగిన మానసిక, శారీరక పరిశ్రమ అవసరం. మనస్సు అన్యధాయత్తమైనప్పుడు వీరికే బాధ వుండదు. ఇటువంటివారు ఉద్రేకములను ఏదోవిధంగా తీర్చుకోవాలి. మనస్సులోలోనే అణుచుకుంటే వారి బాధ మరీ అధికమవుతుంది. వారి మనః ప్రవృత్తికి విరుద్ధంకాని పరిసరములూ, వ్యావృత్తులూ సాంగత్యమూ చాలా అవసరం. ఒక గదిలో పారేసి, విశ్రాంతిపేరుతో ఏ పనీ చేయనీకుండా వుంచటం మంచిదికాదు. జీర్ణకరములైన ఔషధములూ, విటమిన్లూ మార్చిమార్చి ఇస్తూ వుండాలి. మనశ్శాంతికరములయిన ఔషధములు (Tranquillisers) చాలా సహాకరిస్తవి. అతిసానుభూతీ, అసానుభూతీ కూడా మంచివి కావు. రోగితో చరించేవారు అతని రోగము నివార్యము అనీ, అతని బస్సుకు ఒక ప్రయోజనం వున్నదనీఅతనికే బుజువయ్యేపద్ధతిలో ప్రవర్తించాలి.

నైరిక జీర్ణదోషం వున్నవారిలో తమరు యితరులకు బరువై పోతున్నామన్న భావన తరచు ఏర్పడుతుంది. తన అప్పుల గౌరవం కోలుపోతున్నా నన్న భీతి ప్రబలుతూ వుంటుంది. ఈ స్థితి రాకుండా చూడడం చాలా అవసరం, రోగి పరాధీనుడుకాకుండా ఆత్మవిశ్వాసం చెడకుండా అతనిబుద్ధి ఏ రంగంలో అభిరుచికలిగివుంటే ఆ రంగంలో పనిచేయనిస్తూ చికిత్స సాగించాలి. పరిసరములు అనుకూలంగా లేనప్పుడు ఆ పరిసరములలోనుండి వెళ్లిపోవడమే చికిత్సగా పనిచేస్తుంది. అందరికీ యీ అవకాశాలు వుండవు. ఉన్నంతలోనే ఉపశాంతి, మనశ్శాంతి కలిగించడానికి ప్రయత్నించాలి. ★



# మాటకారి మనసు మంచి సూరేకాంతం

**(గత సంచిక తరువాయి)**

ఒకరోజున మాంబళం పవర్‌హౌస్ దగ్గర సూర్యకాంతం, మరో అమ్మాయి వెళ్తూ ఉండగా లింగమూర్తిగారు కనిపించారు. ఆ అమ్మాయి చటుక్కున నమస్కారం పెట్టేసి, "లింగమూర్తిగారు—లింగమూర్తిగారు, నమస్కారం పెట్టు" అన్నది సూర్యకాంతంతో తొందరగా.

"ఐతే ?" అంది సూర్యకాంతం చేతులు రెండూ కట్టేసుకుని.

"అయ్యో, ఆయన సినిమా తీస్తున్నారు—" అన్నది ఆ అమ్మాయి.

"ఐతే ?"

"ఐతే ఏమిటి ఐతే ? నువ్వూ వో వేషం అడుగు."

"చచ్చినా అడగను."

లింగమూర్తిగారు ఆ అమ్మాయి వ్యవహారాన్ని గ్రహించి—"ఎవరి పిల్లవి అమ్మా ?" అని కనుక్కున్నారు. సూర్యకాంతం చెప్పింది. అప్పుడు లింగమూర్తిగారు చిత్రం తీస్తున్నారు. అందులో వేషం ఇస్తానన్నారు కూడా ! పైగా హీరోయిన్!

"నేను హీరోయిన్ వేషం ఎప్పుడూ వెయ్యను. అది తప్ప ఇంకే వేషాలయినా వేస్తానుగాని ! ఎంచేతంటే, హీరోయిన్ ఐతే ఈ ఒక్క చిత్రంతోనే పోతుంది. నాకు ఆ మోజు లేదు. నేను నాలుగు చిత్రాల్లో కనిపించాలి. నాలుగు రకాల వేషాలు వెయ్యాలి, చిన్నవైనా సరే !" అన్నది సూర్యకాంతం. లింగమూర్తిగారు ఆ పట్టుదలను మెచ్చుకుని—'అట్లాగే' అన్నారు.

సూర్యకాంతం ప్రథమ చిత్రం 'నారద నారది'. ఈ చిత్రంలో ఆమె వో చిన్న పాత్ర ధరించింది.

'ధర్మాంగద' చిత్రంలోని మూగపిల్ల పాత్ర ద్వారా సూర్యకాంతం పేరు చాలామందికి తెలిసింది. 'సంసారం' లోని గయ్యాళి పాత్ర ద్వారా, 'చిన్న కోడలు' లోని పాత్ర ద్వారా—సూర్యకాంతం, తన 'మార్కు పాత్ర' లలో కనిపించి, పదిమంది మెప్పు పొందింది. ఈ చిత్రాలే సూర్యకాంతానికి నిజంగా పేరు తెచ్చినై. ఆ 'మార్కు' పాత్రలనే నిర్మాతలు వాడవలసి వచ్చినప్పుడు, సూర్యకాంతానికే ఆ బాధ్యత అప్పజెప్పసాగారు.

నాటినుంచి, నేటిదాకా ఆమె అనేక చిత్రాలలో గయ్యాళి పాత్రలను ధరించింది. కొన్ని చిత్రాల్లో విభిన్న పాత్రలను ధరించింది. ఆఖరికి 'గయ్యాళి అత్త' కు మారుపేరు సూర్యకాంతం ఐ కూచుంది! ఎవరైనా, మాటా మాటా అడుకొంటూ ఎవరి గురించో చెప్పుకుంటున్నప్పుడు—"అబ్బో ఆవిడ ఎక్కడమ్మా—సూరేకాంతమే !" అని కూడా అంటూ ఉంటారు.

ఐతే సూర్యకాంతం తెరమీద ఎంత గయ్యాళో, నిత్య జీవితంలో అంత నెమ్మదయినది. అంటే, ఆమెకు కోపం రాదనీ కాదు, కసరదనీ కాదు—కాని స్వభావం మంచిది ! తెరమీద చూసిన చాలామంది, బయట సూర్యకాంతంతో మాట్లాడటానికి భయపడతారు. అట్లా భయపడాల్సిన పనేమీ లేదు—ఆమె చక్కగా, మర్యాదగా, తియ్యగా మాట్లాడుతుంది.

తనకు ఎటువంటి పేరున్నదో ప్రత్యక్షంగా ఆమే విన్నది. ఒకరోజు తెల్లవారఝామున విజయవాడలో—స్నానానికని మేడ దిగుతూ ఉంటే—కింద గదిలో ఒకాయన భార్యను తిడుతూ—'ఓసి సూర్యకాంతం!' అని తిట్టటం ఆమె చెవులారా విని, క్షణం పాటు నివ్వెరపోయింది ! ఈ విధంగా ఆవిడ పలుకుబడిని ఆంధ్రులంతా ఉపయోగించుకుంటున్నారంటే—ఆవిడ ఎంతగా ప్రేక్షక హృదయాలలో పీఠం వేసుకు కూర్చున్నదో అర్థమవుతుంది.

కాని, గయ్యాళి పాత్రలు ధరించటంలో ఆమె నోమూల బాధపడుతూనే ఉంటుంది. ఐతే తప్పని సరిగా నటించాల్సివస్తుంది. ఇటీవల 'రక్త సంబంధం' చిత్రంలో—ఒక సన్నివేశంలో ఆమె చాలా క్రూరంగా నటించాల్సివచ్చింది. పిల్లల కోసం దీపావళి సామాన్లు తీసుకుని నాయకుడు ఇంటికి వస్తే, ఆమె సామ్మని తలుపులు వేసి అబద్ధాలు చెప్పాలి. ఈ ఘట్టంలో ఆమె ఎంత క్రూరంగా నటించా లనుకుంటున్నా—ఒక ప్రక్కనుండి ఆ సన్నివేశానికి లొంగిపోతూ వచ్చింది. ఆమె కళ్లవెంబడి నీళ్లు రాసాగాయి కూడా ! ఐతే నటన? .... తప్పలేదు ! "ఇటువంటి పాత్రలు నటించాల్సి వచ్చినప్పుడు ఎంత బాధపడతానో నాకే తెలీదు. ఐతే, మన ఆంధ్రదేశంలోని అత్తలను వదులుకోలేనుగదా — ఎప్పుడో రిటైరయిపోతే తప్ప, ఈ పాత్రలను ధరించటం తప్పనిసరే మరి! " అన్నది సూర్యకాంతం. ఆమె తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ, అక్క చెల్లెళ్లూ అందరు కాకినాడలోనే ఉన్నారు.

సూర్యకాంతానికి సాధారణంగా తీరికే దొరకదు. దొరికితే నలుగురితోనూ సరదాగా కాలక్షేపం చేస్తుంది.

ఈ తెలుగుతెర "ఆడపడుచు, అత్తగారూ," ఇప్పటికి 102 చిత్రాలలో నటించి మరో 14 చిత్రాలలో నటిస్తున్నది. 'సు'



## జరిగిన కథ

నిచుళ నగరంలో శృంగారమంజరి కొంత కుమార్తె హేమసుందరిని అర్ధరాత్రి కలుసుకోవచ్చి రంగనాయకుడు, కావలివారిని గాయపరిచిపోతాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం హేమసుందరిని వలచిన తన ప్రియుడు తిరుమలరెడ్డికి చెబుతుంది. రంగనాయకుడు, హేమసుందరికోసం ఆలయ గోపురంమీదకిపోయి రెడ్డి పంపిన సింహాచలాన్ని ఎదుర్కొని బలమైన గాయాలతో ఇంటికి చేరుకుంటాడు. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేస్తుంది. నాంచారమ్మ సాయంతో రంగనాయకుడు హేమసుందరిని కలుసుకుంటాడు. తిరుమలరెడ్డి ఇంట దొంగతనం జరుగుతుంది. రంగనాయకుడు, హేమసుందరి శ్రీరంగం పారిపోతారు. హేమసుందరి కన్యాగదని రంగనాయకుడు తెలుసుకుం... తనని గాయపరచవచ్చిన సింహాచలాన్ని ... వేస్తాడు విశాలనేత్రాల వెంకన్న ... వస్తుండగా హేమసుందరీ రంగనాయకులకు రామానుజ యతీంద్రుల దర్శనం కలిగి గాఢాభిమానంగా మారి అంతే వారులకు అన్యాయ రేకెత్తిస్తుంది.

### గతసంచిక తరువాయి

ద్రవిడదేశ విద్వాంసు లెవరయినా సందర్శనార్థమై వచ్చినప్పుడు వారికి విశిష్టాద్వైత వేదాంత పరమార్థం వ్యాఖ్యానించడం రామానుజ యతి కొక పరిపాటి. ఇక సాధారణ పౌరు లెవ్వరికయినా శ్రీరంగేశుని యెడల ప్రగాఢ భక్తిప్రపత్తు లుపదేశించడం శిష్యు లనేక పర్యాయాలు స్వయంగా పరిశీలించారు. కాని రంగనాయకునితో కొనసాగిన ప్రసంగాలలో సూచనప్రాయంగా నయినా అటువంటి ప్రస్తావనే వినబడలేదు! 'ఇదేమిటీ విడ్డూరం!' అని వారిలోవా రనేకవిధాల గుసగుస లాడుకొన్నారు.

అలాగలాగ మరికొంతసేపు సంభాషణ కొనసాగిన పిమ్మట రంగనాయకుడు ఇనుమడించిన భక్తితో రామానుజునికి సాష్టాంగ నమస్కారం సమర్పించి వీడ్కొని తిన్నగా తన భవంతికి తరలిపోయాడు. హేమసుందరి అతని ముఖతః ఆనాడు జరిగిన విశేషాలన్ని విని ఇక తప్పక తమకేదో కొంత ఉపాధి ఏర్పడగలదన్న ధైర్యంతో ఎంతో ఆనందించింది.

ఆ మరునా డుదయమే లేచి రంగనాయకుడు ధర్మకర్త భవంతికి వెళ్లి దర్శనం కోసం నిమేషమొక యుగంగా నిరీక్షించాడు. ఎట్టకేలకా దర్మాధి

—42 వ పేజీ చూడండి







## అంటే వారు ప్రేమలో పడ్డారు

స్త్రీలైతే…(లక్షణాలు)

1. మీరు ఎటైనా చూస్తున్నప్పుడు మీ వంక చూస్తారు. మీరు వాళ్ల వంక చూడగానే వాళ్లు ఎటో చూస్తారు.
2. తమ స్నేహితులతో నవ్వినట్లు మీ వంక చూచి నవ్వుతారు.
3. మీరు ఏదైనా 'లెక్చరర్ని' ప్రశ్నిస్తే, వాళ్లనే అడిగినట్లు (తెలిసినా, తెలియక పోయినా) జవాబు చెప్తారు.
4. మీరు మాత్రం వాళ్ల వంక చూచి నవ్వితే సీరియస్‌గా చూచి, బుంగ మూతి పెడ్తారు. కొరకొర చూస్తారు....

మగవాళ్లైతే…(లక్షణాలు)

5. లెక్చరర్ని ఏడిపించేవాళ్లు మీ దగ్గర ఎంతో బుద్ధిమంతులు లాగా ప్రవర్తిస్తారు.
6. మీకు బాడీగార్డ్ ఖర్చవసరం లేకుండా రోజూ మీ ఇంటి



వరకూ మిమ్మల్ని దిగబెడ్తారు. మీకోసం రోజూ శుభ్రంగా ముస్తాబై డాబుగా వస్తారు.

—పసుపులేటి వెంకటేశ్వరరావు (పెనపాడు)

* * *

ఆఫీసర్ : ఏమయ్యా! పండుగ వెళ్లిన తర్వాత ఎడ్వాన్సెందుకూ?

ఉద్యోగి : సార్! ఎడ్వాన్స్ పెట్టి తీరుస్తానని అప్పు చేశాను సార్!

బాబులు (జైన్‌పూర్)

* * *

## సదా భయం: భయం:

ముక్తి లభిస్తుందో లేదోనని భక్తునికి భయం
పరీక్ష పాసౌతానో లేదోనని విద్యార్థికి భయం
అత్తగారు మెచ్చుతారో లేదోనని క్రొత్త కోడలికి భయం

అలుసిస్తే పెళ్లాం హాయాం చేస్తుందని భర్తకు భయం

పిక్చర్ ఫేలయిపోతుందేమో నని నిర్మాతకు భయం
పేరు పోతుందేమోనని లీడరుకు భయం
కేసు పోతుందేమోనని డాక్టరుకు భయం
డబ్బు పోతుందేమోనని పిసినారికి భయం
ప్రేమించినవాడు మోసం చేస్తాడేమోనని ప్రియురాలికి భయం

అప్పారావులంటే ఆసాములకు భయం
అంగడివాడు అప్పిస్తాడో లేదోనని బీదవానికి భయం

దెయ్యాలుంటాయేమోనని పిరికివానికి భయం
కయ్యాలొస్తాయేమోనని మంచివారికి భయం
యుద్ధం వస్తుందేమోనని ప్రపంచానికి భయం
ప్రాజెక్టు కూలుతుందేమోనని ప్లానింగ్ కమిటీకి భయం

ఇన్‌కంటాక్సు పడుతుందేమోనని ఉన్నవానికి భయం

సహకార వ్యవసాయం వస్తుందేమోనని భూస్వాములకు భయం

సమ్మె చేస్తారేమోనని సంస్థలకు భయం
ఇది హమేషి తమాషాలో అచ్చవుతుందో లేదోనని నాకు భయం!

'భయం'కరరావు, (ఏలూరు).





శివుని ఆజ్ఞ లేనిదే రైలు కూడ నరుని చంప రాదు.

## "క్షీరనీర న్యాయం!"

త్రొల్లి గొల్ల డొకండు వాడుక రీతి క్షీరమ్ముల నీరమ్ము లధికమ్ముగా గలిపి బుష్యాశ్రమంబున కేతెంచి యరుంధతి కీయ నాపె వాని నిందింప నంత వాడామెకు క్షీరనీర ప్రాశస్త్యంబు జెప్పిన ప్రకారంబు నా యెరింగిన రీతి మీకుం వివరించెద వినుండు.

"క్షీరాబ్ధి మధన మందున
క్షీరోపరిభాగ మమృత సిద్ధిం బొందెన్
నీరై నిలచెను క్రిందది
క్షీరమ్మున నీరు గలువ చింతిలనేలా ?

గౌరీ రమణుని శిరమున
జేరి మహాత్మ్యమ్ము పదము జేపట్టిన యా
నీరమ్ము తమ్ము జేరగ
క్షీరమునకు గౌరవమ్ము సిద్ధిలె మాతరో!

క్షీరుండును, నీరుండను
వా రిరువురు హితులు; శాప వశమున భువిపై
వేర్వై జన్మించిరి, యుప
కారం బేమమ్మ హితుల గలపిన యదలన్ ?

అది యుమంగాక,

క్షీరంబు గ్రోల వారలు
భారంబుగ నొడలు, కండ బలియుచు విక్రుతా
కారులు గాగల రందున
నీరంబులు గలిపి త్రావ నిలచును బలపుల్."

ఈ రీతిని వివరింపగ
నారీమణి తృప్తిజెంది నాటి మొదలుగా
క్షీరంబున నీరంబుల
నారతముగ నిలువ వరము నీరులకు నొసగెన్.

ఇది క్షీర నీర ప్రాశస్త్యపాఖ్యానము సంపూర్ణము.

పి. ఎస్. రంగారావు, (భద్రాచలం)

* * *

డాక్టర్: అదేమయ్యా! నీకు నిద్రకు మందుయిస్తే అది నీ భార్య కిచ్చావ్?

రోగి: సార్! అది నిద్ర పోనిస్తే నాకు వేరే మందెందుకు సార్?

ఉమాబాల (వాల్తేరు)

* * *




## గుమాస్తాగిరీ!

త్రొల్లి 'ప్రజాస్వామ్యపు పరపతిరావు' అనే ఒక పెద్దమనిషి కార్యార్థమై 'తాలూకాఫీసు'నకు వెళ్లి తాను యేతెంచిన కారణమును తహసీల్‌దార్ గార్కి యెరింగించెను. అంతట ఆ 'గారు' "మీ 'ఫైలు'పై యింతవరకూ యెట్టి ఏక్షను తీసుకొని యుండలేదా ?" అని అడిగిరి. 'ఉండలేదు' అని సదరు పరపతిరావుగారు విన్నవించిరి. .... వించగా విన్న ఆ అధికారిగారు ఆగ్రహోదగ్ర మానసులై 'డిప్యూటీ తహసీల్దారు'ను పిలిపించి 'వ్హాట్, మిస్టర్ రావ్ ! మీ 'సూపర్ విషన్' యేమియూ బాగులేదు' అంటూ పై కథకాని కథ యావత్తూ శుద్ధాంగ్లమున విశదీకరించి 'సత్వర చర్యలు తీసుకొనవలసిన'దని ఆనతించి పంపివేసిరి.

అవమానాగ్నిచే దహించుకొని పోవుచున్న ఆ 'ఉపాధికారి' 'బ్రహ్మ గుమాస్తా' (హెడ్‌క్లర్క్)ను రప్పించి, నాలుగైదు చీవాట్లు మోము వాచేటట్లు వేసి "ఈ రోజు సాయంత్రం గం 4—59 ని. లలోగా, ఆ 'ఫైలు'ను నాకు 'పుటప్' చేయవలెనని 'హుకుం' జారీ చేసిరి.

పెద్ద గుమాస్తా అమాయకుడా ? కాదే ! వెంటనే ఆ యొక్క గుమాస్తాను రప్పించి, తాను తినిన చీవాట్లను వడ్డీతోసహా 'ఫర్‌వార్డ్'చేసి 'వెంటనే ఆ 'ఫైల్' తన టేబిలుపై ఉంచవలసిన'దని ఆజ్ఞాపించెను.

ఈ రీతి పంచభక్ష్య పరమాన్నమును భుజించిన చిన్న గుమాస్తా రాత్రి 8 గంటలకు త్రేన్చుకుంటూ తన సౌధమునకుచేరి 'నాప'పై చేర గిల బడెను. ఇంతలో ఆయొక్క గుమాస్తాయొక్క ధర్మపత్ని 'యేమండీ, అలా ఉన్నారేం ?' అని సానుభూతితో పృచ్ఛించెను.

అవమానకరమైన ఆ ప్రశ్నను విన్న మన నాయకుడు గుమాస్తా తన కోపమును భారతదేశ సరిహద్దులవరకూ (టిక్కెట్టు లేకుండా) ప్రయాణము చేయించి, తిరిగి రప్పించి, సహింపలేక, ఆతని అర్ధాంగిపై నంతయునూ ప్రయోగించి, చరచర మునిసిపాలిటీ రోడ్డుపై పడెను. ★

అల్లెన దుర్గారావు, (పాలకొండ).





—శారద (విజయవాడ)



## జరిగిన కథ

రామచంద్రపురవాస్తవ్యుడు ప్రసాదరావుగారి కుమార్తె, నిర్మలకు అజంతా విహారాలు చూచేందుకు సహాధ్యాయినులతో వెళ్తూండగా త్రోవలో కారు చెడిపోయి ప్రయాణం సాగక బాధపడుతున్న ఓ లెక్చరర్ దంపతులతో పరిచయం ఏర్పడుతుంది. ఆ లెక్చరర్ భార్య రుక్మిణమ్మగారు నిర్మలకు తన అక్కగారి కుమారుడు ప్రకాశ్‌తోను, వసంతకు పేట్నాపాళెంలోని బడిపంతులుతో వివాహం జరుగుతుంది. ప్రకాష్ మేనత్త కుమార్తె వసుధ సుధాకర్ అనే వ్యక్తిని వివాహం చేసుకున్నందువల్ల ప్రకాశ్ ఇంట్లో రేగిన కల్లోలం సమసిపోతుంది. నళినీ, కుసుమలకు కూడా ప్రసాదరావుగారు వివాహాలు చేస్తారు. కోడంటికం భరించలేని కుసుమను భర్త అనుమతిలో ప్రసాదరావుగారు ఇంటికి తీసుకువస్తారు. ప్రకాశ్‌కు మనస్థిమితం తప్పగా బొంబాయి పిచ్చి ఆస్పత్రిలో చేరుస్తారు. రాజారావుగారు తమ తాతగారికి పిచ్చి ఉండేదన్న విషయాన్ని వెల్లడిస్తారు.

(గత సంచిక తరువాయి)

దినచర్యలో మునిగిపోయి కొంతవరకు దుఃఖరహితమై ఉపశమనం పొందుతున్న నిర్మలకు తంతి వచ్చింది. ఒక్కసాటు హృదయం కలవరపాటుతో వూగిపోయింది. ఆశ నిరాశల మధ్య, సంభ్రమాశ్చర్యాల మధ్య నలిగిపోయింది.

తంతి చూసుకున్న తక్షణం నిర్మల, మాలతి, పాపాయి బొంబాయి కెళ్లారు. తిన్నగా స్టేషన్ నించి ప్రకాశ్ దగ్గరికే వెళ్లారు.

ప్రకాశ్‌కు కొద్దిగా నయమైంది. కానీ ఎంత కాలం అలా పిచ్చి రాకుండా ఉంటుందో చెప్పలేరు. మూడు రోజులనించి మామూలు మనిషిలా ప్రవర్తిస్తున్నాడు. అతని హృదయం తనవారి కొరకు ఆరాటపడ్తోంది. ఆశగా నిరీక్షిస్తున్నాడు.

మళ్లీ ఏడు మాసాలకు నిర్మల భర్తను చూస్తోంది. గదిలో వారిద్దరు తప్ప మరెవ్వరు లేరు. ప్రకాశ్ ఆమెను గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు. చెక్కిళ్లు నిమురుతూ కళ్లలోకి చూచాడు. వారికి మాటలు కరువయ్యాయి. ఆనందోన్మత్తతతో ఉన్న ఆ నాల్గు కళ్లు మాట్లాడుకోని విషయాలే లేవు. అతను ప్రాజ్ఞుడుగా ఉండటం ఎన్నాళ్లు? ఆ కొద్ది కాలాన్ని తనివిదీరా వ్యయం చేయాలి. సద్వినియోగం చేయాలి. ఏడాదిగా పెరిగిన వ్యాకులతను అతని హృదయంలో నుంచి మార్చిపోనాలి. పూర్వపు ఆవేదనను మరిపింపజేసే ఈ కొద్ది క్షణాలు మహా విలువైనవి. నిర్మల ఆనందబాష్పాలు రాలుస్తూ భర్త బాహువుల్లో ఉక్కిరిబిక్కిరై పోయింది.

పాప పలుకులు ప్రకాశ్ హృదయాన్ని ఆనందంతో పరుగులెత్తించినవి. మాలతి, నిర్మల, పిన్ని, పాప సమక్షంలో అతని జీవితం హాయిగా సాగుతోంది.

నెల రోజులు పిన్ని—ఇంట్లో ఉన్నాడు. ఈలోపుగా తల్లీ తండ్రీ వచ్చారు. ఎవరుకూడ అతని పిచ్చి విషయం ప్రస్తావించగూడదన్న కట్టడి సందరు ఏమరుపాటు లేకుండా అనుసరించారు.

ఒక మధ్యాహ్నం నిర్మల భర్తలోని మార్పు గమనించింది. అంతే .... ప్రకాశ్‌ను తిరిగి తీసుకెళ్లిపోయారు.

ఎడారిలో ప్రయాణం చేస్తున్నవాడి దగ్గర్నుంచి నీళ్లతిత్తిని లాగేసుకున్నలా అనిపించింది నిర్మలకు. భర్తను తీసికెళ్లిపోతుంటే పొంగుతున్న దుఃఖాన్నాపుకునేందుకు పెదాలు బిగబట్టింది. గుండెల్లో బాకులు దూరినంత బాధ .... కళ్లు జలాశయాలై నిర్జీవంగా స్తంభాన్నానుకుని చూస్తుండిపోయింది.

"అమ్మా—నాన్నతో పోతా" అంటూ స్వర్ణ

అంటూంటే, నిర్మల "ఒద్దు తల్లీ—ఒద్దు" అంటూ బిడ్డను గట్టిగా కావిలించుకుని కంటికి మింటికి ఏకధారగా ఏడ్చింది. ఇంతకాలం అవ్యక్తమయమైన హృదయంలోంచే హాలాహలం పుట్టుకొస్తోంది.

ఆ నెలరోజు లొక మధుర స్వప్నంగా నిల్చిపోయింది. ఆ మధుర సమయంకోసం నిరీక్షించటమే ఆమె జీవితాశయమై పోయినట్లుంది.

మళ్లీ హైదరాబాదు, ఇల్లు, మాలతి, అత్తమామలు, పాప, ఇంటిపనులు, జబ్బులు, మానసిక బాధలు—సంసార భారం నెత్తిన పడ్డాయి. ఎప్పటిలా దినాలు గడిచిపోతున్నాయి.

ఇంటినించి ఉత్తరం రాక కొన్ని వారాలైంది. భర్తకలా అయ్యాక నిర్మల ఇంటికే వెళ్లలేదు. ఒకరోజు హఠాత్తుగా అమ్మ, నాన్న దగ్గరి కెళ్లాలనిపించింది. పెద్ద తమ్ముడిని పిలిపించి వాడితో బయలుదేరింది.

వేసవి సెలవలు. తమ్ముళ్లకు బడి లేదు. ఒకవిధంగా తనకు కావలసిన మనశ్శాంతి లభిస్తుందనుకుంటూ ఉంది నిర్మల. కుసుమని బాబును చూడాలని ఆత్రుతగా ఉంది.

బస్సు కొచ్చిన తండ్రి ముఖం చూచి, నిర్మల స్తంభించిపోయింది. ప్రసాద్‌గారి ముఖంలో తీరని ఆవేదన ప్రస్ఫుటంగా అగుపిస్తోంది. కూతురిని చూడటంతో గల్గిన సంతోషం క్షణికమై నిల్చింది. మనవరాలి నెత్తుకుని ముద్దాడారు.

"అంతా కులాసాగా ఉన్నారా నాన్నా" అంది ఆత్రుతతో.

"ఉన్నామమ్మా—ఇలా ఉన్నాము". ఆ జవాబు నిర్మలకు తృప్తి నివ్వలేదు. బండిలో కూర్చున్నాక తండ్రిని కదిలించింది. కానీ ప్రసాద్‌గా రప్పటికీ మౌనంగానే ఉండిపోయారు.

ఇంట్లో అడుగు పెట్టగానే కమలమ్మ కూతుర్ని కావిలించుకుని ఏడ్చింది. ప్రసాద్‌గారు కోపంతో అసలే సగం ప్రాణంతో వచ్చిన పిల్ల నిలా హడలు కొట్టించేలా ఏడిస్తే అమ్మాయి కేమన్నా సంతోషం కల్గుతుందటే. ఊరుకో .... కొన్నాళ్లపాటు హాయిగా ఉండనీయ్ మన దగ్గర." అన్నారు.

కమలమ్మ కన్నీళ్లు తుడుచుకుంది. కుసుమ అక్కయ్యను గట్టిగా పట్టుకుంది. ముంచుకొస్తున్న దుఃఖాన్ని అతి ప్రయాసతో ఆపుకున్నారిద్దరూ. కుసుమ, ఏడాదెల్లిన కొడుకు మురళిని చంకనేసుకుని పెరట్లో కెళ్లింది.

మధ్యాహ్నం భోజనాలైనై. పట్టిమొక్కల మొదలకు నీళ్లు కొడుతున్నాడు చిన్నతమ్ముడు. నేల మీద జంపఖానా పరుచుకుని పడుకున్నారు. పట్టివేళ్ల సన్నని పరిమళంతో కూడిన చల్లదనం, ముఖ్యంగా అమ్మా, నాన్నల ప్రత్యక్షత నిర్మల హృదయాన్నెంతో సంతృప్తిపరచినై.

ఒక కునుకుదీసి లేచింది. అందరూ నిద్రపోతున్నారు. నిర్మల మేలుకోటం చూచిన కమలమ్మ నిర్మలకు సైగ జేసింది. ఇద్దరూ ఒక మూలగా పడుకున్నారు. కమలమ్మ అంది "కుసుమకిక భర్త దగ్గరి కెళ్లే అదృష్టంలేదు నిర్మలా".

"అదేం ?" అంది ఆశ్చర్యంగా. ఉన్న మత్తు వదిలిపోయింది.

38-వ పేజీ చూడండి

# కన్నీటి కలువ

శివరాజు సుబ్బలక్ష్మి

కొలనులో కలువలు కనులు విప్పాయి
బాలకిరణపు కాంతి సోకినది యంత
కలువవిడిచే కన్నె వరుని జూపుల జిక్కి
ముంగిన పువ్వులా ఎగ పెక్కినపుడు
పల్ల మబ్బుల వెనక మెరుపు చందాన
సిగ్గు మెరుపొకటి చిరునవ్వులో భావాలు కదిలించినట్లు
మొగ్గలో రేకొకటి వయ్యారముగ కదలె!
ముగిమీ పూజారి తెలికొలనులో జేగ!
కలువ కాడలు తుంచె కఠిన హస్తాల
విలవిలా కలువలవి విలపించుతూను
నైవేద్యపు పత్రాల నీటితో నింపె.

*

సృష్టిలో పుష్పాల సోయగముకంటె
ఆనందమయపు కాంతి పోయి అంతటికంటె
పగటి, రాత్రి, కలయిక మృదువుగా కదిపినట్టి
హిమకాంతివలె నిర్వికారమైన విశ్వవిభుని
ప్రతినిధి పాషాణ ప్రతిమ కంఠము చుట్టి
మృదువుగా పువ్వుగా ఓరిచు బూనినది.

*

ప్రథమమై పసివాడి ఒరిగె కలువల మాల
కొన్ని కలువలు ప్రియుని హస్తంబులో నలిగి
ప్రేయసిని చేరి వేడి నిట్టూర్పులకు, తలలు
వాల్చుకొనుచు, ప్రేయసి హస్తంబు జారిపోవ
నేల కొరిగెను కలువలు ముత్యాల సరులవలెను
కొలను మధ్యన ఉన్న కలువ లవి వికసించి
వయ్యారముగ ఊగుతూ పిలుతూ
కొలువుకెళ్లే ప్రభువు చందాన
వెలలేని రంగులు విరజిమ్ముతూను
గాలి కంపులు తన చుట్టు విరజిమ్ముచుట్టు
తీరుగా రేకుల్లు విప్పుకొనుచుండ
కొలను మధ్యన కలువల సోయగము చూసి
నీటి అంచుల మొగ్గలు నిట్టూర్పు విడచె
పువ్వుగా వికసించనీయరే మమ్మనుచు
కలువమొగ్గలు తలవోసి తలలు వంచె.

*

కొలను మధ్య ఉన్న కలువ పూవుల రంగు
కొలపురుషుని కనులలో కలువుకొనుచుండె
పదవిచ్యుతుడైన ప్రభువు చందాన
పూర్వ శిల్పాల చిహ్నాలతో శిథిలమయిన సౌ
ధాల హారాలలో కరిగి మిగిలిన గాళ్ల చందాన
కాంతి తరిగిన కలువ లవి విలపించె నంత.
రంగు రంగుల కాంతు లలముకొని నానాడు
విశ్వవిభుని వక్షంబుపై వికసించి ఉండ
ప్రేయసీ ప్రియుల ఆత్మ సంతృప్తికై
మృదువైన ప్రేయసీ అధరమ్ములో నలిగి
ప్రేయసి చెక్కిళ్లపైచేరి రంగులు పులిమి
ఆనాటి గాలి వయ్యారముగ వను చేరెనంచు
ఈనాటి ఈ గాలి బరువు మోయలేనంచు
గాలితో కయ్యంబు సలుప లేకపుడు
కలువరేకులు నీటిలో కలిసినవి యంత
కడసారి కన్నీటిబొట్టు వలె చిన్నారి రేకొకటి
విలవిలా విలపించి నీటిలో వాచుపై విశ్రమించె!




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**2-11-1962 శుక్రవారము మొదలు**

**8-11-1962 గురువారమువరకు**

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

వృత్తి ఉద్యోగాలలో వ్యతిరేక భావాలు, ప్రతిబంధకాలు తొలగిపోయి మీ మాటను సాగించుకొనగలుగుతారు. ఆదాయము, ఖర్చులు కూడా అధికంగానే ఉంటవి. నిర్ణయించుకున్న పనులు పూర్తి అయ్యేలోగా చిన్నచిన్న మార్పులు చేస్తూపోవలసి ఉంటుంది. ప్రయాణాలు శ్రమకరంగా జరుగుతవి. ఈ వారంలో రావలసిన వార్తలు సక్రమంగా రాకపోవచ్చు. బాహ్య విషయాలలో మీరు స్వతంత్రించతగిన కార్యకలాపాలలో కూడా ఒక అడుగు వెనుకకు తగ్గి ఉండటమే ప్రస్తుతం అవసరం అవుతుంది. కోర్టు కచేరీలలో మంచితనంతో కార్యాలు సాధించుకొంటారు. అకస్మాత్తుగా దేహబాధలు కనుపించి క్రమంగా నివర్తి అవుతవి. వారాంతంలో మంచి స్నేహితులు లభిస్తారు. 2, 3 తేదులలో శుభకార్యాలు, ఇష్టవస్తు లాభము.

* * *

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ప్రస్తుతం మిమ్మలను ఉద్రేకపరచగల సంఘటనలు ఏర్పడుతవి. అధికారులవల్ల మాట వస్తుందనే ఆందోళన కలుగవచ్చు. ముందుగా మిమ్మలను తొందరపెట్టినవారే మీరు కార్యరంగంలో ప్రవేశించగానే ప్రక్కకు తొలగగల అవకాశాలున్నవి. దైవికంగా వ్యవహార రంగంలో మెలికలు, ఇతరుల పోటీలు తొలగిపోవటంవల్ల మీ కృషి అనుకూలిస్తుంది. మనశ్శాంతి మాత్రం తక్కువ. పిల్లల శుభకార్య ప్రయత్నాలు అనుకూల ధోరణిలో జరుగుతవి. కుటుంబంలోని వారికి అనారోగ్యం చేయుగల సమయం. ముందు చూపుతో అనుకూలించగల పనులయందు ప్రస్తుతం ధనం వినియోగించవలసిన అవసరం కలుగుతుంది. కాంట్రాక్టులు మొదలయిన వ్యవహారాలలో పేచీలు వస్తవి.

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో కుజ రాహువులు; తులలో సూర్య బుధులు; వృశ్చికంలో శుక్రుడు; మకరంలో శని కేతువులు; కుంభంలో గురువు; ధనుర్మకర కుంభ మీనాలలో చంద్రుడు.

* * *

## మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

మీ మనస్సులో మంచి యోచనలు కలుగుతవి కాని, ఆచరణలో పెట్టటంలోనే శ్రమపడవలసి వస్తుంది. కొన్ని సందర్భాలలో మీరు అనుకున్న దానికంటే అధికంగా ఫలితం ఉంటుంది. తరచు కలహ ప్రసంగాలు రాగల సమయం; జాగ్రత్తగా ఉండటం అవసరం. ఇతరుల మోసపు మాటల మూలంగానూ, దుబారా ఖర్చులతోను మీ చేతిలో డబ్బు నిలువకుండాపోయే అవకాశాలున్నవి. రాజకీయాలలో వాద ప్రతివాదాలు ఉన్నా, మాట చలామణి అవుతుంది. విందులు, వినోదాలు మొదలయిన వానియందు పాల్గొంటారు. విద్యా విషయంలో మనస్సు స్థిరంగా నిలుపలేకపోతారు. కుటుంబంలో జరిగే పనులు ఒకదానికొకటి సంబంధంలేని ధోరణిలో ఉంటవి. దుర్గాపూజ చేసుకొనటంవల్ల గౌరవము, కార్యసిద్ధి పొందగలుగుతారు. 7, 8 తేదులలో గొప్పవారి స్నేహము, ధర్మకార్యాలు.

* * *

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

సుఖంలేని పనులు, ఉపయోగంలేని ధనవ్యయం ఈ సమయంలో అధికంగా ఉంటవి. మీ వృత్తి వ్యాపారాలలో ఇంతకు ముందుకన్నా సంతృప్తికరంగా ఉంటుంది. ఎదుటివారు మిమ్మలను గౌరవంతో చూస్తున్నా, ఎవరివల్ల ఏ సమయంలో ఏవిధంగా మాటవస్తుందోనని అనుకుంటూ ఉంటారు. తూర్పు, దక్షిణ దిక్కులనుంచి ధనలాభం ఉంటుంది. ఏ వ్యవహారంలో దిగినా చాలా చురుకుగా పూర్తిచేసుకొనటానికి ప్రయత్నించటం మంచిది. ముందు ఏదో సాధిద్దామనుకొని కాలయాపన చేయటంవల్ల మొదటికి మోసం రాగల అవకాశాలున్నవి. వారం రెండవభాగంలో మీ హోదా బాగుంటుంది. గ్రంథ పఠనము, సాహిత్య రంగంలో పరిశ్రమ మొదలయినవాటియందు నిరుత్సాహం తోస్తుంది.

* * *

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

గ్రహబలం అనుకూలంగా ఉన్నది. ఏ పనిచేసినా పదిమందిని ఆకర్షించి సంతృప్తిపరచగలుగుతారు. కుటుంబంలో మీరు అనుకొన్న కార్యక్రమాలు ఒక పద్ధతిలో సాగి సుఖ సంతోషాలు లభిస్తవి. గొప్పవారి పరిచయం. వృత్తివ్యాపారాలలో ఆదాయం

మాట ఎలా ఉన్నా, గౌరవము, భారీ లక్షణాలు కనుపిస్తవి. అనుభవంలేని సాహసకార్యాలయందు ప్రవేశించతగిన సమయంకాదు. బంధు మిత్రులకు సంబంధించిన పనులు పైనవేసుకొని చేయవలసి వస్తుంది. ప్రసంగాలలో మిమ్ములను తేలికగా మాట్లాడేవారు ఉంటారు. తొందరపడతగిన సమయంకాదు. వాహనాలు ఎక్కటం, అగ్ని, ఆయుధ సంబంధమైన పనులలోను చాలా జాగ్రత్తగా ఉండండి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. 4, 5లలో పోటీలు, వృధావ్యయం, శ్రమకరమైన పనులు.

* * *

### కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ముఖ్యంగా మనోధైర్యంతో ముందుకు పోదగిన సమయం. మిత్రులను నమ్ముకుని ఏ పని సాగించవద్దు, ఈశ్వరానుగ్రహంవల్ల స్వశక్తి బాగుంటుంది. ధన సంబంధమైన లావాదేవీలు సౌమ్యంగా పరిష్కారం అవుతవి. గొప్పగొప్ప వ్యాపార కార్యక్రమాలలోను, స్థిరాస్తులను కొనే సందర్భంలోను మొదట కొన్ని వ్యతిరేక సూచనలు కనుపించి క్రమంగా అనుకూలత కలుగుతుంది. అయితే కొంత వృధా ధనవ్యయం అవుతుంది. వ్యవహారరంగంలో వాక్సహాయం చేసేవారు లభిస్తారు. దూరపు ప్రయాణాలు చేయవలసివస్తుంది. కుటుంబంలో ప్రశాంతంగా ఉంటుంది. శుభ సంతోష కార్యాలలో పాల్గొంటారు. 5, 6లలో అనారోగ్యబాధలు, ధననష్టము, కష్టవార్తలు.

* * *

### తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ఈ వారం క్రొత్త పని ఏదీ సాగించలేకపోతారు. విశ్రాంతిలేకుండా కార్యభారంలో మునిగి ఉంటారు. పర్యవసానంలో ఆలోచించుకొంటే ప్రత్యేకంగా మీరు చేసింది ఏమీ కనుపించదు. పదిమందిలో ఆడంబరంగా తిరగటంమాత్రం లెక్కలోకి వస్తుంది. ధనాదాయం మామూలుగా ఉంటుంది. తరచు ముందు యోచనలేకుండా వ్యవహార రంగంలో దిగటం జరుగుతుంది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. కలహ ప్రసంగాలు రాకుండా చూచుకొనండి. ఆహార విహారాలలో శ్రద్ధ వహించి ఆరోగ్యం కాపాడుకొనండి. నౌకరులు మొదలయినవారు ఈ సమయంలో మీ వస్తువులనుగాని, డబ్బునుగాని అపహరించటానికి చూస్తూ ఉంటారు. 6, 7 తేదులలో దైవకార్యాలు, లాభవార్తలు, సుఖభంగం.

* * *

### వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ప్రస్తుతం మనోధైర్యం తగ్గుతుంది. వ్యవహార వ్యాపారాలలో ధనవ్యయం కనుపిస్తుందేకాని, శత్రువుల పోటీవల్ల ఎక్కడి పనులక్కడ నిలచి ఉంటవి. భంగసూచనలుమాత్రం ఉండవు. మీ ఆరోగ్యం సరిగా ఉండక చికాకు కలుగుతుంది. కాని, వారాంతంలో మంచి మార్పు కనిపిస్తుంది. ఇతరులకు ధనసాయం చేయవలసిన అవసరంవస్తుంది. నౌకరులను నమ్ముకుని క్రొత్త వ్యాపారాలలో సాహసం చేయతగిన సమయంకాదు. మీరు అనుకున్న ప్రయాణాలు ప్రస్తుతం జరుగవు. దూరమందున్న బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. 7, 8 తేదులలో సంఘంలో గౌరవం, ధనలాభం.

* * *

### ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ వారం మీ కుటుంబ పరిస్థితులలో మంచి మార్పు వస్తుంది. ఒకరి మాటను మరొకరు ఆమోదించి సహాయం చేస్తారు. పిల్లల ఆరోగ్యం ఇంతకు ముందుకన్నా బాగుంటుంది. వృత్తిలో శ్రమ తగ్గి, ఫలితం క్రమంగా పెరుగుతుంది. మీరు ఎవరికోసం ఎదురుచూస్తూ ఉంటారో వారివల్ల ప్రయోజనం పొందలేకపోవచ్చు. అయినా మీ ప్రయత్నాలు నిరాటంకంగా నెరవేరుతవి. వినోద కార్యక్రమాలకు ఏదో ఒక ఆటంకం వస్తుంది. సాధారణంగా ఈ సమయంలో స్నేహితులు మీకు ప్రతికూల మార్గంలో మాట్లాడి మిమ్ములను విసిగిస్తూ ఉంటారు. చేతిలోని డబ్బును ముందుగా ఖర్చుచేసి చివరకు ముఖ్య అవసరాలకు కష్టపడవలసిన స్థితి రాకుండా చూచుకొనండి. 4, 5 లలో కలహ ప్రసంగాలు, శ్రమతో కార్యసిద్ధి.

* * *

### మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

గతకాలంలో చేసిన శ్రమ ప్రస్తుతం ఫలితానికి వస్తుంది. మీ మనస్సులో అలజడి కలుగుతూ ఉండడంవల్ల జరుగుతూఉన్న పనులను మీరే నిలుపుకొంటారు. మీ వృత్తిలో చిక్కులు తొలగి అధికారుల ప్రాపకం లభిస్తుంది. ఈ సమయంలో వచ్చే ఉత్తరాలు మిమ్ములను ఆదుర్దా పెట్టవచ్చు. అంతమాత్రాన నిర్ణయంచేసి, కార్యరంగంలో దిగవద్దు. వారం రెండవభాగంలో ఆరోగ్యం చెడుతుంది. దైవకార్యాలవల్ల ఖర్చులు కనుపిస్తవి. క్రొత్త వ్యాపారాలలో ప్రవేశించటం, క్రొత్తవారిని నమ్మి మీ బాధ్యతలను ఒప్పగించటం అంత మంచిదికాదు. 2, 3లలో ధనలాభం, మనశ్శాంతికి భంగం.

* * *

### కుంభం:

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

వృత్తి ఉద్యోగాలలో మీ అంతస్తు పెరిగే సమయం. ఎప్పుడూ పదిమంది మిమ్ములను అనుసరిస్తూ ఉంటారు. ధనాదాయం బాగుంటుంది. ఎవరు ఏమి చెప్పినా శ్రద్ధతో వినవలసిన సమయం. ఖర్చులు కనుపిస్తున్నా పనులు సక్రమంగా పూర్తి అవుతవి. సంఘకార్యాలలో మీ అభిప్రాయాన్ని ధైర్యంతో ఆచరణలో పెట్టగల అవకాశాలు వస్తవి. అయితే ఇతరులకు పంచాయితీ చెప్పవలసిన భారం పైనవేసుకొనవలసి వస్తుంది. అధికారులతో కలహాలు రాకుండా జాగ్రత్తపడండి. ప్రయాణాలు సంతృప్తికరమైన ఫలితాన్ని ఈయవు. 7, 8 తేదులలో సంతోషవార్తలు, శ్రమ, కార్యసిద్ధి.

* * *

### మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

కార్యభారం తగ్గించుకొనటం అవసరం. ఇతరుల ఆడంబరాన్ని చూచి మోసపోవద్దు. మాటలలో తొందర పడకుండా వచ్చినంతవరకు ఫలితం చేతికి తీసుకొనటం మంచిది. ఈ సమయంలో పౌరుషము, పట్టుదలలు పెట్టుకొనటంవల్ల చిక్కులు వచ్చే సూచనలున్నవి. ప్రస్తుతం స్నేహితుల మాటను వెంటనే అమోదించలేకపోతారు. రుద్రాభిషేకము, శివ సహస్రనామపూజ జరుపుకొనటం వల్ల ఆందోళన తొలగి మనశ్శాంతి లభిస్తుంది. వృత్తిలో ప్రతిబంధకాలు తొలగుతవి. కుటుంబంలోనివారి క్షేమారోగ్యములు బాగుపడుతవి. నిజా నిజములు విచారించకుండా ఎవ్వరిని నిష్టురంగా మాట్లాడవద్దు. మనోనిగ్రహం అవసరం.

★

### ఈ వారము ధరలు

బంగారు ధర మందీలోనే ఉంటుంది. వారం మధ్యలో స్వల్పంగా తేజీవస్తుంది. వెండి ధర కొంచెం తగ్గి తిరిగి పెరుగుతుంది. చింతపండుకు గిరాకీ వస్తుంది. నూలు ధర క్రమంగా పెరుగుతుంది. వేరుశనగపప్పు ధర మందీలో ఉంటుంది. నూనెధర గత వారంలోవలెనే నిలకడగా ఉంటుంది. నూవుల ధర తేజీవచ్చి మరల తగ్గుదల వస్తుంది.



# దగ్గు మరియు రొంపనుండి

# నిజమైన స్వస్థత పొందుటకు







# సిరోలిన్ వాడండి




దగ్గు లేక రొంపను అశ్రద్ధచేయకండి. సిరోలిన్ వాడి నిరపాయముగా, శీఘ్రముగా నిజమైన స్వస్థత పొందండి. సిరోలిన్ దగ్గును ఆపుటయేకాదు. అది మీ దగ్గుకు మూలకారణమైన హానికరమగు సూక్ష్మ క్రిములను నశింపచేయును; కఫమును నుసను పోగొట్టును. సిరోలిన్ ఎంత కష్టమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత చేకూర్చును. దాని పనితనమును బట్టియు రుచిని బట్టియు సిరోలిన్ కుటుంబములోని వారి అందరి అభిమాన పాత్రమై యున్నది. పిల్లలకు సిరోలిన్ అంటే ఎంతో ప్రీతి.

**మీ యింట్లో సిరోలిన్ తప్పక ఉంచండి**

'రోష్' తయారు   సోల్ డిస్ట్రిబ్యూటర్సు: వాల్టాస్ లిమిటెడ్,

JWT-VT-2397

# సరాగమాల

## వి. ఎ. కె. రంగారావు

పాఠకులు వెలిబుచ్చిన సందేహాలకు సమాధానం చెప్పటం ఈమధ్య కాస్త ఆలస్యం అవుతున్నది. వచ్చే నెలనుంచి ఎప్పటి కప్పుడే సమాధానాలు చెప్పే ఏర్పాటు చేసే ప్రయత్నం చేస్తాను. అంతవరకు సహృదయంతో వోపిక పట్టమని పాఠకులకు మనవి.

హనుమకొండ నుండి వ్రాసిన కురిమెళ్ల ఉపేంద్ర గారికి — "కాలా బజార్" చిత్రానికి వి. రాత్రా ఛాయాగ్రాహకులని మీరు వ్రాసినది నిజమే. "కాగజ్ —కే— ఫూల్" చిత్రంలో వర్షం దృశ్యంలో "రిమ్‌ఝిమ్‌కే తరానే లేకే" పాటను పోలిన నేపథ్య సంగీతం వినిపించింది. ఆ చిత్రానికి ఛాయాగ్రాహకులు వి. కె. మూర్తి. జ్ఞాపకం పెట్టుకోవడంలో ఈ రెండు విషయాలు కలిబిలి అయిపోయినవి. పై పాటను గురించే ధన్‌బాద్‌నుంచి "రీటా", "సీతా" వ్రాశారు. పాట చరణంలో కొన్ని తప్పులు దొర్లినవని. అవి కేవలం అచ్చు తప్పులే.

నిజామాబాద్‌నుంచి వ్రాసిన రామస్వామిగారికి. మీరు వ్రాసిన పాట "లాల్‌ఖిల్లా" లోనిది విన్నాను. కాని దానిని పోలిన పాటను రేడియోలో వినలేదు. మీరు విన్నది సిలోన్ రేడియో ప్రసారమైతే, ఆ పాట వచ్చిన శీర్షిక, తేదీ, సమయం ఇస్తూ, తపాలాబిళ్లలు జతపరచి ది కమర్షియల్ సర్విస్ ఆఫ్ రేడియో సిలోన్‌కి మీ సందేహాన్ని వ్రాస్తే కోరిన అంశాలని వారు తెల్పుతారని నాకు తెలిసినవాళ్లెవరో అన్నారు. ఉత్తరాలు మాత్రం ఆంగ్లంలో గాని, హిందీలో గాని వ్రాయాలట.

విజయనగరం నుంచి వ్రాసిన జి. పి. దాసు గారికి — కదనకుతూహలం నే వ్రాసినట్లు హరికాంభోజి జన్యమే కాని, మీ రన్నట్లు ధీరశంకరాభరణజన్యం కాదు. ఆ రెండు రాగాలు బాణచక్రంలోనివే అవటం వలనను, ఆ రెంటికీ కైశికీ, కాకలీ నిషాదాలే తేడా అవటం వలనను మీరు ఆ విధంగా పొరబడి ఉంటారు. ప్రమాణానికి శ్రీ ఏకా సుబ్బారావుగారి కొత్త సంగీత దర్పణంలో 501—502 పేజీలు చూడండి.

సికింద్రాబాదు నుంచి వ్రాసిన ఎస్. నర్సింగ రావుగారికి : "ఆరతి" హిందీ చిత్రానికి ఈమధ్యనే కలపబడిన నృత్యగీతం "ఉమ్‌మా ఉమ్‌మా" అన్నది "మంచి మనసులు", "మామా మామా" పాటకు అనుకరణే. ఏం? తెలుగు నుంచి హిందీకి అనుకరిస్తారా అని అనుమానం వేసిందా మీకు?

నెల్లూరు జె. జయకుమార్‌గారికి : "సువర్ణ సుందరి" లో "పిలువకురా" సుశీల మాత్రమే పాడారు. అలాగునే "పాహి పరమేశ్వరా" పాడినది జిక్కి మాత్రమే. మీరు అనుకొన్నట్లు తక్కిన పాటకులు పాడలేదు. "చెంచులక్ష్మి" పాటల గురించి ఈమధ్యనే వ్రాశాను. "కలసి ఉంటే కలదు సుఖం" విడుదల కాకముందు జమునా రాణి, శ్రీనివాస్ కలసి "మొగలిపూవు ముడిచి" అనే పాట ప్రైవేటు రికార్డుగా ఇచ్చారు. సినిమాలో "ముద్దబంతిపూలు" అని పాడినది సుశీల, ఘంటసాల. రెండిటివి ఒకటే వరస. ఎస్. జానకి సినిమాలకు పాడిన మొట్టమొదటి పాట సంగీత దర్శకులు టి. చలపతిరావు కృతి "పేదై ఎన్నాళై" అన్నది; "విధియిన్ విళయాట్టు" అనే తమిళ చిత్రంలోనిది. తెలుగులో మొదటి అవకాశం పెండ్యాల ద్వారా లభించింది. "ఎం. ఎల్. ఎ" లో ఘంటసాలతో కలసి పాడిన యుగళగీతం "నీ ఆశ అడియాస". కన్నడంలో మొదటి పాట కూడ పెండ్యాలవారిదే; "కృష్ణగారడిలోని "భలే భలే గారడి" అన్న పాట. హిందీలో మొదటి పాట రాణితో కలసి "పియామిలన్" లో రమేశ్‌నాయుడు ఆధ్వర్యాన పాడినది. మళయాళంలో రంగనాథం సంగీత దర్శకత్వంలో "మిణ్ణున్నదెల్లాం పొణ్ణల్ల" చిత్రంలో పాట.

రెండు వారాల క్రిందట పింగళి ప్రభాకర రావు బృందం పాడిన పాటల గురించి వ్రాస్తూ మలహరి నిషాద గాంధారవర్జ్యమైన రాగమని వ్రాశాను. నిషాద గాంధారాలు ఆరోహణయందే వర్జ్యములు. అవరోహణయందు గాంధార మున్నది. ఈ పొరపాటును వెంటనే దృష్టిలోకి తెచ్చిన ప్రభాకరరావుగారికి కృతజ్ఞత. ఆ విషయంలోనే ఒక అచ్చు తప్పు దొర్లినది. "సాగునదో" వలజి రాగం. వలభి కాదు.

రెండు వారాల క్రిందట ఇంకా నిర్మాణంలో ఉన్న రెండు చిత్రాలలో చెరి ఒక పాట విన్నాను. ఒకటి చిత్రీకరణ సమయంలో, మరొకటి రికార్డింగ్ జరుగుతున్నపుడు. మొదటిది వినటానికి ఎంత వికారంగా ఉందో, రెండవది అంత మనోజ్ఞంగా ఉంది. మొదట వికారంగా ఉన్నదాని సంగతి.

అసలు విషయానికి వచ్చేముందు కొంచెం విపులంగానే ఉపోద్ఘాతం వ్రాయాలి. లేకపోతే అసలు రహస్యం బోధపడదు. ఓపికగా చదవండి.

సుసర్ల దక్షిణామూర్తి స్వయంప్రజ్ఞగల సంగీత దర్శకులు. సాధనావారి "సంసారం" వారి మొదటి చిత్రమో, వారి మొదటి పేరుపొందిన చిత్రమో అయిఉంటుంది. అందులో చాలమట్టుకు హిందీ అనుకరణలే. చిత్రం అశేష జనాదరణ పొందుటచేత "కల నిజమాయెగా", "తులసి" వంటి చవకబారు పాటలు కూడ ప్రజల నోళ్లలో చెలరేగాయి ఆ రోజుల్లో. అది దృష్టిలో ఉంచుకొని కాబోలు సుసర్లవారు ప్రతి చిత్రంలో విధిగా హిందీ వరసలు దింపడం, ఇమిటేషన్ దక్షిణామూర్తి అని శాశ్వత యశోమూర్తు లవడం జరిగింది. ఇది చాలా చింతించవలసిన విషయం. చేతకాని సంగీత దర్శకులు చెత్త సంగీతాన్ని అందిస్తే ఎవరూ బాధపడరు. కాని దక్షిణామూర్తి వంటి స్థితప్రజ్ఞమూర్తులు ఏవో హిందీ వరుసలను అనుకరించి చెడ్డపేరు తెచ్చుకుంటే బాధపడని సహృదయులూ, సంగీత ప్రియులూ ఉండరు. వారి ప్రతిభా విశేషాన్ని మీరుగాని మరచిఉంటే ఈ క్రింది పాటలను గుర్తుకు తెచ్చుకోండి. "సంసారంలో" టైటిల్ సాంగ్, "సంతానం" లో "దేవి శ్రీదేవి", "చల్లని వెన్నెలలో", "ఇలవేలుపు" లో "పలికిన బంగార మాయనటే", "ఏనాడు కన లేదు", "జనగన మంగళ దాయక రామం", "భలే బావ" లో "ఆనందమంతా", "బండరాముడు" లో "ఎవరివి అడిగే మొనగాడా", "రమాసుందరి" లో దాదాపు అన్ని పాటలు. ఇవన్నీ ఇప్పటికీ వినటానికి గాని, జ్ఞాపకం చేసుకోవటానికి గాని ఎంత బాగుంటాయి.

ఇవే చిత్రాలలో వినిపించిన అనుకరణ సంగీతం కూడ జ్ఞప్తికి తెచ్చుకోండి. "టకు టకు", 'సంతోష మేలా, సంగీతమేలా", "సీమము విడి", "నీవే భారతస్త్రీల పాలిట", "పూలోయమ్మా", "రక రకాల పూలు". ఎంత వికృతమైన పాటలవి? మొదట చెప్పుకున్న పాటలు వింటే ఎప్పుడూ మరువలేనంతటి మంచి అభిప్రాయ మేర్పడుతుంది, మధురానుభూతి కలుగుతుంది. ఈ రెండవసారి చెప్పుకొన్న పాటలు వింటుంటే లేచిపోదామని గాని, రేడియో ఆపివేదామని గాని బుద్ధి పుడుతుంది. 

# కట్లిపెరాచో ఫ్యాన్సీడ్రెస్

కాలేజీనుండి ఇంటివరకూ ఉన్న ఒకటిన్నర మైలు రాళ్ళనీ మూడున్నర నిముషాల్లో దాటేసి, అర నిముషంపాటు స్కూటర్ హారన్ మోగించాడు శేఖర్. అయినా లాభం లేకపోయేసరికి, ధాటిగా తలుపు తట్టాడు. స్కూటర్ హారన్ ప్రయోగానిక్కి లొంగని తలుపులు "హస్తదాడి" కి కూడ లొంగకపోయేసరికి మహాచెడ్డ కోపం వచ్చేసిం దతనికి. దొంగ కయితే ఇంచక్కా లొంగిపోయేవి, "కౌనరు" యజమానికి అడ్డు తగలడం క్షమించరాని మహానేరం. "అసలు" యజమానితో చెప్పి తలుపులు తీయించేయాలి. అప్పుడుగాని వీటి తిక్క వదలదు. ఇంకి ఇలా కాదు. తలుపుల్ని "బొంబార్డ్" చెయ్యవలసిందే. ఒక గజం వెనక్కి వెళ్ళి, 45 మైళ్ళ వేగంతో ముందుకు విరుచుకువడ్డాడు వీరుడు. ముక్కూ మొగం ఏకం కావలసిన సమయంలో ఎదురుగా కుర్చీ వచ్చి ఆదుకుంది, యజమాని కదా అన్న కృతజ్ఞతాభావంతో. కుర్చీకి థ్యాంక్స్ చెప్పుకోబోతున్న శేఖర్ ఒకానొక స్త్రీ కంఠం నుండి వెలువడుతున్న నవ్వును విని కుర్చీని దాని కర్మానికి వదిలి, వెనక్కి తిరిగాడు.

గృహరాణి, తన రాణి, రాధారాణి విరగబడి మరీ నవ్వుతోంది, తలుపుచాటున దాక్కొని. "ఆహా, పతివ్రతా శిరోమణీ ...." అంటూ ఇంకా ఏదో అనబోతున్న అతని నోటికి కళ్ళు కళ్ళెం వేశాయి.

అబ్బ! ఎంత అందంగా ఉంది తన రాణి! స్నానం చేస్తూ చేస్తూ, ఆయనగారి హారన్ మోత విని, ఆదరా బాదరాగా చీర అల్లానే చుట్టేసుకుని వచ్చిందామె తలుపు తీయడానికి. పొడుగాటి కురులు మోకాళ్ళవరకు వేలాడుతున్నాయి. ముఖంపై అక్కడక్కడ తడిసిన ముంగురులు అంటుకొని




అభియేవాసి



ఉన్నాయి. ముఖంనిండా మంచి ముత్యాల్లా నీటి బొట్లు; మంచులో తడిసిన మంచి గులాబీలా స్వచ్ఛంగా, నిర్మలంగా ఉంది తన రాణి.

"ఏమిటలా చూస్తున్నారు ?" ఆ చూపుల కర్థం తెలిసినా, అడిగింది అర్ధాంగి, వళ్లంతా సిగ్గుల మొగ్గయి, చీర సర్దుకోడానికి నానా అవస్థ పడుతూ.

"ఇంత నవ్వినా నీ కింకా గెడ్డాలూ, మీసాలూ మొలవలేదేమో అని చూస్తున్నా".

"పోదురూ, అంతా ...." ఇంకేమనాలో తెలియక, నవ్వేసింది ఆమె.

"ఇదిగో అమ్మాయ్, అలా నవ్వకు ...."

"ఇంకెలా నవ్వాలండీ ?" అమాయకంగానే అడిగింది. అడిగి ఊరుకుందా ? మళ్లీ నవ్వింది.

"నవ్వులు పువ్వు లౌతాయి సుమా" హెచ్చరించే ధోరణిలో అన్నాడు.

"మీకే నయం. రోజుకి పూవులా మిగుల్తుంది" అని నవ్వింది తన "విట్టుకి" తనే మురిసిపోతూ.

"ఇలాంటి అల్లరి పిల్లని ఎలా దారికి తీసుకు రావాలో నాకు తెలుసు." లెక్చరర్ హోదాలో అన్నాడు శేఖర్, టై విప్పుకొంటూ.

"ఎలా ?" ఓరగా చూస్తూ కొంటెగా అడిగింది" కోణంగి.

"ఇలా ...." నడుము చుట్టూ చెయ్యి పోనిచ్చి దగ్గరగా లాక్కోబోయా డాయన.

"అబ్బ. పోదురూ, మీరు మరీను."

"పోతున్నా" వెళ్లిపోయాడు శేఖర్ "బాత్ రూమ్" లోనికి.

అలా అన్నందుకు ఎంత నొచ్చుకున్నారో పాపం అనుకొంది రాణి వెళుతున్న శేఖర్‌ని చూస్తూ.

"తనకి అన్నీ ఉన్నాయి .... అన్నీ ఉన్నాయి .... కాని...."

భారంగా నిట్టూర్చి, చీర మార్చుకుందికి వెళ్లింది రాణి. ఈ "కాని" యే తన హృదయాన్ని గులాబీ ముల్లులా గుచ్చుతూ ఉంటుంది. తను ఇంతటి చక్కని భర్తని కట్టుకొన్నందుకు, తన స్నేహితులు వాళ్లంతా ఎంత ఈర్ష్యపడ్డారో తలచుకొంటే ఇప్పటికీ తనకీ గర్వంగా ఉంటుంది .... కాని .... పెట్టె తెరచింది, ఏ చీర కట్టుకొందామా అని.

తన పెళ్లి గురించి తల్లి పడిన ఆరాటం ఇంతా అంతాకాదు. ఏ అయ్యా చేతిలో పెడితే తన బంగారు తల్లి ఏం అయిపోతుందో అని ఆమె ముసలి హృదయం తల్లడిల్లిపోయేది. తల్లిదండ్రులు ఆలోచించకుండా పెళ్లిళ్లు చేస్తే జీవితాంతం అనుభవించాల్సింది 'పిల్లలు' కదా మరి. ఎవరైనా చూపులకి వస్తున్నా రనగానే "గుండె దడ వస్తోంది బాబూ" అని కూలబడిపోయే దామె. "పాపం. తనంటె ఎంత ప్రేమ" అనుకొంది రాణి.

ఎర్రచీర, ఆకుపచ్చ అంచు ఉన్నది చేతికి తగిలింది. ఇది తన అదృష్టచిహ్నం. "స్వాహాదేవిలా ఉన్నావ్. తెలుగులో చెప్పుకోవాలంటే నిప్పులా ఉన్నావ్" అంటూ ఉంటా రాయన; ఆ చీర, అదే రంగు చోళీ వేసుకొంటే.

అసలు తనకు ఎర్రరంగు అంటే ఇష్టంలేదు. తన పుట్టిన రోజున సీత ప్రెజెంట్ చేస్తే తీసి కెళ్లి పెట్లో పడేసింది. ఆ ఏడయ్యాక మళ్లీ

# కష్టపిశాచి ఫ్యాన్సీ డ్రెస్

ఈయన చూపులకి వచ్చిననాడు తీసింది, ఈయన్ని కాస్త హడలగొడదాం అన్న సదుద్దేశంతోనే.

"ఈ సంబంధం నిశ్చయం అయిపోతుంది. తప్పదు. అలాని నాకు అనిపిస్తోంది. నా తల్లి అదృష్టవంతురాలు" అని పొంగిపోతున్న అమ్మ హడా విడీ, ఆనందం చూస్తుంటే తనకే నవ్వు వచ్చింది. ఇలా ఎన్నిసార్లు అనుకొందో పిచ్చితల్లి. అమ్మ సరే సరి. నాన్నగారు కూడ ఈయనమీదే ఆశలు పెట్టు కొన్నారు.

తనకి మాత్రం ఈ తతంగం అంతా అలవాటై పోయింది. గంగిరెద్దుల్లా రంగు రంగు "దుప్పట్లు" తొడుక్కొని పిచిక గూడు లాంటి క్రాపింగ్ వాడు ఒకడైతే, గొంగళీపురుగు లాంటి మీసంవాడొకడు. ఇంక ఒక్కొక్కడు ఉన్నాడంటే బొత్తిగా తలెత్తి చూడడానికే భయపడతాడు. మొట్టమొదటిసారి చూపులకు వచ్చినవాణ్ణి తను జన్మలో మరిచి పోలేదు.

అప్పుడు మాత్రం తను చాలా కంగారుపడింది. తల్లిదండ్రులు రంగంనుండి నిష్క్రమించగానే, తను కంగారు అణచుకొని, తలెత్తి ఎదురుగా కూర్చున్న శాల్తీ కేసి చూసింది. ఇంతవరకు రెప్పవాల్చకుండా తనని మింగేస్తున్నట్టు చూచిన (ఆ సంగతి తనకి తెలుసు) మగ ధీరుడు ఈసారి "డ్యూటీ" తనకి అప్పగించి, తల వంచుకొన్నాడు, ఇక చూసుకోమన్నట్టు. తర్వాత కోటు కాలర్ సర్దు కున్నాడు. ఆనక షర్టుకి కాలర్ ఉందో, మధ్య దారిలో ఊడిపోయిందో అని తడిమి చూచు కొన్నాడు. ముందు జాగ్రత్తకి టై కొంచెం వదులు చేసి, ఎందుకైనా మంచిదని మళ్లీ బిగించే శాడు. "అరే ఇదేమిటి ఇంతవరకు నేను (నల్ల) కళ్లద్దాలు తీయనే లేదన్నమాట. ఇంకా నయం" అనుకొని కళ్లద్దాలు తీసేసి, గుడ్డివాణ్ణి కానని నిరూపించేశాక మళ్లీ కళ్లకు అద్దాల్ని బిగించేశాడు. ఇంతలేసి ఘన కార్యాలు చేయడానికి ఎంతకాలం పట్టిందో అని వాచి చూసుకొన్నాడు. తర్వాత బూటు నిగనిగ మంటుందో, లేదో....

ఇంతవరకు "జూ" లో కోతిని చూస్తున్న ట్లుగా ఆనందించిన రాణి ఇక అట్టేసేపు అక్కడ ఉంటే సభ్యతగా ఉండదని లోపలికి వెళ్లిపోయింది, పొంగివస్తున్న నవ్వుకి 'డామ్' కట్టేసి.

కళ్లకి కాటుక పెట్టుకొంటున్న "అద్దంలోని రాణి" నవ్వుకొంది. "ఇదేమిటమ్మా, ఈయనింకా బాత్‌రూంనుండి ఊడిపడరేం? ఒకవేళ తను అన్న మాటలకి నొచ్చుకుని అలుగుతున్నారేమో. బయటికి రాగానే "నష్టపరిహారం" చెల్లిం చేయాలి. భలేవా రీయన. చిన్న పిల్లాడిలా అలుగు తారు, ఇంచక్కా" అనుకొంది అద్దంముందు ఉన్న రాణి, పువ్వులు తల్లో తురుముకొంటూ.

సుశిక్షితులైన నటులలా తల్లిదండ్రులు రంగంనుండి నిష్క్రమించగానే, ఆనాడు, అలవాటు

ప్రకారం "జయం మనదే" అన్న ధీమాతో తల ఎత్తి చూచింది తను. చూడగానే కనిపెట్టింది, ఎదుట ఉన్నది గంగిరెద్దు కాదనీ, పంచె, లాల్చీలో ఉన్న "చందమామ" అని. ఇంకా కనిపెట్టిందేమిటంటే ఆ చిన్నవాడు అందరిలా కాక తలని అదొక తమాషాగా ఎంచి తనని తదేకంగా చూస్తున్నాడనీ. ఆ భావం కలగగానే గుండె ఝల్లుమని చటుక్కున తల దించేసింది తను. మళ్లీ చూడమని మనస్సు గోలచేస్తూ ఉంటే పోనీకదా అని కళ్లు కొంచెం కొంచెంగా .... అలా .... అలా పైకెత్తి అతని విశాలమైన ఫాలభాగంమీద చిలిపిగా నాట్యం చేస్తున్న "కర్ల్" ని చూస్తూ ఎంత సేపు ఉండిపోయిందో అలా. అబ్బాయి ముక్కుమీద వేలు వేసుకుని "తప్పు స్వీటీ, అంతలా చూడకూడదు" అని ఆమెకి మాత్రమే వినిపించేట్టు అన్నాడు. తను ఫక్కుమని నవ్వింది, అలా సిగ్గు విడచి నవ్వినందుకు సిగ్గుపడి, కోపలికి తుర్రుమని దూసుకుపోయింది, కోకిలలా.

"రాణిగారు తెగ నవ్వుతున్నా రివాళ" స్నానం ముగించేసి వస్తూ అన్నాడు శేఖర్, అతి సాధారణంగా ముఖం గంభీరంగా ఉంది. అయ్యగారు అలుగుతున్నారన్నమాట.

తల దువ్వుకుంటున్న — శేఖర్ దగ్గరికి వెళ్లి "కోపం వచ్చిందా ? ఊ .... తీసుకోండి" చెక్కిలి అందించింది రాణి, బడి కెళ్లనని మారాం చేస్తున్న పిల్లాడికి తాయిలం పెట్టి పంపే తల్లిలా.

"అక్కర్లా" విసురుగా వెళ్లిపోయాడు శేఖర్, బట్టలు వేసుకోడానికి. ఐదు నిమిషాల్లో చక్కగా టక్ చేసుకొని శేఖర్ బయటపడేసరికి "ఫినిషింగ్ టచెస్" పూర్తి చేసుకుని రెడీ అయింది రాణి.

"గుడ్. హిడింబలా ఉన్నావ్" అలుగుతున్నానే సంగతే మరిచిపోయి, అనేశాడు శేఖర్.

"వెరీగుడ్. అలగడం పూర్తి అయిందన్నమాట."

"కాంత చేతి తోపలా ఏ మంత్ర మున్నదో ... అన్నారు పెద్దలు .... సరేగాని ఈ దువ్వెన తీసుకొని నా తలను కాస్త సమ్మోహింపుమా" తలని ముందుకు వాల్చేశాడు. అతనికి బొత్తిగా ముందు చూపు లేదు. లేకపోతే చీర పాడవుతుందని అయినా ఆలోచించక తల అలా వాల్చేస్తాడా ? ఆఁయ్.

"అబ్బ. ఇలా అయితే నేను దువ్వను బాబూ" బుంగమూతి పెట్టి, చిరు కోపాన్ని అభినయించింది.

"ఇదిగో అలా మూతి పెడితేనే .... "

"లేట్ అవుతోంది."

"ఆడదాని అలకలో ఏమంద మున్నదో .... పాడుకొంటూ తల దువ్వుకోవడం కానిచ్చి, నుదుటి మీదికి ఓ చిన్న "కర్ల్" లాక్కున్నాడు.

"ఎందుకలా జుట్టు పీక్కుంటారు ? వేలు కొండిలా మీ "కర్ల్" మీరూనూ".

"అమ్మమ్మమ్మ. అలా అనకు. ఈ "కర్ల్" ని చూసే ఓ తాతగారు నన్ను ప్రేమించేసి, 5432 రూ. కానుక ఇవ్వడమే కాకుండా వాళ్ల అమ్మాయిని కూడా ఇస్తామన్నారు తెలుసా ?"

"అయితే మీ "కర్ల్" కే గాని మీ కేం విలువ లేదంటారు ?"

"ఎందుకంటాను ? నా ఖరీదు అయిదువేలు. నువ్వు గనక మూడు వేలకే నన్ను కట్టేసుకున్నావ్ .... చౌక బేరం .... "

"చాల్లెండి. ఎవరైనా వింటే నవ్విపోగలరు. ఇంతకీ చర్చ దేనిమీద ?"

"నీ నెత్తిమీద .... పద."

కాలేజీలో రిక్షా దిగగానే సారస్వత సంఘ కార్యదర్శి ఏర్పాట్లు చూపించడానికి శేఖర్ని లోనికు పోయాడు. అమ్మాయి లందరు రాణిని వెయిటింగ్ రూమ్కి తీసుకుపోయారు. తను కాలేజీలో గడిపిన మధుర క్షణాలన్నీ రాణికి గుర్తుకి రాసాగాయి. ఇప్పు శామ లెక్చరర్‌గారి భార్య కాదు; విద్యార్థిను లలో విద్యార్థిని. "శేఖర్‌గారిని చూచి 'ఇంత షోకు చేసుకున్నాడు. ఈయనేం పాఠాలు చెప్తాడు ?' అనుకొన్నాం గాని, కాలేజీ మొత్తం మీద ఈయనలా చెప్పేవాళ్ల లేరు" అని ఒక అమ్మాయి సర్టిఫికెట్ ఇచ్చేసింది. విద్యార్థులకు ఆయనపై గల అభిమానానికి మురిసిపోయింది రాణి. ఎలాగైనా తను అదృష్టవంతురాలు. పిచ్చాపాటీలో పడి, కాలాన్ని మరిచిపోయిన వాళ్లకి మైక్‌లో కార్యదర్శి గొంతుక వినిపించింది. వాగ్వివాద సభ ఆరంభం కాబోతోంది కాబట్టి అందరూ ఆసనాలు అలంకరించండి అని అభ్యర్థించాడు. "లేచింది మహిళా లోకం."

---

అక్క:— ఏమే ! పాపా! నీకా టపా కాయి లెవ రే యిచ్చారూ?

పాప:— నా కాక రపువ్వొత్తులు బావ కిచ్చి ఇవి కొనుక్కున్నా నే...

శిష్టా జగన్నాథం (మద్రాసు)

---

కార్యదర్శి శేఖర్‌ని వేదిక మీదికి తీసికొనిపోయి, పుష్పమాలాలంకృతుణ్ణి చేసి, అధ్యక్షస్థానం అలంకరించవలసిందిగా కోరాడు. శేఖర్ లేచాడు. హాలు అంతా నిశ్శబ్దం. చర్చలో పాల్గొనేవారు పాటించవలసిన నియమాలు వివరించి, ఆనాటి చర్చనీయాంశం ప్రకటించాడు శేఖర్.

చర్చనీయాంశం తెలియగానే రాణి హృదయం ఝల్లుమంది. ఇంతవరకు కళకళలాడుతున్న ఆమె మొఖం గంభీరంగా మారిపోయింది. "వరకట్న నిషేధం అత్యంతావశ్యకము" అనేది చర్చనీయాంశం. మూడువేలు కట్నం గుంజిన మహానుభావుడు ఆ సభకి అధ్యక్షుడు. రాణి మనస్సు జుగుప్సతో నిండిపోయింది. ఆమె చెవులు వినడం మానేశాయి. రెండేళ్లక్రితం ఇదే చర్చనీయాంశంపై తను మాటాడిన రోజు జ్ఞాపకం వచ్చింది.

ఆరోజు .... తను మైక్ దగ్గరికి రాగానే అమ్మాయి లందరూ, చప్పట్లు కొట్టేనారు, తనని "ఎంకరేజ్" చేస్తూ. తను అనర్గళంగా అరగంట సేపు మాట్లాడింది. అమ్మాయిలే కాకుండా అబ్బాయిలు కూడ నిశ్శబ్దంగా కూర్చొని తదేకంగా వినడం గమనించి తను మరింత ఉత్సాహంగా, ధైర్యంగా కట్నాలు పుచ్చుకునేవాళ్లనీ, అడిగే వాళ్లని, దుమ్ము దులిపేసి, కడిగి పారేసింది. "తప్పరు. తనకే మొదటి బహుమానం వస్తుం" దన్న నమ్మకం తోచగానే తన ఉపన్యాసం ముగించి, వేదిక దిగబోతున్న సమయంలో కుమారి ఆమెని ఎదుర్కొన్నాడు.

"కట్నం పుచ్చుకోవడం నిహ్యమైన పనే. కాదని ఎవరూ అనలేరు. అయితే కట్నం పుచ్చుకునే వారినే నిందించడం భావ్యంకాదు. కట్నం ఇచ్చేవాళ్లకి కూడ న్యాయంగా ఆ "దీవనలలో" సగభాగం చెందాలి. ఇచ్చేవాళ్లు ఒకందుకు ఇస్తోంటే, పుచ్చుకునేవారు ఇంకొకందుకు పుచ్చుకొంటున్నారు. ఊరికే ఒకర్ని నిందించడం అన్యాయం. ఇక్కడున్న సోదరీమణులంతా కట్నాలు పుచ్చుకునే వాళ్లని చేసుకోం అని ప్రతిజ్ఞ చేయగలరా ? ఇంతెందుకు, అరగంటసేపు మనల్నందర్నీ ఆనంద సాగరంలో ముంచేసి ఉంచిన కుమారి రాధారాణి గారు అలా ప్రతిజ్ఞ చెయ్యగలరా ?"

హాలు అంతా నిశ్శబ్దం. వెయ్యి కళ్లూ ఒక్కసారిగా తనవైపు తిరిగాయి. ఇంతవరకూ నిశ్చేష్టుడై ఉండిపోయిన సభాధ్యక్షుడు లేచి ఏదో అనబోతున్నాడు. వేదిక దిగబోతున్న తను రివ్వున వెనక్కు తిరిగి మైక్ ముందుకి వచ్చింది. "సభ నలంకరించిఉన్న ఈ 500 మంది ఎదుట అలా ప్రతిజ్ఞ చేస్తున్నా" సగర్వంగా ప్రకటించింది తను. అమ్మాయి లందరూ చేతులు విరిగిపోయేటట్టు చప్పట్లు చరిచారు.

ఊహాలోకాల్నుండి ఉలిక్కిపడింది ఈ లోకానికి రాణి. శేఖర్ లేచి అధ్యక్షుని హోదాలో అంతిమ సందేశాన్ని అందిస్తున్నాడు. "రోడ్డు ప్రక్క నిల్చొని ఒక్క నయాపైసా ధర్మం చెయ్యమని ప్రాధేయపడే అడుక్కొనేవాణ్ణి చీదరించుకొనే మనికి కట్నం కావాలనే అర్హతలేదు ...." బ్రహ్మాండంగా సాగిపోతోంది శేఖర్ ఉపన్యాసం. తన అదృష్టచిహ్నంగా భావించిన ఎర్రచీర తన వంటిని దహించేస్తోంది. "ఆపండి మీ ఉపన్యాసం. మూడు వేలు కట్నం గుంజిన మీ కిలా మాటాడడానికి కూడ అర్హత లేదు" అని అరుద్దాం అనుకొంది రాణి. కాని ఏదో అదృశ్యశక్తి తన కనుమ హస్తాలతో తన గొంతుక నులిమివేస్తోంది. సభ ఎప్పుడు, ఎలా ముగిసిందో ఆమెకు తెలియదు.

రిక్షా కదిలింది. సీతారామాంజనేయులా ఉలుకూ, పలుకూ లేకుండా తన ప్రక్కనే కూర్చొని రాణి సత్యభామలా ఎప్పుడూ అనిపించింది శేఖర్‌కి. రోడ్డుమీద ఎవ్వరూ లేరన్న నమ్మకం కుదరగానే, ఆమె నడుము చుట్టూ చెయ్యి పోనిచ్చి, దగ్గరగా లాక్కోబోయాడామెని. అగ్నిపర్వతం బ్రద్దలు కాబోతోంది అనిపించింది. ఇంటికి వెళ్లేవరకు ఎవరూ మాటాడలేరు.

చిత్రమైన పరిస్థితిలో వ్యక్తులు విచిత్రంగా ప్రవర్తిస్తారు. ఇంతవరకు తనకి తెలిసిన రాణే వేరు. ఇప్పటి రాణిని అత డెప్పుడూ చూడలేదు. ఇంట్లో అడుగు పెడుతూనే సర్రున బెడ్‌రూంకి వెళ్లిందామె. ఈజీఛేర్‌లో కూర్చొని ఆమెను గమనిస్తూ కూర్చున్నాడు శేఖర్. పెట్టె తెరిచి తను ఎంతో శ్రమపడి ఆనాటి "వరకట్న పిశాచి ఫ్యాన్సీ డ్రెస్"

# కట్నపిశాచి ఫ్యాన్సీ డ్రెస్

మొదలు ఈనాటి "అల్లనేర్ల అలకలు" వరకు సంపాదించిన వనితాలోకం వ్యాసాల ఫైల్ బయటికి తీసింది రాణి. అగ్గిపుల్ల వెలిగించి ఆ వ్యాసాల్ని తగలబెట్టేసింది. ఆనాటి వాగ్వివాద పోటీలో తను గెలుచుకొన్న వెండి పతకాన్ని కిటికీలోంచి బయటికి గిరవాటు వేసింది. అంతే. తర్వాత రాణి ఏం చేసిందో, చేస్తోందో శేఖర్‌కి కనిపించలేదు. లేచి బట్టలు మార్చుకొని, స్వయంగా వడ్డించుకొని, భోజనం పూర్తిచేశాడు శేఖర్.

తెల్లవారింది. వేటగాని బాణం దెబ్బతిని సొమ్మసిల్లి పడిపోయిన లేడిలా పడిఉంది రాణి, మంచం మీద. ఆమె తలని వడిలోనికి తీసుకొని, ముంగురులు సవరిస్తూ తట్టి లేపాడు శేఖర్ ఆమెని; ఉదయం 8 గం. లకి. ఆమె కళ్లు తెరిచింది. బాధగా మళ్లీ కళ్లు మూసుకుని కొద్దిసేపటికి నెమ్మదిగా లేచి బాత్‌రూంకి వెళ్లింది. వేడినీళ్లు, టూత్‌పేస్టు సరంజామా అంతా సిద్ధంగా ఉంది. ఆమెబయటికి రాగానే,"ఇదిగో అమ్మాయ్. ఈ విషం కాస్త పుచ్చుకో." స్వహస్తాలతో తయారుచేసిన పొగలు రేగుతున్న కాఫీ అందించాడు. కాఫీ తీసుకొని ఆమె భర్తని చూస్తూ ఊరుకొంది. ఈ వ్యక్తిని ఏం అనుకోవాలి. రాత్రి తను చచ్చిందో, బ్రతికే ఉందో అని అయినా చూడకుండా తన దోవన తను భోజనం చేసి నిమ్మకి నీరెత్తినట్టు పడుకున్నారా ? ఇప్పుడేమో సేవ చేస్తున్నారు. రాత్రి అంతా "ఈ రాక్షసుని" పై ఆమె హృదయంలో గూడు కట్టుకొని పేరుకుపోయిన అసహ్యం అంతా నెమ్మదిగా కరిగిపోవడం ప్రారంభించింది, కాఫీ కడుపులో పడగానే. ఎలాగైనా, కాఫీ బ్రహ్మాండంగా చేస్తాడు శేఖర్.

రాత్రి బయట పడవేసిన వెండి పతకం టేబిల్ మీద కనిపించగానే, నీరసంగా అంది రాణి "మీరు అనవసరంగా పంతులయ్య అయిపోయారుగాని, రాజకీయాల్లో దిగితే బాగుపడేవారు."

"ఏమో ?"

"ఏంలేదు. చెప్పే దొకటీ, చేసే దొకటి, వాళ్లకే అబ్బి వచ్చాయి."

"అయితే మీ నాన్న దగ్గర ఇంకా ఎంత డబ్బు ఉందేం ? .... మరేం లేదూ, వచ్చే ఎన్నికలలో నిలుచుందామని."

"చాల్లెండి. సిగ్గు లేకపోతే సరి. రాత్రి అంత ధాటిగా లెక్చరు దంచేసిన ముఖాన్కి సిగ్గయినా లేక పోయింది, అలా అనడాన్కి" ముచ్చటగా కోప్పడింది రాణి.

"అమ్మాయ్, నే నొకటి అంటా. వింటావా ? ఒక మనిషి రెండు పూటలా భోజనం చేస్తూ, రెండుసార్లు కాఫీ తిని, టిఫిన్ తాగి బతకడాన్కి నెలకి ఎంత అవుతుందంటావ్ ?"

ఇంగ్లీషు లెక్చరర్‌కి లెక్కల్లో అభిమానం ఎప్పటినుండో అనుకొని "ఏభై" అంది. ❀

"నీ సొమ్మేం పోయింది ? ఇంకో పాతిక వేసుకో" ఉదారంగా అన్నాడాయన.

"ఏభై కంటే ఒక్క నయాపైసా ఎక్కువ అవదు" ఖచ్చితంగా చెప్పేసిందామె.

"సరే ఒప్పుకున్నాం. నెలకి ఏభై చొప్పున బ్రతికినంత కాలం నిన్ను పోషించడానికి నా కెంత ఖర్చు అవుతోందో తెలుసా ? ముష్టి మూడు వేలు కట్నం ఇచ్చావని ...."

కోపంతో శరీరం వణికిపోతోంటే, పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడం కోసం విఫల ప్రయత్నం చేస్తూ, కుమిలిపోతున్న రాణిని చూడగానే గుండె ఝల్లుమంది శేఖరానికి. అక్కడింక ఉండలేక బయటికి పోయాడు.

మొదటి గాయంనుండి కోలుకుంటున్న లేడికి గాయంపై గాయం కలిగింది.... టేబిల్ మీది వెండి పళ్ళెం, హేంగర్‌కి వేలాడుతున్న తన "అదృష్టచిహ్నం" ఎక్కిరించి నవ్వాయి. ఛీ. ఏం బ్రతుకు తనది ? తిండికి గతిలేక తను ఈయన్ని పెళ్ళి చేసుకుందా ? భార్య అంటే ఇంత నీచంగా ఆలోచించే భర్తలు కూడా ఉంటారా ? కట్నం పుచ్చుకొనేవాణ్ణి చేసుకోనని ప్రతిజ్ఞ చేసిందే తను. ఆ ప్రతిజ్ఞ ఏమైంది ? ఆనాటి సభలో 500 మంది తనని చూచి ఘొల్లున నవ్వినట్లు అనిపించింది. ఇక లాభంలేదు......

* * *

నాలుగుసార్లు రాణి గది దగ్గరికి వచ్చి తలుపు తట్టినా ఎద్దాం అని సంశయించింది సుందరమ్మ. మొత్తానికి ఎలాగో ధైర్యం తెచ్చుకొని "అమ్మా రాణీ .... "అని కేక వేసింది. లోపలినుండి జవాబు లేదు. ఏమిటో రాణి పరిస్థితి అర్థం కావడం లేదు. అలిగి వచ్చిఉంటుంది. అది తెలుస్తూనే ఉంది. అయితే కారణం ఆమెకు అంతుపట్టలేదు. రాణిని అడుగుదామంటే భయం. రెండు రోజుల నుండి చూస్తూనే ఉంది ఆమె. "అబ్బబ్బ—చంపుకు తింటున్నారే మీరంతా. నన్ను ప్రశాంతంగా చావనీయండి" అని అందర్నీ కసిరి కొడ్తూనే ఉంది రాణి. అంతే. ఇంకెవ్వరూ ఆమెని పలుకరించడానికి కూడా సాహసించలేదు.

"అమ్మాయ్ రాణి, కాఫీ తెచ్చానమ్మా ...." కొంచెం గట్టిగా పిలిచిందీసారి, సుందరమ్మ.

కాఫీ అన్నమాట చెవిన పడగానే దేవి అనుగ్రహించి తలుపు తీసింది.

"అదేమిటే అలాగున్నావ్ ? నీ నగలన్నీ ఏవి ?"

"అబ్బా, ఈ సినిమా—పాట లేమిటమ్మా ! ప్రాణాలు తీసేస్తున్నాయి."

"ఇవాళ సీత పెళ్ళి కదే. అందుకు ...."

"దాని పెళ్ళి అయితే ఇలా ఊళ్ళో వాళ్ళందర్నీ సినిమా—పాటలు వేసి చంపమని ఉందేమిటి ?"

చావు తప్ప ఇంకోమాట రాదేం ఈ పిల్లకి ? ఇక ఇక్కడ అట్టేసేపు ఉంటే, ఇలాగే వాగుతుంది అనుకొని వెనుదిరిగింది సుందరమ్మ.

"నాన్నని ఒకసారి ఇలా రమ్మనవే అమ్మా" అని కేకవేసింది రాణి.

జడ్జీముందు నిల్చున్న నిందితుడులా రాణి ముందు నిలుచున్నాడాయన.

"నా పెళ్ళికి ఎంత అప్పు చేశావు నాన్నా ?"

"ఇప్పు డవన్నీ ఎందుకు .... మూడున్నర వేలు ఉంటుంది"

"ఇవి అమ్మి, కొంత అయినా అప్పు తీర్చెయ్ నాన్నా."

రుమాలులో మూటగట్టిన నగల్ని అందుకొంటూ అలాగే ఉండిపోయా డాయన.

"వెళ్ళు నాన్నా."

ఆ ఆజ్ఞని త్రినేత్రుడైనా పాలించవలసిందే.

ఆయన వెళ్ళాడు, వచ్చాడు. నగలమూట తిరిగి రాణికి ఇచ్చేశాడు.

"ఏం నాన్నా, వెళ్ళలేదూ" ఆశ్చర్యపోయింది రాణి.

"వెళ్ళాను."

"మరి ?"

"మనం తీర్చవలసిన అప్పు అల్లుడుగారు తీర్చేశారట; పెళ్ళి అయిన మర్నాడే."

"ఏమిటి...ఏమిటి నాన్నా నువ్వు అంటున్నది ?"

"అవునమ్మా, తనఖా పత్రం తనకు ముట్టినట్లు అల్లుడుగారు పెట్టిన సంతకం కూడా చూశాను."

మంచంమీద వాలిపోయి, వెక్కివెక్కి ఏడ్చింది రాణి. ఎవరూ ఓదార్చడానికైనా ప్రయత్నించక పోవడంతో, లేచి పంటిబిగువున కూలబడింది. అమ్మ తనవైపు చూసి చూడకుండానే తన పనేదో చేసుకుంటూ ఉంది. ఇక ఉండలేక "ఆయన మాట మాత్రంగానైనా ఈ సంగతి చెప్పిఉంటే ఇంత దూరం వచ్చేదికాదు" ఎటో చూస్తూ ఎవరితోనో చెబుతున్నట్లు చెప్పింది.

భార్య : ఏమండీ! పండుగకి నాకో చిన్న వాచీ కొంటారా?

భర్త : చిన్నవాచీ యేంఖర్మ బిగ్‌బెన్ గడియారమే కొంటా.

కె. రంగారావు

అయినా అమ్మ మాటాడలేదు. అందరూ తనమీద పగ తీర్చుకొంటున్నారా ? సరే. రివ్వున లేచి తన గదికి వెళ్ళి భడేల్‌మని తలుపులు బిగించేసి తను చేయగలిగిన పని, ఏడుపు...చేసేసింది రాణి. అమ్మ మాటాడుటలేదు. నాన్న సరేసరి. తను ఇక్కడెందుకు ఇక ? ఏ ముఖం పెట్టుకుని అక్కడికి వెళ్తుంది తను ? ఆయనే ఒకసారి ఇక్కడికి రాకూడదూ? హే భగవాన్, రక్షించు.

సాయంకాలం 4 అయింది. అయినా భోజనానికి ఆహ్వానం లేదు. ఆకలితో కడుపు మండిపోతోంది. కోపంతో వళ్ళు మండుతోంది. అంతా నిశ్శబ్దం. ఇంట్లో ఎవరూ లేరా ? ఏమో తెలియదు. తలుపు తీసి చూద్దామా అనుకొంది.గాని అవమానం అడ్డువచ్చింది. ఏమైనా సరే అమ్మ వచ్చి బ్రతిమాలితే గాని తలుపు తీయకూడదు. అంతే.

హఠాత్తుగా ఇంట్లో ఏదో కోలాహలం వినిపించింది. ఆ సందడి అంత హఠాత్తుగానే సద్దుమణిగి పోయింది. ఏమిటి ? ఏం జరిగింది ? అమ్మ వచ్చి తలుపు తట్టినా బాగుండును.... కనీసం పిలిచినా .... అందరూ కలిసి తనని ఏడిపిస్తున్నారు అన్నమాట సరే.

తలుపు తట్టిన శబ్దం వినిపించింది. ఇంత వరకూ ఉన్న ఆత్రుత పోయింది. ఏమైనా సరే తలుపు తీయకూడదు.

మళ్ళీ శబ్దం. మళ్ళీ మళ్ళీ ....

"అబ్బబ్బ .... చంపుకుతిం ...." తలుపుతీసి అమ్మపై విరుచుకు పడబోయిన రాణి ఎదురుగా ఉన్న శాల్తీని చూచి నిర్ఘాంత పడిపోయింది.

"మీరా ...." అంది ఆఖరికి ఎలాగో గొంతుక పెగల్చుకుని.

"కాకూడదా ?" కొంటెగా ప్రశ్నించాడు శేఖర్, తన వెనుకనే తలుపు మూసేస్తూ.

"మీ .... మీ .... మీరు .... మీరు ...."

ఒకవైపు ఆనందం, ఇంకోవైపు దుఃఖం, మరొకవైపు కోపం, ఆటు తర్వాత పశ్చాత్తాపం—ఇలాంటివన్నీ ఒక్కసారిగా రాణి చిన్న హృదయంలో చోటు చేసుకోలేక తన్నుకులాడిపోగా, భోరున ఏడవబోయి, అందుకు అభిమానం అడ్డురాగా తనను తాను సంభాళించుకోలేక భాగాల్ని కూలిపోయింది రాణి, శేఖర్ పాదాల దగ్గర కాదు, అతని విశాల వక్షంపై.

"మీ రెంత కఠినులండీ. ఈ రెండు రోజులు నేనెంత యాతన అనుభవించానో మీ కేం తెలుసు? మాటమాత్రంగా మీ రీ విషయం చెప్పిఉంటే ...."

ఇంకా ఎన్నెన్నో విషయాలు తన శేఖర్‌కి చెప్పుకుని ఊరట చెందాలని అనుకొంది కాని ఒక్క మాట కూడ ఆమె నోటినుండి ఊడిపడలేదు.

ఆమె తల నిమురుతూ అన్నాడు శేఖర్:

"నాన్నగార్కి కట్నం అంటే పట్టింపు. నాన్నగార్ని కాదనలేక, నన్ను నేనే కాదనుకోలేక, ఆయనకు తెలియకుండా అమ్మన ఇచ్చినడబ్బుతో మీ నాన్న చేసిన అప్పు తీర్చేశాను. కొడుకెంతో బుద్ధిమంతుడని మా నాన్న మురిసిపోతూ ఉంటారు. ఆయననే ఇంత మోసం తలపెట్టాను. శేఖర్ కంఠం రుద్ధం అయిపోయింది. ఆమె చేతులు శేఖర్ వీపుపై బలంగా బిగుసుకుపోయాయి.

మూడు రోజుల "బాకీ" తీరిపోగానే ఆమె చుబుకాన్ని చూపుడువేలితో పైకెత్తి "చూడు బంగారంలాంటి షర్ట్ ఎలా పాడు చేశావో" అన్నాడు.

ఆమె చూచింది. నిజమే కాటుక, కన్నీళ్ళ మరకలతో షర్ట్ అసహ్యంగా ఉంది.

"అంతే కావాలి. నన్నేడిపించినందుకు మీకు శిక్ష." బుంగమూతిపెట్టి దూరంగా జరిగి నిల్చుంది.

"అయితే మీ నాన్న నడిగి ఓ రెండువందల యాభై పట్టుకురా. ఏభై నీతిండి ఖర్చుకి, ఆ రెండువందలు పెట్టి ఓ అరడజను షర్ట్లు కుట్టించుకుంటా. ఇలా రోజు కొకటి నువ్వు పాడు చేసేస్తూ ఉంటే నే నెక్కడినుండి తెచ్చుకొనేది ?"

కోపంతో వణికిపోలేదు రాణి ఈసారి. కరుకుగా చూచి, చురుకుగా నవ్వేసింది, మీ విషయం తెలిసిపోయిందిలే అన్నట్టు.

ఆమె నవ్వడం చూచి "నువ్వు ఏడుస్తేనే ఇంచక్కా ఉంటావుసుమీ" అన్నాడు.

"అల్లాగేం ?" ముక్కు మూపై ఏ వంకర్లు తిప్పుకుంటూ అంది ఆమె.

ఆమె దగ్గరగా వెళ్ళి, "నీ ముక్కు చూస్తోంటే ......"

పెళ్ళిపందిరి నుండి ఈసారి హాయిగా వినిపించింది పాట "నిన్ను విడిచి నేను లేనులే...." ★

(చిట్కాలు పంపిన శ్రీ అన్నదకి ఇది అంకితం)

# బంగారు పంజరం

27-వ పేజీ తరువాయి

"రెండు నెలల్నించి ఉత్తరం రాలేదు. ఆరు నెలలై ం దిక్కడికి రాక. కుసుమ ఎంతో దుఃఖంతో కుమిలిపోయేది. వారం క్రితం మీ నాన్నగా రెళ్లారు మాచర్లకు. నమ్మవుగానీ, సుబ్బారావెంతో బుద్ధిమంతుడు, మంచివాడు కదా .... ఎంతో మారిపోయాడుట. పేకాడటం నేర్చుకుని, అందులోనూ డబ్బుతో; హైదరాబాదుకు మెషినుల పనిమీదవెళ్లినప్పుడల్లా తాగి వస్తాడట. ఈ దుర్వ్యసనా లెలా అలవాటయ్యాయో తెలీదు. నాన్నగా రెళ్లినప్పుడింట్లో లేడట. తల్లి చెప్పి చెప్పి ఏడ్చిందట. వాళ్లన్న నేర్పించా డంటారు మీ నాన్న ...."

"ఇంతకూ నాన్న అతన్ని కలుసుకోలేదా ?"

"రెండురోజు లున్నారు. కలుసుకుని మాట్లాడా లనేగా వెడతా ? అలా తెమల్చుకోకండా రారుగా ? తీరా మూడోరోజున కలిశారట. ఎంతో ఖచ్చితంగా చెప్పాడట: "కుసుమ నిక తేలేను. నన్ను మర్చిపొమ్మనండి. నేని బాధలు పడలేక ఈ దురలవాట్లు నేర్చుకున్నాను. మా అమ్మ, నాన్న, అన్నయ్యని వదలరు; మా అమ్మా, నాన్నని ఈ వయసులో వదిలేంత కఠిన హృదయం నాకు లేదు. ఎవరో ఒకరు శాశ్వతంగా కన్ను మూస్తేగాని ఈ సమస్య తెగదు. కానీ చావు కోరేటంత మూర్ఖుడ్ని కాను. కుసుమ కన్యాయం చేస్తున్నాననే బాధను పోగొట్టుకునేందుకే ఈ వ్యసనాలకు లోనయ్యాను. ఆ ఆటలో బడితే అదే లోకం .... అలాగైనా కొంత మర్చిపోగలను. కన్న కొడుకు ముద్దు ముచ్చటలు తీర్చి చూచుకునే భాగ్యం లేదు" అంటూ ఎంతో నిరాశతో విరాగిలా మాట్లాడాడట. నాన్న ఎన్నో మార్గాలు చెప్పారు. నువ్వు వచ్చేసెయ్యి; డబ్బు పంపుతూ ఉందాము. వారి సుఖం కోసం నీ భార్యా బిడ్డల్ని త్యజించటం న్యాయంకాదు నాయనా అంటూ ఎంతో చెప్పారట. చూద్దాం—ఆలోచిద్దాం—అంటాడుట.నాన్నవచ్చేశారు. కుసుమతో ఏమని చెబుతారు. నాన్న రాకకోసం వేయి కళ్లతో ఎదురు చూస్తోంది పిల్ల. వచ్చి రాకముందే "ఏమన్నారు ? ఎక్కడున్నారు ?" అంటూ వెనకాతలబడి అడుగుతోంది. నాన్న అంతా చెప్పకపోయినా, 'నీవు వెళ్లటం మంచిదికాదు. అక్కడి వాతావరణం మారలే'దంటూ చెప్పారు. కానీ సుబ్బారా విచ్చిన ఉత్తరం ఇవ్వక తప్పింది కాదు. ధా న్నస లివ్వకూడదనే అనుకున్నారు కానీ, 'ఉత్తరం ఇచ్చారా నాన్నా ....' అంటూ వంకీకి తగిలించిన జాబులను తడిమి తీసుకుంది. గట్టి పిల్లే నమ్మా. ఆ ఉత్తరంలో ఏంరాశాడో తల్లీ — రెండ్రోజుల వరకు మనిషిలా లేదు. ఏదో ఆలోచిస్తూ అలా కూచుని ఉండిపోయేది. నిన్న ఏం చేసిం దనుకున్నావూ ? ఇలాగే అందరం పడుకుని ఉన్నాము. ఆ గదిలో దూలం మీదికి తాడు విసరటం, అది క్రింద పడటం నూనిడిచెట్టు మీద కూచుని నేస్తాలతో ఆడుతున్న బాబిగాడు చూచాడు. అక్కయ్యకు చేతకావటంలేటట్లే ఉంది, ఉయ్యాల వేస్తోందేమోనని 'నే నేస్తానే' అంటూ చుట్టూ తిరిగొచ్చాడు. ఎందుకోనమ్మా మంచి నిద్దట్లో గబుక్కున మెళకువ వచ్చింది. వాడ్ని చూచి 'పడుకోక ఎండలో ఏం ఆటలురా వెధవా' అన్నాను. వాడేమో అక్కయ్య ఇలా చేస్తోంటే వచ్చా నన్నాడు. నా గుండెల్లో రాయి బడింది. గబగబ వెళ్లి తలుపు బాదాను. తెరవందే ! మీ నాన్న లేచొచ్చారు. "తల్లీ ! ముసలివాళ్లం—మమ్మల్ని దయతల్చి తియ్యి" అంటూ మొత్తుకుంటే తిసిందమ్మా .... ఏముంది, ఒక కొసను ఉచ్చు వేసుంది. దాన్ని చూడగానే నా మతిపోయింది. "ఇదేం పని తల్లీ" అంటే మాట్లాడదు. ఏడుస్తుంది .... దాని కర్మ .... దాని జీవితమే నాశనమైంది .... ప్స్."

నిర్మల కొయ్యబారిపోయింది. ఇదేమిటి ? ఎక్కడికి వెళ్లినా ఈ ముళ్లు ! కుసుమ ఇంతటి సాహసం చేస్తుం దనుకోలేదు. చదవమన్నప్పుడు చదవకుండా, నళినితో కబుర్లు చెప్పుకుంటూ, పని చేస్తే అరిగిపోతానేమో అని సుకుమారిలా కాలం గడిపే కుసుమేనా ఇంతటి పని తెగించి చేసింది?

వెనుకటికి ఒక ఇటాలియను శాస్త్రజ్ఞునికొకనికి మతిభ్రమణం కలిగింది. వైద్యవేత్తలు కొందరు చదరంగం ఆడటం మేలన్నారు. ఒక మంచి ఆటగాణ్ణి పిల్చి యీ శాస్త్రవేత్తతో 'ఛెస్' ఆడ నియమించారు. ఆశ్చర్యకరంగా ఆ శాస్త్రకారుడి పిచ్చి కుదిరింది గాని చదరంగం ప్రవీణునికి మతిపోయింది.

ఆర్. రావు (తెనాలి)

రెండు గ్లాసుల చల్లటి నీళ్లు గొంతులో పోసుకున్నాక గాని పొడారిన గొంతుక తడి కాలేదు. తల్లివైపే పదోలా చూస్తూ కూచుంది.

"కాపలా కాస్తున్నామంటే నమ్ము ..... నీవు ఉన్నంతకాలం దానికి నూరిపొయ్యి—ఇలాంటిపని చేయకని. నీ మాట వింటుందేమో ! ఏం రాశాడో కాని పిల్ల పూర్తిగా మారిపోయింది. నా కేం చేసేందుకు చేతులాడందే—దాన్ని చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది."

కమలమ్మ కన్నీళ్లు తుడుచుకుంది. నిర్మలకు కన్నీళ్లే లేనట్లుంది. ఆమెకు అంత ఓపికలేదు.

రెండోరోజు మధ్యాహ్నం చెల్లిదగ్గర కెళ్లి కూచుంది. మరళి, లత ఒకే మంచంమీద పడుకున్నారు. లత చెయ్యి తమ్ముడిని పట్టుకున్నట్లు వీపుమీదుగా ఉంది. నిర్మలకు ఆ దృశ్యం ఎంతో ముచ్చటగా ఉంది. కుసుమ పడుకునే ఉంది.

"కుసుమా—నీవు చేయబోయిన పాడు పనిని గూర్చి అమ్మ చెప్పింది. ఎందు కలా చేశావు ?" అంది మందలింపుగా.

"బ్రతికి బాగుపడేది లేనప్పు డింకేం చేయ నక్కాయ్! నా కెందుకో విరక్తిపుట్టింది. శాశ్వతంగా సెలవు తీసుకుందా మనుకున్నా నంతే" అంది గాద్గదికంగా.

"సుబ్బారావు ఉత్తరం రాశాడటనే ... ఏముం దేమి టందులో."

"ఉత్తరమే ఇస్తా. చదువుకో" అంటూ పెట్టె తెరచి, పైనే తెరచిఉన్న కాగితా న్నందించింది.

"నిర్మల తీసుకుంది కాని, దానిమీదికి దృష్టి సారించ సంకోచిస్తోంది. కుసుమ గ్రహించింది. "ఫరవాలేదు చదువు" అంది.

నిర్మల తనలో తాను చదువుకుంటోంది "..... అన్నయ్యతో దెబ్బలాడి, తరిమేసి తత్ఫలితంగా అమ్మకు కల్గే బాధను చూడలేను కుసుమా. ఆ వృద్ధాప్యంలో వారి కింతటి దుఃఖాన్ని కల్గించటం ఇష్టంలేదు.

"నా ప్రాణంతో సమానమైన నీ విక్కడ లేకుండా బ్రతకలేను. నిన్ను తీసుకొస్తే నీవు పడే బాధలను చూడలేను. ఈ భిన్నమైన కోర్కెల మధ్య నలిగిపోతున్నాను.

. . . . ఎదురుచూస్తున్న సుముహూర్తం దానుదాను దూరమవుతున్నట్లుంది ..... విముక్తి ఎప్పుడో.

నిన్ను, నన్ను శాశ్వతంగా దూరంచేసి నా అండ జేరి హాయిగా జీవించాలన్న కోర్కె ఫలించాలని అన్నయ్య (నా అసలు అన్నయ్యే కాడు) ఎంతో పెద్ద పెద్ద పన్నాగాలే వేస్తున్నాడు; పన్నటంలో నీతి నియమాలను పూర్తిగా విస్మరించాడు. కాని వాటిని నమ్మలేదు. నమ్మను కూడ. హృదయ స్పందనతో జీవితమే దుస్సరమై పోతోంది.

"నేను నీ దగ్గరకు రావటం మానేస్తేగాని నీ గురించి అన్నయ్య మౌనం వహించడు. నీ జీవితంలో అలాంటి కళంకా న్నాపాదించే అవకాశం అన్నయ్యకు కలగకూడదనే, నీ దగ్గరకు రావటం మానేశాను.

నీవు లేకుండా ఈ ఒంటరి జీవితం ఎన్నాళ్లో— అని అనుకుంటే ఎంతో భయంతో హృదయం విలవిల్లాడిపోతుంది.

మామయ్య చెప్పి ఉంటారు. ఇంటికి వెళ్తే నీవు జ్ఞాపకాని కొస్తావు. అందుకై ఆఫీసునుంచి అక్కడక్కడే ఉంటూ, దుర్వ్యసనాల కలవాటయ్యాను కుసుమా !—అది కాలక్షేపంగానూ, కాస్త మనఃక్లేశాన్ని పోగొట్టే సాధనంగానూ ఉంది.

కానీ .... కుసుమా .... పెరుగుట విరుగుట కొరకే .... అంటారు చూడు. అలా అన్నయ్యకు దుర్దినాలు మూడుతున్నట్లుగా నాలో ఎక్కడో ఒక కాంతి కిరణం పదేపదే హెచ్చరిస్తోంది. నీతి నియమాలు లేకుండ గజపోకిరిలా తిరుగుతూ పచ్చని సంసారాలను నాశనంచేస్తూ తలిదండ్రుల హృదయంలో సర్వదా కారుచిచ్చులా మండిపోతున్నాడు. వాళ్లకు శాంతి లేదు. తమ్ముడి జీవితాన్ని నాశనం చేశాడు. హద్దుమీరి ప్రవర్తిస్తున్నాడు .... అతని దినాలు దగ్గర కొస్తున్నాయి.

"దాహంగా ఉంది కుసుమా ! బండరాళ్లను పగులగొట్టేగాని అడుగునున్న నీరు లభించదు. మందు సిద్ధంగా ఉంది. హానిచేయని ఆ మందున్న

చూచి బండ గజగజ వణికిపోవటంలేదు .... ఒక్క అగ్గిపుల్ల గీయాలి .... అంతే .... ఆ అగ్గిపుల్ల గీసేంత ధైర్యం కూడగట్టుకోవాలి .... గీసి నిప్పంటిస్తే నాకు కూడ హాని సంభవించవచ్చు .... అందుకే ఈ సందేహించడం .... అందుకే తారట్లాడుతూ వెనుదీయటం .... అందుకే ఈ ఆలస్యం.

కుసుమ ! ఒకటి మాత్రం నిజం. నా కింకా హృదయం ఉంది. ప్రేమ ఉంది.... అందుకే నీవు ఎప్పుడూ జ్ఞాపకం వస్తావు.

మురళిని, నిన్ను చూడాలని ఉంది. ఎన్నాళ్లకో... ఎన్ని మాసాలకో .... ఎన్ని సంవత్సరాలకో...."

మిగతాది నిర్మల చదవలేదు. దీర్ఘాలోచనలో మునిగిపోయింది. ఉత్తరం మడిచి చెల్లి కిచ్చింది.

"అలాంటి చీడపురుగుల్ని సంఘం ఎందుకు త్రోసిపారెయ్యదో" అంది కుసుమ.

"కుసుమా .... అది నిజంగా చీడపురుగు కాదు. మనలాంటి మానవుడే. కాని తల్లి దండ్రులు కూడా ఉన్న చీడపురుగు. అందుకే సంఘం ఏం చేయ లేదు. ముల్లు—అరటాకులా అతను, సంఘం ఉన్నారు మరి."

"బాగా చెప్పావక్కా. అందుకేగా మేమంతా అత నికి భయపడేది."

"ఇంత అఘాయిత్యాని కొడిగట్టేటంత విశేషం ఏముంద నిందులో ?" నిర్మల ఉత్తరంకేసి చూస్తూ అంది.

"ఇలా ఇంతవరకు వ్రాయలేదు. ఏవేవో కబుర్లు వ్రాస్తూ, ఇంకొన్ని రోజులే నని, ఓపిక పట్ట మని, మా ఇద్దరి ఆరోగ్యం విషయంలో జాగ్ర త్తగా ఉండమని, తనమీద బెంగపెట్టుకోవద్దని, మంచిరోజులు రాకపోవని .... ఇలా వ్రాసేవారు. నెలకు తప్పకుండా రెండుత్తరాలు రాసేవారు. రెండు నెల్ల నుంచి రాయటం మానేశారు. ఇక్కడికి రాక ఆరు మాసాలైపోయిందా ! అందరూ ఏమేమో అనుకుంటున్నారు. నన్నేదో వారంతా సాకి, 'సింహా సనంమీద కూచోబెడుతున్నట్లుగా ఉంది. అమ్మకు, నాన్నకు లేని కష్టం వాళ్ల కెందుకో .... అసలే ఇలాగైందని కుమిలిపోతుంటే వీళ్ల మాటలు శూలాలై గ్రుచ్చుకుంటున్నాయి. అమ్మదగ్గర ఎవరేం మాట్లాడరు. ఒంటరిగా నన్ను చూచారూ .... అయిందన్నమాటే. ఎంత బాగా కల్పించి అడు గుతా రనుకున్నా వక్కాయ్. నా కిదంతా భరింప రానిదిగా అయింది. అమ్మ, నాన్న చూస్తే నీ విష యంలోనూ, నన్ను గూర్చి చింతించని రోజే లేదు. వారి ఉత్తరాన్ని బట్టి చూస్తే నా జీవితంలో తిరిగి వారితో కాపురం చేసే శుభసమయం లేనట్లే

ఇదీ వరస—12

సుందర్



# బంగారు పంజరం

తోచింది. ఆఖరున చూచాయగా 'ఎన్ని సంవత్స రాలకో' అని రాశారు. ఇలాంటి ధోరణే ఇంత కాలం లేదు. వారి కెంత విరక్తి పుట్టుండాలి ఇలా వ్రాసేందుకు .... పనివాళ్ళంతా ఎంతో గౌర విస్తారు. మెకానిక్కులకు తనంటే ఎంతో ఇష్టం, గౌరవం కూడ. ఇంజినీర్ల సంగతి చెప్పక్కర్లేదు. తన క్రిందివారికి తనంటే ఎంతో భయం. మాట ఖచ్చితం మనిషి, అన్యాయాన్ని సహించనేలేడంటూ ఉంటారు .... కానీ అన్న, అమ్మదగ్గర వారి అశక్తత చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఇదంతా పెద్ద మాయాజాలంలా, కొరకరాని కొయ్యగా అనిపించింది. భర్త మంచివాడు కాకుండా ఆడపిల్ల పుట్టింట్లో ఉంటే అది వేరు; ప్రాణప్రదంగా చూచుకునే భర్త, సత్ప్రవర్తనుడు—తన నేలుకునే స్థితిలో లేకుండా దూరంగా ఉంటే ఒంటరిగా పుట్టింట్లో ఉండటంలో ఏ మర్థముంది చెప్పు. నాకు తెలుసు ఇది తెగే సమస్య కాదు. ఆ క్షణంలో చనిపోవాలనే కోర్కె రావటం తడవు ప్రయత్నం చేశా .... కానీ !"

నిర్మల మౌనంగా వింటోంది. కుసుమ ఇంకా చిన్న దనుకుంటోంది. జీవితంమీద విరక్తి పుట్టే వయస్సు వచ్చేసిందా ? అంతా గమ్మత్తుగా ఉంది. అప్రయత్నంగా పెదిమలు చిరునవ్వుతో మెలి తిరిగినై.

కుసుమ అక్కయ్య వైపు వింతగా చూస్తోంది. ఆ చిరునవ్వు పెదాలమీదే ఉంది. కళ్ళల్లో నీళ్ళు పొరలుగా వస్తుంటే "కుసుమా .... ఆ పని నేను చేసుంటే?"

"నువ్వా!" అంది కుసుమ గబుక్కున. నోరు కదిలింది కాని మాటలు స్పష్టంగా ఉచ్చరించ లేకపోయింది. కళ్ళు పెద్దవిగా చేసి "నువ్వా !" అంది రెండోమారు.

"ఔను. నేనే" అంది నిర్మల మామూలు ధోరణిలోనే.

"అమ్మో—ఒద్దక్కాయ్ .... నువ్వే .... బాబోయ్ .... అనుకుంటేనే భయం వేస్తుంది..."

"ప్రశ్నకు జవాబివ్వలేదేం" అంది నిర్మల. కన్నార్పకుండా అక్కవైపు చూచింది. ఆ ప్రశ్న ఏదో చటుక్కున గుర్తొచ్చింది. గుండె ఝల్లుమంది. "అలాంటి పనులు తలంచుకోనే కూడదు .... అమ్మో, మేమంతా ఉండగా, అమ్మ నాన్న, అక్కయ్యలు, తమ్ముళ్ళు, మీవాళ్ళు ...., ముఖ్యంగా నేను, లత—అందరం ఎంతగా విలపించేవాళ్ళం. మేమంతా ఏమయ్యేవాళ్ళమో ఆలోచించేనా అక్కాయ్ ......" జలజల కన్నీళ్ళు రాలుస్తోంది.

నిర్మల చిరునవ్వు అలాగే ఉంది. కళ్ళలో నీళ్ళు కారిపోతున్నాయి. కుసుమ ఇంకా చిన్నదే. వికసించని అపరిపక్వ హృదయం ఆమెది. ఎంత అమాయకంగా మాట్లాడుతోంది. వ్యధనంతా మాటలుగా మార్చి ఎలా మాట్లాడుతోందో ! నిర్మల అమాంతంగా చెల్లెల్ని కావిలించుకుంది. కొన్ని క్షణాలు గడిచాక కుసుమ భుజాలమీద చేతులు వేసి దూరంగా పట్టుకుని ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ అంది:

"అంత పని చెయ్యాలనుకున్నావే ! పిచ్చితల్లీ—నమ్మకలేంచేసి పోదామనుకున్నావు ! ఆలోచించావా? అసలే మీ బావగార్ని గూర్చిన మనఃక్షోభతో నే నెంతో కృంగిపోతుంటే నన్నింకా పాతాళంలో కణగద్రొక్కాలనుకున్నావా ? నీ బిడ్డకు తల్లి లేకుండా పోవాలని చూశావా ! అమ్మ, నాన్న హృదయాలను రంపపుకోత కవ్వగించాలని కోరావా ? నీ భర్తకు తీరని దుఃఖం కల్గించి, జీవించినంత పర్యంతం తనే దానికి కారకుడైనట్లుగా తలపోసి కృంగిపోవాలని ఆశించావా ? నాకు మాత్రం ఈ కోర్కె గల్గలే దనుకుంటున్నావా కుసుమా ? చచ్చి సాధించేదేముంది చెప్పమ్మా ! చనిపోయినవాళ్ళ సంగతటుంచు; బ్రతికున్నవారి దుఃఖాన్ని నూరంతలు చేసి, వారికి బ్రతికుండగా ఇవ్వని సుఖం చచ్చిపోయాక ఏం ఇవ్వగలం .... మన కష్టాలకు, ఆవేదన కంతు లేనట్లే ఉంది. అందుకు మనం దిగజారి పోవాలా చెప్పు ? వాటిని ధైర్యంతో ఎదుర్కొని సహింపగల్గేంతటి మనో నిబ్బరం సంపాదించాలి. మన దృక్పథంలో, నడవడిలో మార్పు రావాలి. లోకానికేం .... ఎన్నైనా అంటుంది. మనలో తప్పు లేనంతవరకు ఆ భావన మన కొక కవచంలా పనిచేస్తుంది. ఎప్పుడైతే తప్పటడుగు వేశామో, 'లోకపు తీరుకే' భయపడవలసివస్తుంది. ఆ కవచంలో చీలిక లేర్పడతాయి. అప్పుడు నిజంగానే భయపడాలి.

"నీలాంటివారికి .... అంటే మనలాటివారికి చేతి నిండా పని, నోటినిండా మాటలుండాలి. అప్పుడే స్వవిషయాలను గూర్చి చింతించేందుకే సమయం ఉండదు. నీ కే ఆలంబనం అగుపించకుండా ఉంటే ఏదైనా సృష్టించుకోవాలి కాని, నిద్ర లేచింది మొదలు ఒకే ఆలోచనతో మనసు నెమ్మది పాడు చేసుకోకు .... నేనూ అనుభవిస్తున్నాను కుసుమా .... ఇవన్నీ చేస్తుంటే మీ బావగార్ని గూర్చి నీ చింత తగ్గుతుంది. మనసు బాగులేక కూచున్నానో .... ఇక ఆ రోజంతా నాలో నే నుండను. అనుభవంమీద చెబుతున్నానమ్మా .... అందుకే నాకు మాట యియ్యి, ఇలాంటి పని ఇకమీదట తలపెట్టనని."

నిర్మల చేయి చాచింది. కుసుమ తదేకంగా అక్కవైపు చూస్తూ కొన్ని క్షణాలనంతరం అక్క చేతిలో చేయివేసి "నా కిప్పుడు ధైర్యంగా ఉందక్కాయ్. అలాటి పని చేయను. నీ మాటలు నిజంగా నా కెంతో ఊరట గల్గించాయి. మనిద్దరి కెక్కువ భేదం లేదనుకుంటా నక్కాయ్. ఇద్దరికీ భర్తలున్నా, కావలసిన సుఖంలేదు ...."

ఎవరి ఆలోచనల్లో వారు మునిగిపోయారు. సాయంత్రమైంది. కిటికీలోంచి చల్లగాలి వీస్తూ ప్రాణానికి హాయి గొల్పింది. కొంతసేపటికి సూర్యుని కిరణాలు ఇనుప చువ్వల్లోంచి దూసుకుని వచ్చి వారి హృదయ జ్యోతులను వెలిగించినట్లుగా వారి మీద పడినై.

అప్పుడే ఆ గదిలోకి నిమ్మరసంతో వచ్చిన కనులమ్మ, వా రిద్దరి ముఖాల్లోని ప్రసన్నతను వింతగా చూస్తుండిపోయింది. (సశేషం)





కారి బరువుశరీరంతో ఇవతలికివచ్చి భవంతి వాకిట పెద్ద అరుగుమీద మెత్తని దిండుమీద ఆనుకుని కూర్చుని హేళగా రంగనాయకునివైపు పాక క్రీగంటిచూపు ప్రసరింపజేసి నెమ్మదిగా తాంబూల సేవ ప్రారంభించాడు. రంగనాయకు డతని సన్నిధికి పోయి చేతులు కట్టుకుని నిలబడి మిక్కిలి అడకువతో తన గోడు వెళ్లబోసుకున్నాడు. ధర్మకర్త పోక చెక్క కటుక్కుమని కొరికి క్షణకాలం నఖశిఖ పర్యంతము రంగనాయకుని శరీర సౌష్ఠవం పరీక్షించాడు:

'ఉత్సవ సమయాలలో అవసరమయినప్పుడు అర్ధరాత్రివేళ వరకు స్వామి కెదురుగా నిలిచి మల్ల విద్యా వినోదాలతో సేవించుకోవాలి! ఏమంటావు!'

'చిత్తం అలాగే! అవసరమయితే తెల్లవారు జాము వరకు కూడా సేవించగలను! అయితే ఆ కష్టం మాత్రం తమరు కొంచెం చిత్తగించాలి.'

'ప్రస్తుతానికి మాసానికి మూడు బంగారు చక్రాల కన్న వేతనం వీలుపడదు. ముమ్ముందు నీ శక్తి సామర్థ్యాలు పరిశీలించిన తరవాత అయిదారు చక్రాల వరకు ముట్టవచ్చును.'

రంగనాయకుడు ఏడెనిమిది చక్రా లాశించాడు. అదేమాట ఉట్టిపడుతున్న వినయంతో వినబడీ వినబడనట్టు నసిగాడు. దేవాలయ ధర్మాధికారి తిరిగి తాంబూలసేవ కొనసాగించాడు:

'సరె, ఇంతగా ప్రాధేయపడుతున్నావు కనక అయిదు చక్రా లేర్పాటు చేయిస్తున్నాను. ఇక ముందు మరి ఇంతకంటె ఆశించవద్దు! ఒక ఏడాది గడిచిన తరవాత నీ అదృష్టం బాగుంటే శ్రీమంతు లర్పించిన దేవమాన్య మేదయినా తటస్థపడగలదేమో! ఎవరు చెప్పగలరు!'

రంగనాయకునికా ప్రతి సమాధానంతో బాగా సంతృప్తి కలిగింది. ధర్మాధికారిని సగౌరవంగా వీడ్కొని వెనువెంటనే రామానుజ మఠంవైపు సాగిపోయాడు. అప్పటికి రెండు జాముల పొద్దు తిరిగింది. ఆచార్యుని సందర్శనాని కది తగిన తరుణం కాదు. ఆ శుభవార్త విన్నవించాలన్న తహతహతో ఇంచుమించుగా ఒక గడియసేపు నిరీక్షించాడు. రామానుజయతిని సందర్శించగానే సవినయంగా నమస్కరించి ఆనాటి వృత్తాంతం సంగ్రహంగా నివేదించాడు.

'తమ దయవల్లనే ఇంత త్వరగా నాకిది లభించింది. ఇన్నాళ్లనించి ఎన్నెన్నిసారులు తిరిగినా ఆయన నోట 'రేపురా! మాపురా!' అన్న సమాధానం తప్ప ఇంకొక మాటే వినబడలేదు. ఒకవేళ మీరెవ్వడయినా ఆయనతో ఈ విషయం ప్రస్తావించారేమో!....'

'లేదు! నాయనా! నే నామాటే తలపెట్ట లేదు. అయినా దీనిలో అంతటి విడ్డూరమేమి లేదు. ఆయన నీ విక్కడికి వచ్చి నాతో ప్రసంగించి ప్రసాదం స్వీకరించిన సంగతి కర్ణాకర్ణిగా వినిఉండవచ్చును. నీమీది అపూర్వాదరణ కది ఒక చిన్న కారణమయి ఉండవచ్చును. ఇంతకీ ఆ శ్రీరంగశాయి కటాక్షం నీమీద ప్రసరించింది. దీనికంతటికి అదే ప్రధాన కారణం! అంతే, నేను కేవలం నిమిత్తమాత్రుడనే!

# విశాల నేత్రాలు

23 వ పేజీ తరువాయి

రంగనాయకు డిక మారు పలకలేదు! సర్వము స్వామి సంకల్పమే అని చెప్పి మౌనముద్ర వహించడం ఆచార్యుని కొక పరిపాటి అని అత డంతకు మునుపే గ్రహించుకొన్నాడు. అకాలంలో వచ్చి నందుకు మన్నించవలసినదని వేడుకొని సెలవు తీసుకుని తిన్నగా తన భవంతివైపు సాగిపోయాడు. ఇంటిలో అడుగుపెట్టగానే అతని ముఖవైఖరి గమనించి తలపెట్టిన పని చక్కగా నెరవేరినదని హేమసుందరి గ్రహించడాని కెంతోసేపు పట్టలేదు. అంతలోనే ఆనాటి శుభవార్త రంగనాయకు

'హిల్' హోటల్లాంటి పెద్ద హోటల్ కి, కోటూ హేటూ వేసుకుని, రాత్రి పొద్దుపోయిం తరువాత వచ్చాడొకాయన. బయట ఉన్న స్టాండుమీద కోటునీ, హేటునీ తగిలించి లోపలికి వచ్చాడు. సర్వర్ 'మెనూ' (హోటల్లోని పదార్థాల లిస్టు) కార్డుని అందించాడు.

'కట్ లెట్' అన్నాడు కార్డు కిందుంచి వచ్చినతడు. "..లేదండీ!" అన్నాడు సర్వర్. "...బిరియానీ!" "...లేదండీ!" "...బిస్కెట్!" "...లేదండీ!" "బావుంది. మంచి హోటలే! అయితే నా కోటూ, హేటూ ఇలాపట్రా" అన్నాడాయన.

"లేవండీ!" అన్నాడు సర్వర్ తపీమని. సాగరాల (హైదరాబాదు)

డామె కెరిగించాడు. ఆ సంతోషంతో తలమునకలై వా రుభయులు సరస సల్లాపాలతో మధ్యాహ్నం భోజనం ముగించుకొని విశ్రమించారు.

ఆనాటినించి రంగనాయకుని మనస్సు బాగా కుదుటపడింది. 'ఇక రేపటిమాట ఏమో!' అన్న నిరంతర విపరీతాందోళన పూర్తిగా తొలగిపోయింది. రంగనాయకుడా మరునాడే ధర్మకర్త నింకొకసారి సందర్శించి అనుమతి అందుకొని శ్రీరంగేశుని సేవలో ప్రవేశించాడు. ఆనాటినించి ఉత్సవాలలో, ఊరేగింపులలో స్వామి సమక్షంలో నిలిచి అపూర్వ మల్ల బంధాలలో చిత్ర విచిత్రములయిన సాము గరిడీల విన్యాసాలతో పౌరుల ప్రశంస లందుకొన్నాడు. క్రమక్రమంగా అతని చాకచక్యం మల్ల ప్రముఖులకే కాక శ్రీరంగ ప్రముఖు లందరికి అపూర్వాశ్చర్యం కలిగించింది.

ధర్మాధికారి ఇచ్చిన భృతితో రంగనాయకుని జీవితయాత్ర అనుకున్నంత సుఖంగా కొనసాగలేదు. అప్పటి కతని దగ్గర నిలవఉన్న సొమ్మంతా అయిపోయింది. ఆ పరిస్థితిలో వేరొక ధనార్జన మార్గమేది స్ఫురించలేదు. మరి కొన్నాళ్లు గడిచినతరవాత తీరిక సమయాలలో నగర వీధులలో తన మల్లవిద్యా నైపుణితో కొంత సొమ్ము సంపాదించుకోవచ్చునన్న ఆలోచన లోలోపల మొలకెత్తింది. శ్రీరంగం చేరుకొన్న కొత్తలో అతనికా ఉపాయం స్ఫురించకపోలేదు. కాని విపరీతమయిన అభిజాత్యం పడగ పైకెత్తి బుస కొట్టింది. ఇటీవల కొన్నాళ్లనించి ఉత్సవాలలో స్వామి కెదురుగా నిలిచి సాము గరిడీ లారంభించిన పిమ్మట ఆనాటి అభిజాత్యం క్రమక్రమంగా సడిలిపోయింది. అపైన హేమసుందరి కూడా దానిలో అంతటి తలవంపేమి లేదని ప్రోత్సహించింది. 'పెద్ద పెద్ద విద్వాంసుల శాస్త్రాల పాండిత్యాలు పరిశీలించి మహారాజు అనేకవిధాల గౌరవించడం లేదా? అదేవిధంగా నా విద్య పరీక్షించి మెచ్చుకొని శ్రీరంగంలో సంపన్ను లెవ్వరయినా కానుక లిచ్చి ఆదరించవచ్చును. దీనిలో అగౌరవమేమి ఉన్నది?' అని తనలో తాను సమాధానపడ్డాడు.

ఆ మరునాటినించి తీరికవేళలలో శ్రీరంగ వీధులలో తన విద్యా వినోదా లారంభించాడు. మొట్టమొదట అది అతనికి కొంచెం ఎబ్బెట్టుగా ఉన్నట్టు స్ఫురించింది. కాని క్రమక్రమంగా ఆ సంకోచం పూర్తిగా సడిలిపోయింది. స్వామి సేవ ముగిసిన తరవాత కొంచెం తీరిక చిక్కినప్పుడు వీధులలో తన మల్ల విద్యా వినోదా లారంభించాడు. క్రమక్రమంగా ఆనాటి కానాటి కాతని కేదో కొంత రాబడి కనబడింది. ఒక్కొక్కప్పుడు తలవని తలంపుగా ధనికులు కొంద రాతని నైపుణి గమనించి బంగారు అంగుళీయకాలుకూడా బహూకరించారు. మరికొంద రింకా ఆనందించి పైడి చక్రాలు, వెండి శంఖణాణకాలు విసరివేశారు! ఆవిధంగా పోగుపడిన సొమ్ముతో అతని కేవిధమయిన లోపము, చీకు, చింత లేకుండా జీవితం చాలా సుఖంగా గడిచిపోయింది. ఒక్కొక్కప్పుడు తన దగ్గిర మిగిలిన సొమ్ముతో హేమసుందరికి ముక్కెర, శంఖ చక్రాలవంటి కర్ణాభరణాలు మొదలయిన చిన్న చిన్న నగలు కొన్ని చేయించాడు. అప్పుడప్పుడు మరికొంత సొమ్ము దాశరథి ద్వారా శ్రీవైష్ణవ మఠానికి సమర్పించాడు.

ఆ పరిస్థితులలో రంగనాయకు డిక తనవంటి అదృష్టశాలి లేడనుకొని ఆనందంతో తలమునకలయినాడు. ఆ సంతోష సమయాలలో అతనికి పూర్వం నిచుళాపురంలో హేమసుందరి గాఢానురాగ గాథ జ్ఞప్తికి వచ్చింది. ఆ రోజులలో మొట్టమొదట గోపాలస్వామి ఆలయంలో ఆమె నేత్రాభినయం చూచిన క్షణంలోనే అతని శరీరం జలదరించి గగుర్పొడిచింది! తన గుండెలోనే హేమ అందెల జంట ఘల్లు ఘల్లుమని ధ్వనించిన ట్టొక విచిత్రమయిన అనుభూతి కలిగింది! ఆమె ఆకర్ణాంత విశాలనేత్రాలవైపు చూచిన పిమ్మట కనురెప్పల

కదలికే అంతరించింది. నృత్యం ముగిసినంతవరకు మరి శరీర స్పృహే లేదు! ఆనాటినించి ఆమె వెడద కనుదోయి సందర్శించనినా ఓక అతనికంటి కొక్క కునుకయినా పట్టలేదు! అటువంటి అపూర్వ సౌందర్యవతి సాంగత్య భాగ్యం లభించగలదని అత డెన్నడు కలలో నయినా ఊహించి ఉండలేదు! స్వామి అపార కృపవల్లనే తన కోరిక ఫలించినదని తిరిగి ఇంకోసారి నిశ్చయించుకొని రంగనాయకుడు ఉల్లాసావేశంతో ఉప్పొంగిపోయాడు!

ఆపైన రామానుజయతి ఆర్ద్రవాత్సల్యం తలుచుకోగానే అతని కనుగొలుకులలో కవోష్ణ బాష్పావళి తరళించింది. మొట్టమొదట ఆ యతీశ్వరుని సందర్శించినప్పుడు రంగనాయకు డనేక విధాల మథనపడ్డాడు. సన్నసన్నగా చివాట్లు పెట్టి మారు మాటాడక తిరిగి నిచుళాపురం వెళ్లిపోవలసిన దని ఆజ్ఞాపించగలరేమో నని ఎంతో ఆందోళన పడ్డాడు. కాని అటువంటి ప్రస్తావనే రాలేదు. పైగా ఎంతో ఆప్యాయంగా తన మల్లవిద్య పరిశీలించి వేనోళ్ల అభినందించారు. కన్న తల్లికన్న ఎంతో ఆత్మీయతతో, అభిమానంతో ఆదరించారు. ఎన్నెన్ని విధాల ఆలోచించినా ఆ యతీశ్వరుని అపూర్వాదరణ కేమి కారణమో అతని కవగాహన కాలేదు!

స్వామి సేవలో ఏమాత్రము తీరిక చిక్కక పోయినా, రంగనాయకు డొక్కనాడయినా రామానుజుని సందర్శన భాగ్యం పోగొట్టుకోలేదు. బాగా చీకటి పడినా సరే తిన్నగా మఠంవైపు సాగిపోయేవాడు. అయితే అందువల్ల తిరిగి ఇంటికి చేరుకోడాని కొక్కొక్కప్పుడు బాగా ఆలస్యమయింది. హేమసుందరికా ధోరణి ఎంతయినా మనోవ్యథ కలిగించింది. అయినా ఆమె మరికొన్నాళ్ల వరకు అతనిదేమని ప్రశ్నించలేదు. కాని మరి భరించలేక క్రమక్రమంగా రుసరుస లారంభించింది. అందువల్ల అతనికి కొంత మనఃఖేదం కలగక పోలేదు. కాని గత్యంతరం కనబడలేదు. మరి కొన్నాళ్ల కామె ఏదోవిధంగా సమాధాన పడగలదని రంగనాయకు డనుకొన్నాడు.

మఠంలోనికి రాకపోక లెక్కువయినకొద్దీ రామానుజుని అంతేవాసులలో కూడా అతనిని గూర్చిన గుసగుస లినుమడించాయి. ఎవరో ఒకరిద్దరికి తప్ప మిగిలినవారి కెవ్వరికి తనమీద రవంతయినా సదభిప్రాయం కలగలేదని రంగనాయకుడు డూహించక పోలేదు! మఠంలో అడుగుపెట్టినప్పుడు వారి చురుకుచూపు లతని కెంతయినా ఆందోళన కలిగించాయి. కాని రంగనాయకు డెక్కడ చెక్కు చెదరలేదు. 'రామానుజుని వంటి పుణ్యమూర్తి నన్నెంతో ఆదరించి కళ్ల కద్దుకొంటున్నప్పుడు ఇక ఇతరుల గోడు నాకేల!' అని బాగా ధైర్యపడి అతడిక ఆ విషయమే తలపెట్టలేదు!

## 21

ఆనాటి కానాటికి రంగనాయకుని యెడల ఆచార్యునికి మక్కువఎక్కువయినకొద్దీ శిష్యులలో ఆశ్చర్యము, అలజడి ఇనుమడించాయి. అయినా ఆయన ఎదట పడి ఇదేమని ప్రశ్నించగల సాహసం వా రెవ్వరికి కలగలేదు. రామానుజయతి యెడల వారి భయభక్తు లట్టివి! ఒకవేళ సాహసించి నోరు విడిచి అడిగినా గంభీర మౌనముద్రతో మేళవించిన దరహసితమేగాని, వేరొక ప్రత్యుత్తర మేది వెలువడక పోవచ్చును! వారి కటువంటి అనుభూతి అనేక మారులు కలిగింది. కనకనే మరి గత్యంతరం కానలేక తమలో తాము గుసగుస లారంభించారు. అయితే వారిలో కొంద రెలాగయినా రంగనాయకుని పుట్టు పూర్వోత్తరాల రహస్యా లాకళించుకోవాలని శాయశక్తులా ప్రయత్నించారు.

అప్పుడప్పుడు శ్రీరంగక్షేత్రం సందర్శించిన నిచుళాపుర వాసులవల్ల క్రమక్రమంగా వారిలో కొందరికి రంగనాయకునికి సంబంధించిన రహస్యాలు కొన్ని తెలిశాయి. కాని ఆ వార్తలలో అతిశయోక్తి బాగా మేళవించింది. జనానీకం నోళ్లలో పడిన వృత్తాంతా లానాటి కానాటికి గోరంతలు కొండంతలుగా మారిపోవడం సర్వ సాధారణంగా జరిగే విషయమే! రంగనాయకుని విషయంలో కూడా సరిగా అలాగే జరిగింది. అతడొక పెద్ద బందిపోటుల దండులోనించి తప్పించుకొని వచ్చి

---

డాక్టరు: రామయ్యా! ఈ మందు కొంచెం చేదుగా ఉంటుంది; కళ్ళు మూసుకుని తాగమను.

రామయ్య: (కళ్ళుమూసుకుని భార్యతో) ఇదుగో, ఈ మందు తాగు.

కె. రంగారావు.

---

శ్రీరంగంలో తలదాచుకొన్నా డన్నారు కొందరు. మరికొంద రంతటి తాగుబోతు, జూదరి, తుంటరి, పచ్చినెత్తురు తాగే మహాపాపి వేరొకడు లేడని హోరారా దూషించారు. ఇంకా కొందరు హేమసుందరి అతని వేలు విడిచిన మేనమామ కుమార్తె కాదన్నారు. ఎందరెందరో సంపన్నుల భవంతులలో దీపా లార్పివేసిన గట్టి నెరజాణ అని నిందించి ఈసడించారు. శ్రీరంగంలో ఆ వేశ్యాంగన కిక పొద్దస్తమానము నటవిటగాయకులతో ఏకసక్కాలే గాని మరి వేరే పనిపాట లేవి లేవని అసహ్యించుకొన్నారు. వారిలో మరికొందరు ప్రబుద్ధులు ధనుర్దాసు వచ్చుదనానికదే ప్రధాన కారణమన్నారు.

అవే అతిశయోక్తులు కొన్ని చిలవలతో పలవలతో మఠం బ్రహ్మచారుల ద్వారా రామానుజుని ప్రధాన శిష్యుల వరకు వెళ్లిపోయాయి. కాని అంతమాత్రంచేత వా రెవ్వరు అవి ఆచార్యుని కెరిగించలేదు. అటువంటి ప్రసంగా లాయన కేమాత్రము రుచించవని వారి కంతకుమునుపే తెలిసి వచ్చింది. అందుచేత అంతేవాసు లెవ్వరు ఆచార్యుని ఎదటపడి ఆ విషయం ప్రస్తావించడానికే సాహసించలేదు. కాని ఏదో ప్రసంగ సందర్భంలో ఒక బ్రహ్మచారి ముఖతః ఆ రహస్యాలు కొన్ని ఆచార్యుని వరకు వెళ్లినట్టు వారికి తెలిసింది. ఆ విషయమై ఆయన ఉపేక్షాదృష్టి వారి కెంతో ఆశ్చర్యం కలిగించింది! రామానుజయతి బ్రహ్మచారి ద్వారా ఆ విడ్డూరాలు కొన్ని విని బాగా పరధ్యానంగా ఏదో దీర్ఘాలోచన ప్రారంభించాడు. అంతేగాని మరి ప్రతి సమాధానం చెప్పలేదు. ఆ మౌనముద్ర గమనించి ఆ బ్రహ్మచారి మరి నోరు మెదపలేక, తల వంచుకొని వేరొక పనిమీద వెళ్లిపోయాడు.

రామానుజుని ప్రధాన శిష్యులలో గోవిందయతి, కూరాగ్రహాధిపతి, యజ్ఞమూర్తి, దాశరథి, అనంతసూరి ప్రముఖులు. వారందరు తర్క వ్యాకరణాది శాస్త్రాలలో, వేదాంత విద్యలో, చతుర్వేదాలలో మీసు మిగిలిన విద్వాంసులు. వైదికకర్మ నిష్ఠాగరిష్ఠులు. మొట్టమొదటినించి రంగనాయకుని యెడల వారి కంతగా సదభిప్రాయం కలుగలేదు. అయితే ఆతనిపై ఆచార్యుని అపూర్వ వాత్సల్యదృష్టి గమనించి కొంత తటస్థ దృష్టితో తమ కేమి పట్టనట్టు మాట్లాడ కూరుకొన్నారు. అయితే ఇటీవల ఆతనిని గూర్చి విస్తరించిన వింత వార్తలు కొన్ని విని వా రందరు ఆశ్చర్యావేశాలతో నిశ్చేష్టితులయినారు! రంగనాయకు డెవడో సామాన్య కృషీవలుని కుమారుడు! తల్లిదండ్రుల నెదిరించి ఒక వెలయాలిని వెంటబెట్టుకుని వచ్చి శ్రీరంగంలో తలదాచుకొన్నాడు. అతగాడి కెంతసేపు సాము గరిడీలమీదే దృష్టి! వేరొక గొడవే లేదు. ఏకోశాన భక్తిప్రపత్తులున్నట్టు కనబడడంలేదు. పైగా తాగుబోతు. ఇంకా ఎన్నెన్ని దుష్కార్యా లాచరించాడో ఎవ్వరి కెరుక! అవి అన్ని తలుచుకోగానే వా రందరికి అతని యెడల విపరీతమయిన ఏహ్యభావం కలిగింది! కాని ఆచార్యుని ఆర్ద్రాదరణ దృష్టివల్ల పైపైకి మాత్రం కొంత గౌరవ భావం వ్యక్తీకరించక తప్పలేదు.

రామానుజ యతీశ్వరునితో బాగా పరిచయం కలిగిన తరవాత కూడా రంగనాయకుడు తన మద్యపాన ధోరణి విడిచిపెట్టలేదు. ఆ దురభ్యాసం పూర్తిగా విడిచిపెట్టాలని అత డనేక పర్యాయాలు గట్టిగా నిశ్చయించుకోకపోలేదు. కాని ఆ పట్టుదలవల్ల అది క్రమక్రమంగా బాగా బలపడుతున్న ట్టనిపించింది. అప్పటినించి మరి గత్యంతరంలేక ఇక అతడా సంకల్పమే విరమించుకొన్నాడు. ఆపైన నాలుగయిదుసారులు రవంత మైకంతో అటు ఇటు తూగుతూ రామానుజ మఠంలో ప్రవేశించాడు. యజ్ఞమూర్తి మొదలయినవారా ధోరణి పసికట్టినా ఆచార్యుని యెడల గౌరవంవల్ల అలక్ష్యంచేసి అది గమనించనట్టు నటించారు. రంగనాయకుని నడవడికగాని, శిష్యుల లోలోపల మొలకెత్తిన ఏవగింపుగాని రామానుజునికి తెలియకపోలేదు. అయినా ఆనాటి కానాటికి ఆచార్యుని కతని యెడల మక్కువ మరింతగా ఎక్కువయింది. అంతేగాని రవంతయినా క్షీణించలేదు! మరి కొన్నాళ్లు గడిచిన పిమ్మట దానికొక గట్టి తార్కాణ కనబడింది.

సామాన్యంగా శ్రీరంగేశుని ఆలయానికి పోయే

సమయంలో దాశరథి భుజంమీద చేయి ఆనించి అల్లనల్లన సాగిపోవడం ఆ యతీశ్వరుని కొక పరిపాటి. ఇటీవల అప్పుడప్పుడు ఆ చేయి రంగనాయకుని భుజంమీదికి తిరిగింది. ఆనాటి కానాటి కది ఒక అలవాటుగా, పరిపాటిగా పరిణమించింది. ఆచార్యుని పరమాత్మీయ దృష్టి కది ఒక గొప్ప తార్కాణమని శిష్యులందరు ఏకగ్రీవంగా విశ్వసించుకొన్నారు. అప్పటినించి లోలోపల రుచించినా, రుచించకపోయినా వారి కందరికి రంగనాయకుని మరింత ఎక్కువగా గౌరవించక తప్పలేదు. ఆపైన మరికొన్నాళ్లు గడిచినపిమ్మట ఒక అత్యద్భుత సంఘటన జరిగింది.

రామానుజు డొకనాటి ప్రాతఃకాలవేళ శిష్యులతోబాటు శ్రీరంగశాయి సందర్శనం కోసం ప్రయాణమయినాడు. పరిపాటి ప్రకారం రంగనాయకు డెంతో అడకువతో ఆచార్యుని సన్నిధిని నిలుచున్నాడు. రామానుజు డతని భుజంమీద ఆనుకుని నెమ్మది నెమ్మదిగా తన దేవాలయ ప్రస్థానం కొనసాగించాడు.

మార్గశీర్ష మాస ప్రారంభంలోనే శ్రీరంగంలో కొంచెం హిమవర్షం ప్రారంభించింది. ఆనాటి కానాటి కది మరికొంత ఎక్కువయింది. అందువల్ల వీధుల కిరువైపుల గృహస్థుల ఇళ్ల పెరళ్లలో గోడల కానుకుని అల్లుకొన్న గుమ్మడి తీగల పూలు మాత్రమే అక్కడక్కడ స్పష్టాస్పష్టంగా గోచరించాయి. ధనుర్మాసం నాలుగయిదు దివసాల క్రితమే ప్రారంభమయింది. వీధులలో ఎటువైపు చూచినా రంగురంగుల రంగవల్లికలే! ప్రతి ప్రాంగణంలోను బాలికలు గుమ్మడిపూలతో గొబ్బిళ్లు పెట్టి వలయాకార పరిభ్రమణాలతో, సునుసిగ్గులతో కెంపుల కాసులయిన చెక్కిళ్లతో సన్నని మధుర స్వరాలతో గొబ్బిపాట లారంభించారు. ప్రాతఃకాల సువర్ణ

# విశాలనేత్రాలు

కాంతి వీధిలో ప్రతి భవంతి చూరులలోను వేలాడగట్టిన వరి వెన్నుల గుత్తులపై, మొగలిరేకుల తోరణాలపై పడి దృశ్యాదృశ్యంగా ప్రకాశించింది. ఆ మనోహరకాంతి వర్షంలో శ్రీరంగ నగరం తన తెలిమంచు దుప్పటీముసుగు కొంచెం తొలగించి, అల్లనల్లన మేలుకొంటున్నట్టు గోచరించింది. ఆకాశంలో పైడి కలశాలతో, శిఖరాలతో మాత్రమే ప్రత్యక్షమయిన శ్రీరంగనాథుని దేవాలయం, విచిత్రమయిన ఒక విశాల నౌక పైడి వెలుగుల మున్నీటిలో తేలుతున్నట్టు భాసించింది! స్వామి ప్రాతఃకాల సేవామంగళ తూర్య ఘోషలో వీధులలో గంగిరెద్దుల ననుసరిస్తున్న చిన్న చిన్న సన్నాయిల శ్రావ్య శ్రుతి క్రమక్రమంగా అంతర్లీనమై అణగిపోతున్నట్టు స్ఫురించింది.

క్రమక్రమంగా వా రందరు శ్రీరంగనాథ దేవాలయం సమీపించారు. పొద్దుటి లేత ఎండ పొడలో స్తంభాల ఆకారాలలో మలచిన అచ్చరల పెదవులపై చిరునవ్వు, వాస్తవ దరహాసం వలె తరళించింది. దేవళంపై గల పన్నిద్ద రాళ్వారుల మూర్తులా వెలుగులో అతి లోకమయిన ఆనంద తన్మయతలో ప్రజ్వలించాయి. పౌరులనేకులు అప్పుడే ఆలయంలో ప్రవేశించి జయజయధ్వానాలతో శ్రీరంగశాయికి జేజే లర్పిస్తున్నారు. గర్భాలయంలో అర్చకులందరు ముక్తకంఠాలతో శ్రీ సూక్త పురుష సూక్తాల పారాయణా లారంభించారు. గభీర ఘంటా ఘోష మాటికి మాటికి ఆలయంలో అంతట ఖంగు ఖంగుమని ప్రతిధ్వనించింది. అదే సమయంలో ఆచార్యుని అంతేవాసు లందరు ఏకీభవించిన గళ స్వరాలతో ద్రావిడ దివ్య ప్రబంధాల లుచ్చైస్స్వరాలతో పఠించారు. ఆ ప్రశాంత గంభీర ధ్వని వినగానే రంగనాయకుని శరీరం జలదరించింది! అప్రయత్నంగా కనుగొలకులనుండి ఆనంద బాష్పధార ప్రవహించింది. అంతలోనే ప్రధానార్చకుడు స్వామి కట్టెదుట కర్పూర నీరాజనం సమర్పించాడు. అదే సమయంలో రామానుజ శిష్యుల ద్రావిడ వేదపారాయణ ఘోష పరమ గభీరమై తిరిగి దేవాలయావరణలో నలుమూలల మారుమ్రోగింది.

ఆ గాన తన్మయతతో పులకించిన రంగనాయకుని ముఖతః అప్రయత్నంగా ద్రావిడ వేద పాశురం వెలువడింది. అత డిటీవలనే మఠంలో ఒక అంతేవాసి బ్రహ్మచారి ముఖతః కొన్ని పాశురా లభ్యసించాడు. అతని గొంతులో అంతగా గాంభీర్యం లేదు. కాని మాధుర్యం భక్తిభావ బంధురమై మంద్రాతి మంద్రమై మారుమ్రోగింది. ఆచార్యు డాశ్చర్య విస్ఫారిత నేత్రాలతో అతని అరమోడ్పుకన్నులను పరిశీలించాడు. రంగనాయకుడు తన పాశురగానం ముగించి ఆనందబాష్పాలతో తరళిస్తున్న ఆచార్యుని ప్రఫుల్ల విశాల నేత్రాలనవలోకించాడు. ఆ సమయంలో అంతకుమును పొకనాడు ఆయన అన్నమాట, తటాలున అతని హృదయాంతరాళంలో స్ఫురించింది. అంజలి ఘటించి లోలోపల తొణికిసలాడుతున్న డగ్గుత్తికతో వేడుకొన్నాడు:

'స్వామీ ! తా మొకప్పుడు తమ నేత్రాలకన్న మిక్కిలి మనోజ్ఞములయిన సుదీర్ఘ విశాల విలోచనాల దర్శన భాగ్యం ప్రసాదించగలమని అన్నారు. కాని నా కప్పుడా వాగ్దానంలో గల అంతరార్థం బోధపడలేదు ....'

ప్రగాఢ గద్గదికతో రంగనాయకుని మాట తడబడింది. రామానుజయతి నిశ్చల నేత్రాలతో అతని ముఖవైఖరి పరిశీలించి ఆర్ద్ర వాత్సల్యంతో భుజంపై రవంత ఆనుకొని అల్లనల్లన ప్రశ్నించాడు:

"అవును నాయనా ! నేనా వాగ్దానం మరిచిపోలేదు. అయితే నీ కిప్పు డటువంటి మహనీయవిలోచనాలోకమారు సాక్షాత్కరించుకోవలెనని ఉన్నదా ?'

రంగనాయకుడా ప్రశ్న విని ఆనందావేశంతో నిశ్చల శిలాప్రతిమవలె నిశ్చేష్టుడయి అంతకంటె మహాభాగ్య మేమి లేదన్నట్టు దోసిలికట్టి అతి వినీతుడై నిలుచున్నాడు.

మరు నిమేషంలోనే శ్రీరంగేశునివైపు తిరిగి ప్రగాఢ భక్తి ప్రపత్తులతో పరిపూర్ణాంజలి ఘటించిన రామానుజ యతీశ్వరుని ముఖతః వెలువడిన ద్రావిడ వేదపాశురాల పరంపర ప్రశాంత మధురమై ప్రతిధ్వనించింది. ఆ మనోజ్ఞ పారాయణ విరావం వినగానే అంతేవాసులందరు భక్తితన్మయులై దోసిళులొగ్గి నిలుచున్నారు. వారి చెక్కిళ్ల మీద ఆనంద బాష్పావళి నిరంతరమై ప్రవహించింది. దేవాలయంలో రామానుజ యతీంద్రుని ద్రావిడ పాశుర పఠనం మిక్కిలి అరుదు! శ్రీరంగంలో అది ఆలకించిన అదృష్టవంతు లెంతోమంది లేరు. అందుచేత అర్చకులెంతో భయభక్తులతో తిరిగి శ్రీ సూక్తపురుష సూక్తా—లారంభించారు. కృష్ణాగరు ధూపమాలికలతోబాటు తిరిగి శ్రీరంగేశునికి



సౌరభిళ కర్పూర నీరాజనం సమర్పించారు. ఆ వెలుగులో రంగనాయకు డర్పించిన సువర్ణ నేత్రాలతో సమలంకృతమయిన స్వామిముఖం మరింతగా జాజ్వల్యమానమై ప్రకాశించింది. అదే సమయంలో రామానుజయతి చెక్కిళ్లపై ప్రవహిస్తున్న కన్నీటిబిందువు లక్కన కొనగోటితో తుడుచుకొని రంగనాయకుని కనురెప్ప లొకించుక స్పృశించి శిరస్సుపై చేయిఉంచి అస్పష్టస్వరంతో ఆశీర్వచనా లనుగ్రహించాడు. ప్రగాఢ వాత్సల్యంతో 'నాయనా ! అదిగో అటువైపు చూడు !' అని శ్రీరంగనాథుని నేత్రయుగళి నిర్దేశించాడు. అంతే ! మరు క్షణంలోనే తళతళత్కాంతులతో రంగనాయకుని కళ్లెదుట వేయి మెరుపుల సమూహం క్షణకాలం నిశ్చలములయిన స్వరూపాలతో నిలిచిన ట్లొక విధమయిన అపూర్వానుభూతి కలిగింది! ఇంద్రధనుస్సులవంటి బొమముడులలో లేగుజుక్కలవంటి కనుపాపలతో అతిలోక విశాలమయిన రమణీయ విలోచన యుగళి గభీర కరుణార్ద్రమై తరళించింది ! అంతలోనే అతని శరీరం ఉద్వేగంగా అలముకొన్న పులకలతో గజగజ వణికింది. ఆపైన ఏమి జరిగినదో రంగనాయకుని కేమాత్రము అవగాహన కాలేదు. క్షణకాలం విపరీత మూర్ఛావేశంతో నేలపై వాలిపోయాడు. అంతలోనే తెలివి తెచ్చుకొని రామానుజుని పాదయుగళి ప్రగాఢ భక్తి తన్మయతతో కౌగలించుకొని ఆనందభాష్పధారలతో అభిషేకించాడు.

"స్వామీ ! ఈ మహాపాపిమీద తమకెంత దయ కలిగినది! ఇంతటి జాలికి నా కర్హత ఏమి ఉన్నది ! ఒహో ! స్వామి దివ్యనేత్రాల సందర్శన భాగ్యం కటాక్షించారుగదా ! .... అయ్యో ! హేమసుందరి ఈ అదృష్టానికి నోచుకోలేదు గదా !'

రామానుజయతి ఎంతో ఆప్యాయతతో రంగనాయకుని లేవనెత్తి విశాల హృదయస్థలి కద్దుకొని గాటంగా కౌగలించుకొన్నాడు. హేమసుందరిని గూర్చి రంగనాయకుడన్న పలుకు లాలకించగానే ఆ యతి కటాక్షాలపై కవోష్ణ బాష్పబిందువు లొకటి రెండు తరళించాయి. అంజలి బంధంతోబాటు కనుదోయి తిరిగి అప్రయత్నంగా శ్రీరంగేశునివైపు తరలినది. ద్రావిడ పాశురాలతో బాటు గీర్వాణ స్తోత్రా లొకటే ప్రశాంత ధీరస్వరంతో రామానుజుని హృదయాంతరాళంలో నుండి వెలువడి గర్భాలయంలో అంతట ప్రతిధ్వనించాయి. తిరిగి అర్చకు లర్పించిన కర్పూర నీరాజన కాంతులతో శ్రీరంగనాథుని వదనం దేదీప్యమానంగా ప్రజ్వలించింది.

కాని ఆ పరమాద్భుత సంఘటన పరమార్థం శిష్యు లెవ్వరికి బోధపడలేదు. వా రందరు వేరువేరుగా ఆచార్యుని కల్లంత దూరంలో నిలుచున్నారు. అందువల్ల వారి కెవ్వరికి రామానుజ రంగనాయకుల మధ్య నడిచిన ప్రసంగా లేవి విస్పష్టంగా వినిపించలేదు. ఆ తరుణంలో ఆచార్యుడు శ్రీవైష్ణవ భక్తి ప్రపత్తులకు సంబంధించిన రహస్యాలేవో రంగనాయకుని కుపదేశించి ఉండవచ్చునని అనుకొన్నారు. అందుచేతనే రంగనాయకుని కంతటి పారవశ్యం కలిగి ఉండవచ్చునని నిశ్చయించుకొన్నారు. అదిగాక కొంగ్రొత్తగా అతడానాడు ద్రావిడ పాశురాలు పఠించాడు. ఆపైన ఆచార్యుని దివ్య ప్రబంధ పారాయణం గర్భాలయంలో నలువైపుల మంద్ర మనోహరమై ప్రతిధ్వనించింది. అటువంటి పరిస్థితులలో ఎలాంటి నాస్తికుల కయినా ప్రగాఢ భక్తి భావావేశంతో తన్మయత ఆవేశించవచ్చును. ఇంతకుపూర్వం మూఢభక్తు లనేకులు రామానుజని సాన్నిధ్యంలో పట్టరాని భక్తి తాత్పర్యాలతో మైమరిచి మూర్ఛిల్లిన సందర్భాలెన్నో వా రనేక పర్యాయాలు సందర్శించారు. అందుచేత రంగనాయకుని అపూర్వానుభూతి రహస్యం వా రెవ్వరికి రవంతయినా బోధపడలేదు. అయితే ఆచార్యుని అనుగ్రహదృష్టి మరింత ఆర్ద్రమై ఆనా డతనిమీద ప్రసరించి ఉండవచ్చునని వా రనుకొన్నారు.

రంగనాయనికి మరి కొంతసేపటివరకు, హర్షావేశంతో శరీరం గాలిలో తేలిపోతున్నట్టు స్ఫురించింది. శిరస్సుమీది చిరకాల దుర్భర భారం తటాలున తొలగించివేసిన ట్లొక విచిత్రమయిన అనుభూతి కలిగింది. అతని హృదయంలో అంతట నిశ్చల ప్రశాంతత అలముకొన్నది. శ్రీ రంగేశుని మనోజ్ఞమూర్తి, అఖండ కర్పూర నీరాజనము, గర్భాలయము, అన్నీ క్షణకాలంపాటు వింత కాంతిజ్వాలలతో విలీనమయి పోతున్నట్టు పొడకట్టింది. కలగంటున్నానా ? మేలుకొన్నానా ? అని రంగనాయకుడు రవంతసే పాశ్చర్యావేశంతో నిశ్చేష్టు డయినాడు! కళ్లు నులుముకొని తిరిగి మిక్కిలి జాగరూకతతో నలువైపుల పరిశీలించాడు. రామానుజయతి, దాశరథి, యజ్ఞమూర్తి ఆదిగా గల అంతేవాసులందరితోను గర్భాలయం తిరిగి సహజ స్వరూపంతో సాక్షాత్కరించింది.

దేవాలయార్చకులు వా రందరికి క్రమక్రమంగా తీర్థ ప్రసాదా లందించారు. రంగనాయకు డవి స్వీకరించిన పిమ్మట శిష్యులతోను, ఆచార్యునితోను కలిసి తిరిగి మఠంవైపు సాగిపోయాడు. మార్గమధ్యంలో ఆనాటి దివ్యానుభూతి స్మృతివల్ల అతని కడుగడుగునా నెమ్మేనిపై పులకలావిర్భవించాయి. మఠంలో ప్రవేశించిన పిమ్మట రంగనాయకుడు తిరిగి ఆచార్యుని పాదయుగళిపై వాలి నమస్కరించి సెలవు తీసుకుని తన భవంతికి తరలిపోయాడు.

ఇంటిలో అడుగు పెట్టగానే హేమసుందరి అతనివైఖరి గమనించి ఎంతో ఆశ్చర్యపడి అడిగింది.

"ఇదేమిటిలా గున్నా రీవేళ ?"

'ఎలాగున్నాను ?'

రంగనాయకుడు కొంచెం తెల్లబోయి బొమముడి విరిచి ప్రశ్నించాడు.

'ఇప్పుడే నిద్రపోయి లేచిన ట్టున్నారు !'

'అలాగా!'

రంగనాయకు డానాడు దేవళంలో సంఘటిల్లిన అత్యద్భుత వృత్తాంతం యథాతథంగా హేమ కెరిగించాడు. మొట్టమొదట అతని మాటమీద ఆమె కంతగా నమ్మిక కలగలేదు! కాని అతని ముఖంలో గోచరించిన విచిత్ర గాంభీర్యముద్ర గమనించి పిమ్మట ఆమె కిక నమ్మక తప్పలేదు. అయితే ఆ సంఘటనలో గల పరమార్థం సమగ్రంగా ఆమె కవగతం కాలేదు. వాస్తవానికి రంగనాయకునికే అది సమగ్రంగా అవగాహన కాలేదు! దివ్య విలోచనా లన్న పదానికి ఆమె స్వామి ప్రతిమామూర్తి నేత్రాలని మాత్రమే అర్థం చేసుకొన్నది! అందుచేత ఆ వృత్తాంతాని కంతగా ఆశ్చర్యపడలేదు! కాని ఆనాటి మధ్యాహ్న భోజనం ముగించి ప్రగాఢ నిద్రలో మైమరచిన రంగనాయకుని ప్రశాంత ముఖవైఖరి ఆమె కొకింత ఆశ్చర్యం కలిగించింది!

—ఇంకా ఉంది.

## బ్రహ్మానందం

ఆలపాటి లక్ష్మణరావు

నల్లని మేఘము
చల్లని గాలులు
విశాల నింగిని
విహరించంగా!

తళతళ మెరుపులు
దశదశ ఉరుములు
ఆకసమందున
అరుదెంచంగా!

జలజల వర్షము
గలగల కాల్వలు
బజారులందున
ప్రవహించంగా!

పాప నేర్పుగా
పడవల కొన్ని
కాగితంబులతో
గబగబ చేసి

ముదమున కాల్వలో
వదలి వేయగా
అన్నియు మునిగెను
అలుపే మిగిలెను!

అయినా పాపకు
అదె ఆనందం
పరమానందం!!
బ్రహ్మానందం!!!

## జీవితం

16 వ పేజీ తరువాయి

కాని ఎలాగోపోయి మంచంమీదపడి ఏడ్చాను. ఇది జీవితంలో నా ఆఖరి ఓటమి! ఏడ్చిఏడ్చి యిక ఓపిక లేక, ఓదార్చేవాళ్ళు లేనిపరిస్థితి తలచుకుంటూ పిచ్చిగా నవ్వుకున్నా!

అన్నయ్య విషయంలో నన్నింతవరకూ ఎవరు అర్థంచేసుకోలేదు! యిదే నా బాధ! కనీసం మా వారన్నా అర్థంచేసుకుంటారని ఆశించాను గాని ఈ సారికూడ పొరబడ్డానని అర్థమయింది!

ఆఁ.... మళ్ళా నా కథలోకి వస్తున్నా! తర్వాత నేను మంచంమీదనుంచి నెమ్మదిగా లేచి బల్లదగ్గరకు వెళ్ళి అన్నయ్య వ్రాసిన ఉత్తరం తీసికొని మళ్ళీ యింకోసారి చదవడము మొదలుబెట్టా.

"చెల్లీ! నీవు, మీ ఆయనా, కలిసి ఎలాగయినా పెళ్ళికి నాలుగు రోజులు ముందు రావాలి" నాకు నవ్వువచ్చింది ఇప్పుడు నా పరిస్థితి అన్నయ్యకు తెలిస్తే ఎలాగుంటుంది? పిచ్చి అన్నాడు! అందరూ తనలాగే అమాయకంగా నిష్కల్మషంగా వుంటారని అనుకుంటాడు! నేను పెళ్ళికి వెళ్ళకపోతే ఎంత బాధపడతాడు. అబ్బ! యిక ఆలోచింపలేకపోయా! అసలే అన్నయ్య మనస్సు చాలా సున్నితం!

అప్పుడు నేను హైదాబాదులో బి. ఎస్‌సి చదువుతున్నాను. హాస్టల్లో వుండేదాన్ని! ఫైనల్ ఇయర్‌లో నేను, తార స్నేహితుల మయ్యాం!

విజిటింగ్ సమయంలో హాస్టల్ అమ్మాయిలను కలుసుకోడాన్కి వాళ్ళ బంధువులు వస్తూండేవారు. నా కెవ్వరూ బంధువులు అక్కడ లేకపోవడంవల్ల నా కెవ్వరూ వచ్చేవారుకాదు. అందర్నీ చూస్తూంటే నాకన్పించేది: "నాకూ ఒక అన్నవుంటే, యిక్కడే చదువుకుంటూంటే, వాడు అపుడు నన్ను చూడడాన్కి వచ్చేవాడ"

ఈ మాటే ఒకసారి తారతో అన్నాను. అది నవ్వి, "నీకు అన్న కావాలంటే యింతకాలం చెప్పలేదెందుకు? సరేలే! ఇపుడన్నా చెప్పావుగా నేను చూచి పెడతాలే" అంది. ఏదో తమాషాకు అంది అనుకొని ఎప్పుడోకాదు యిప్పుడే కావాలి" అని అన్నాను.

"అయితే నడు, మా అన్నయ్య వచ్చే టైమ్ అయింది" అంది.

వేరేవాళ్ళతో మాట్లడ్డానికి భయపడే నేను ఎలా వెళ్ళానో యేమో మొత్తానికి తారతో వెళ్ళాను. అపుడు చూచాను తార అన్నయ్యను. అంటే యిపుడు మాఅన్న. తార మా ఇద్దర్నీ ఒకరి నొకరికి పరిచయం చేసింది. నేను మాట్లాడడానికి ముందు కొంచెం బిడియపడ్డా. అన్నయ్య కలుపుగోలుతనంముందు నా బిడియం మాయమయింది! "ఇంత మంచి వాళ్ళుంటారా" అని నా కా రోజు చాలా ఆశ్చర్యం వేసింది! ఒక్కరోజులోనే నాకు అన్నయ్య దొరికాడు.

నా జీవితంలో అన్నయ్యను మొదటిసారిగా కలుసుకొన్న ఆరోజు ఎప్పటికి మర్చిపోలేను.

ఇక అప్పటినుండి బయటకు ఎక్కడకువెళ్ళినా తార, నేను, అన్నయ్య—ముగ్గురం కలిసే వెళ్లేవాళ్ళం.

అన్నయ్య అనేవాడు: "నాకిప్పుడు ఒక్క చెల్లి కాదు ఇద్దరు." చెల్లిఅని పిలిపించుకోవడం నా కెంతో సంతోషంగా వుండేది.

ఈ విధంగా కొన్ని రోజులు గడిచిపోయాయ్! ఒక రోజు మా రూమ్‌మేట్ సరోజ వచ్చి "యిదిగో సుమతీ! నీవు తార—వాళ్ళ అన్నతో తిరుగుతుంటే అందరూ ఏమనుకుంటున్నారో తెలుసా? కొంచెం జాగ్రత్తగా వుంటే మంచిది" అని అంది.

నాకు భలే కోపం వచ్చింది. "అందరూ ఏమన్నా అనుకోనీ లోకం అంటే నా కేం భయంలేదు. తిరిగే వాళ్ళకు లేని భయం నా కెందుకూ? అందరూ ఏదో అనుకొంటారని మా అన్నను నేను వదులుకోలేను. దయచేసి మళ్ళా ఇటువంటి మాటలు నా దగ్గర అనకు" ఖచ్చితంగా మొఖంమీద చెప్పేశాను. అంతే! అప్పటినుండి సరోజ నాతో మాట్లాడటం మానే సింది.

ఈ సంగతి అన్నయ్యతో చెప్తే చాలా బాధ పడ్డాడు. అయ్యో! ఈ సంగతి ఎందుకు చెప్పానా అని విచారించాను. అన్నయ్య కొంచెం సేపయిన తర్వాత "అనవసరంగా లేనిపోని మాటలు అన్పించు కోడం ఎందుకు? ఇప్పటినుండి మనం ఎక్కువగా కలుసుకోవద్దు. ఏమంటావ్ చెల్లీ?" అనడంతో నిజం చెప్పొద్దూ—నాకు కోపం ఏడుపూ రెండూ వచ్చాయ్!

నేను "అదేంటన్నయ్యా! అలాఅంటావ్. వాళ్లేదో అన్నారని మనం కలుసుకోవడం మానేయాలా? నీది మరీ యింత సుతి మెత్తని హృదయంలని తెలిస్తే అసలు నీతో ఈ సంగతి చెప్పకేపోదునే" అన్నాను.

ఆ రోజు సినిమా ప్రోగ్రాము ఉండడంతో తక్కిన గొడవలన్నీ మర్చిపోయి బయలుదేరదామను కొనేటప్పటికి "అన్నట్లు చెప్పడం మర్చిపోయా. రేపునాకు కెమిస్ట్రీ పరీక్షవుంది. మీరిద్దరూ వెళ్ళండి" అంది తార.

అలాగయితే ఈ రోజుకి సినిమా మానేస్తామని అన్నాము మేమిద్దరం. 'నేను రాలేక పోయినందుకు మీరిద్దరూ మానేయడం యేం బాగోలేదు. మీరు వెళ్ళి తీరవలసిందే' అని పట్టుబట్టింది తార.

సరేనని అన్నయ్య, నేను బయలుదేరాం. ఇంతకాలం ముగ్గురం కలిసి పోయేవాళ్ళంగాని ఈసారి అన్నయ్య, నేను—యిద్దరమే వెళ్తున్నాం! నాకు అది తప్పుగా కాని, భయంగాకాని తోచలేదు. లోకం గ్రుడ్డిది. మమ్మల్ని చూచి పెడర్థాలు తీస్తుంది! కాని దేవుడికి తెలుసు మా హృదయ నైర్మల్యం! అదేచాలు!

టిక్కట్లు తీసుకొని లోపలికి వెళ్లేటప్పటికి సరోజ, ఆమె స్నేహితురాళ్ళు కన్పించారు. మమ్మల్ని చూడగానే ఏదో చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు.

సినిమానుంచి వచ్చిన తర్వాత 'మంచి సినిమా పోగొట్టుకున్నావ్ పాపం!' అని తారను ఉడికించా! ఆ మరుసటిరోజున డైనింగ్ రూమ్‌లో సరోజ ప్రక్కనవున్న అమ్మాయిలతో ఏదో రహస్యంగా చెప్తుంటే వాళ్ళు మధ్యమధ్య నావైపు చూస్తూ న్నారు! నేను గమనించకుండ నావైపు చూడాలనే వాళ్ళ తాపత్రయం చూస్తుంటే నాకు నవ్వు వచ్చింది. వాళ్ళ మూర్ఖత్వానికి ఏమనాలో నాకర్థం కాలేదు.

మనుష్యులు మంచిని ఎప్పటికీ ముందుగా గ్రహించ లేరనుకుంటా!

ఒకరోజు అన్నయ్య తాను వచ్చినట్లు తెలుపుతూ ఫ్యూన్‌కి కాగితంయిచ్చి పంపాడు. తార వస్తుందేమో, యిద్దరం కలిసి పోదామనుకున్నాను. ఇంకా ఏం చేస్తున్నదా అని కాలేజికి వెళ్ళి (హాస్టలు, కాలేజి ఒక దగ్గరే వున్నాయి) చూస్తే ఇంకా కెమిస్ట్రీ ప్రాక్టి కల్స్ చేస్తుంది. నన్ను చూచి బయటకు వచ్చింది. అన్నయ్య వచ్చాడు అని చెప్పాను. తనకు రావడానికి వీలులేదనీ, నన్ను వెళ్ళి మాట్లాడమని, వీలుఅయితే తర్వాత వచ్చి కలుసుకుంటానని చెప్పింది.

సరేనని చెప్పి వెళ్ళాను. అన్నయ్య యేదో జోక్ చెప్తుంటే ఒకటే నవ్వుతున్నాను. ఇంతలో ఎవరో తెలిసినవాళ్ళు వస్తున్నట్లు దూరంనుంచి కన్పిం చింది. ఎవరై వుంటారా? అని ఆలోచిస్తుండగానే ఆ వ్యక్తి దగ్గరకు వచ్చేటప్పటికి గుర్తుపట్టాను. అంతే. ఆశ్చర్యంతో అలాగే గుడ్లప్పగించి చూడటం మొదలుబెట్టాను.

---

"నీకు కఠినాతి కఠిన శిక్ష విధిస్తున్నాను." అన్నాడు న్యాయమూర్తి అతి గంభీరంగా. న్యాయస్థానంలో జనం చెవులు నిక్కించి కఠినాతి కఠిన శిక్ష ఏమిటా? అని ఆలోచిస్తున్నారు.

గట్టిగా ఊపిరి పీల్చుకొని న్యాయాధికారి ఇలా అన్నాడు. "నిన్ను జైలుకి పంపి హాయిగా బ్రతికనివ్వను. ఈ క్షణాన విడుదల చేస్తున్నాను. పన్నుల భారం, నిరుద్యోగం, రాజకీయ కక్షలు, అణ్వాస్త్రాల వల్ల వాటిల్లే ముప్పులతో సతమత మవుతూ ఉండు"

"సింహం" (విజయవాడ)

---

రెండుని మిషాలు అలాగే గడిచిపోయిం తర్వాత "అన్నయ్యా! బావ వచ్చాడు" అని చెప్పి లేవబోతూం డగా బావ మావైపు తీక్షణంగా ఓసారి చూచే టప్పటికి గుండె బేజారయింది. అలాగే తడబడుతూ వెళ్ళి, బావను విజిటర్స్ పుస్తకంలో పేరు వ్రాయ మని చెప్పాను. తర్వాత అన్నయ్యదగ్గరకు తీసుకొని వచ్చాను.

"ఈయన ప్రభాకరన్నయ్య! ఇక్కడ కెమి స్ట్రీలో రిసెర్చి చేస్తున్నాడు." ఇక "ఈయన మా బావ — రాజు. వైజాగ్‌లో ఇంజనీరింగ్ చదువు తున్నాడు" ఇలా యిద్దర్నీ పరిచయం చేశాను.

అన్నయ్య ఎంతో సరదాగా చనువుగా బావతో మాట్లాడుతున్నాడు గాని బావమటుకు ఏదో ముళ్ళ మీద కూర్చున్నట్లు కన్పించాడు. మధ్యమధ్య నేను కూడ మాట్లాడుతున్నాను. ఇంతలోకి తార కూడ వచ్చింది. మాబావను ఆమెకుకూడ పరిచయంచేశాను. కొంత సేపయినతరువాత తార తానేదో అర్జెంట్‌గా కొనాలని, అందుకు తోడుగా అన్నయ్యను తీసికొని వెళ్తున్నానని లేచింది.

"పాపం చాల కాలానికి—అదీ అకస్మాత్‌గా కలుసు కున్నారు గాబోలు బాగా మాట్లాడుకోండి. బెస్ట్ ఆఫ్ లక్" అని నవ్వుతూ తార అన్నయ్యతో వెళ్ళి పోయింది. దాని కొంటె మాటలకు నాకు నవ్వు వచ్చింది గాని బావముఖం చూచేటప్పటికి నవ్వు మాయమయింది. ఇంతవరకూ అడుగుదామను కొన్న విషయాలు యిక అడగకుండ వుండలేక పోయాను.

'ఏం బావా! యింత అకస్మాత్తుగా వచ్చావు. ఒక్క ఉత్తరమన్నా వ్రాయకపోయావా?' నే నను కోని విధంగా మొఖం యింకా తీవ్రంగా మారింది. నే నాశించని జవాబు కాదు — ప్రశ్న — "ఏం నే నకస్మాత్తుగా వచ్చినందుకు పట్టుబడ్డావని బాధగా వుందా?"

ఛీ! బావ ఎంత నీచంగా ఆలోచిస్తున్నాడు? ఇపుడర్థమయ్యింది. ఏదో అనుమానముండే అంత దూరంనుంచి వచ్చాడన్నమాట!

నేను ఇంక ఏమీచెప్పలేకపోయాను! అవును చెప్పినా లాభంవుండదు.

ఇక నేను అడగవలసిన అవసరం లేకపోయింది. బావ చెప్పడం మొదలుపెట్టాడు. "నా స్నేహితుడు ఒకడు ఇక్కడ ఉన్నాడు. వాడు వ్రాసిన ఉత్తరం మొన్ననే అందింది. నీవు, ఆ ప్రభాకర్ కలిసి తిరగడం వాడు చూచాడట! స్నేహితుణ్ణిగాబట్టి నీ మేలు కోరి చెప్తున్నా. ఆ సంగతి ఏదో తేల్చుకో! అని. నిజంగా ఈ సంగతి చదివేటప్పటికి నాకు మా ఫ్రెండ్‌మీద కోపం వచ్చింది. ఏదో పొరబడి ఉంటాడని అనుకొన్నాను. అయినా అనుమానమేమి ఉండకూడదని వెంటనే బయలుదేరి వచ్చాను. కాని, ఇంక ఏమీ అడగకుండానే బుజువైపోయింది." ఇదన్నమాట సంగతి. నేను నోరెత్తకుండా అలాగే ఉన్నాను. నేను మౌనంగా ఉండడంతో ఇంకా కోపం రెచ్చిపోయి, "ఛీ! నీవు ఇలాటి దానివని నేను ఎప్పుడూ వూహించనైనా వూహించలేదు. పోనీ, ఇప్పటికన్నా నీ రూపం బయట పడింది. ఇక నీకు, నాకు ఎటువంటి సంబంధంలేదు."

ఒక్కసారి షాక్ తిన్నట్లయింది. సహృదయు డనుకున్న బావేనా ఇలా మాట్లాడుతున్నాడు. ముందు వెనుక లాలోచించకుండా ఎలా దూషిస్తున్నాడు. ఇక భరించలేకపోయాను! ఎంత సంకుచిత భావాలు లేకపోతే అంతదూరంనుంచి పరుగెత్తుకొని వచ్చాడు. ఇటువంటి భావాలున్నవాడిని చేసుకొనేకంటే పెండ్లి మానుకొనడమే నయమనుకొన్నాను.

ఇక కోపం పట్టలేక అనేశాను 'బావా! నీకిటువంటి తలంపులుంటాయని నే నెప్పుడూ అనుకోలేదు. మన పెండ్లికాకముందే నిన్ను బాగా అర్థం చేసుకో డానికి నాకు మంచి అవకాశం ఇచ్చినందుకు నీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను. ఇక వస్తా" అని హాస్ట ల్లోకి వెళ్ళిపోయాను.

అలాగని వచ్చేశానే గాని, నిజంగా నా హృదయం బ్రద్దలైపోతోంది.

ఇంతకాలం నేను నిర్మించుకున్న ఆశా

## జీవితం

సౌధాలన్నీ నేటితో కుప్పగా కూలిపోయాయ్! బావ యింజనీరింగ్ పూర్తిచేస్తాడు. తర్వాత... ఇలా ఆలోచిస్తూ ఇన్నిరోజులు గడిపాను. గాని ఈ రోజుతో జీవితం శూన్యంగా మారింది.

ఇలా ఆలోచిస్తూండగా తార వచ్చింది. నేను మంచంమీదనుంచి లేచి యేమీ జరగనట్లు వుండడానికి ప్రయత్నించాను. ఎందుకంటే ఈ సంగతి ఆమెకు చెప్పితే అన్నయ్యకు తప్పక చెప్పేస్తుంది. అసలే అన్నయ్యది సున్నిత హృదయం.

"ఏమే! బావ వచ్చినందుకు మొహం అంత చక్కగా వుందేం? అపుడే వచ్చి వెళ్ళిపోయాడనా యేమిటే కొంపదీసి"అని అంది విచార రేఖలు కన్పిస్తున్న నా మొఖంచూచి.

బలవంతంగా నవ్వుతెచ్చుకోడాన్కి ప్రయత్నం చేసి అప్పటికి ఎలాగో తప్పించుకొన్నాను.

కాలేజి చివర టరమ్‌లోకి వచ్చేశాము. గనుక పరీక్షలకు సన్నద్ధులవుతున్నాం! అన్నయ్య అప్పుడప్పుడూ వచ్చేవాడు. కెమిస్ట్రీలో అర్థంకానివి చెప్పేవాడు.

ఫిబ్రవరి చివరి వారంలో హాస్టల్‌డే ఏర్పాటు చేశాము. ఆరోజు బంధువులను, మిత్రులను ఆహ్వానించవచ్చును. నేను అన్నయ్యను ఆహ్వానించాను. ఆరోజు కష్టాలన్నీ మర్చిపోయి యెంతో సరదాగా గడిపాము. హాస్టల్‌డే ఎప్పుడూ రాత్రులే జరుపుతారు. ఆరాత్రి విందు చాలా బాగా ఏర్పాటుచేశాము.

అన్నయ్య సరదాకి "ఏం! మీ డిన్నరు ఎంత ఘనంగా వుంది. అనవసరంగా వచ్చాను. సమయం దండుగ! మా హాస్టల్‌డే ఎంత బ్రహ్మాండంగా చేస్తామో చూడండి"అని అంటూ రెండో ఐస్ క్రీమ్ కప్ తీసుకొన్నాడు.అపుడు నేను 'ఏం అన్నయ్యా! మేమేమీ బాగా చేయలేదంటూనే రెండో ఐస్‌క్రీమ్ కొట్టేస్తున్నావ్ పాపం! మమ్మల్ని సంతోషపెట్టడానికనుకుంటా! థాంక్స్!" అనే టప్పటికి అన్నయ్య నవ్వకుండా ఉండలేకపోయాడు.

హాస్టలు గదులన్నీ అన్నయ్యకు నేను, తార చూపించాము. మా గదిలో కాస్సేపు కూర్చున్నాడు. ఇక పదిన్నర అవడంతో వెళ్ళిపోయాడు.

పరీక్షలు మరీ దగ్గర పడటంతో అన్నయ్యను తరచుగా కలుసుకోడానికి వీలులేకపోయింది.

ఎలాగో పరీక్షలు అయ్యాయనిపించుకొన్నాం. ఇంటికి వెళ్ళేముందు అన్నయ్యనొకసారి కలుసుకొన్నాను.

'ఏం చెల్లీ! పరీక్షలు బాగా వ్రాశావా?' అడిగాడు అన్నయ్య

"ఆ .... ఏదోలే. మాబోటివాళ్ళకు వుండనే వుందిగా జనతాక్లాసు. ఫర్వాలేదు' ఇద్దరం నవ్వుకున్నాం! అంతే. అదే నేను ఆఖరిసారిగా అన్నయ్యను చూడడం! మా ఊళ్ళో నాలుగు రోజులుండి పెద్దమ్మకూతురు పెండ్లి యింకా పదిహేను రోజులుండగానే వాళ్ళ ఊరికి రమ్మని నాకు వుత్తరం వ్రాసింది. నేను అన్నయ్యకు మా పెద్దమ్మవాళ్ళ యింటి చిరునామా వ్రాసి, అక్కడికే వుత్తరాలు వ్రాయమని చెప్పి ప్రయాణమయ్యాను.

నెల తర్వాత యింటికి వచ్చేశాను. కొన్ని రోజులకు ఫలితాలు కూడా వచ్చేశాయి. మరిరెండు రోజులకు అన్నయ్య 'కంగ్రాచ్యులేషన్స్' అంటూ ఉత్తరం వ్రాశాడు.

"ఆ ఉత్తరం ఎక్కడనుండి వచ్చింది?" అమ్మ ప్రశ్న.

'అన్నయ్య వ్రాశాడు.' అంటూ చూపాను. ఆ అన్నయ్యగురించి అడుగుతుందనీ, అపుడు సరదాగా అంతా చెబుదామని ఆశించాను. కాని అమ్మ మాట్లాడకుండా వెళ్ళిపోయింది! నాకు చాలా బాధ అనిపించింది. కొంపదీసి అమ్మకూడ అపార్థంచేసుకోవడంలేదుకదా! ఊహించడానికే బాధనిపించింది.

నే ననుకున్నట్లే అమ్మ కొంచెం సేపయింతర్వాత వచ్చి, 'సుమతీ! ఆ ప్రభాకర్‌కి ఉత్తరం వ్రాద్దామనుకుంటున్నావేమిటి? అటువంటి పిచ్చిపనులు చేయకు' అన్నది.

---

విమర్శకు డడిగాడు రచయితను: ఏమయ్యా, నేనింత తిడుతూ నీపుస్తకంమీద వ్యాసం వ్రాశానే! ఖాతర్ లేదా? అని.

రచయిత: "మీరు నా పుస్తకం కొని చదివారా?" "లేదు" అన్నాడు విమర్శకుడు."నా పుస్తకం కొని చదవందే నాకు ఆవ్యక్తి మీద ఖాతర్ వుండదు.

—విద్యారాణి.

---

ఇది నేను కొంత అనుభవంమీద ఊహించుకొన్న విషయం కాబట్టే బావ వచ్చినప్పుడు పొందినంత బాధ కలగలేదు. మన మనస్సు లెంత పవిత్రంగా వున్నా, 'మనవాళ్లే మనను నమ్మకపోతే ఎంత బాధగా వుంటుంది! ఇక వేరే మనుష్యుల సంగతి చెప్పనక్కర లేదుకదా!'

బావ ఇంజనీరింగ్ పూర్తిచేశాడని తెలిసింది. కాని యిపుడు ఆ విషయాలతో నాకే సంబంధం లేదు. అదీగాక ఒకరోజు బావదగ్గరనుండి మా నాన్నకు వుత్తరము వచ్చింది." మీ అమ్మాయికి నాకంటే ఎంతో అందగాడు, చదువుకున్నవాడు దొరుకుతాడు. నేను కోరేది కూడ అదే!" ఇదీ ఆ ఉత్తరంలోవున్న సారాంశము.

అమ్మా, నాన్నలకు నేనీ సంగతులన్నీ ముందు ముందు చెప్పకుండడమే మేలనుకొని యేమీ చెప్పలేదు. ఇప్పుడు వాళ్ళకు ఆ ఉత్తరంలో వున్న సంగతులు అర్థంకాక తెల్లబోయారు. నేను ఏడ్పు మొదలుపెడ్తా ననుకొని నన్ను అనునయించబోయారు గాని, నేను విరాగినిలా అలాగే శూన్యంగా చూస్తూండటంతో మరీ తెల్లబోయారు.

నాన్న సంబంధాలు వెదకటం మొదలుబెట్టారు. నా నిర్దోషిత్వాన్ని తెలియబరుస్తూ బావకు వుత్తరం వ్రాద్దామని ఎన్నోసార్లు అనుకొని అభిమానం అడ్డు రావడంతో మానేశాను.

"వాడు చెప్పాలి కాబోలు, తనకంటె మంచివాడు దొరుకుతాడని. వాడికంటే పదిరెట్లు ఎక్కువయిన వాడిని తెస్తాను. ఏమనుకున్నాడో దౌర్భాగ్యుడు!" ఇవీ రోజూ నాన్న అనే మాటలు. యింకా గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు.

నాకుమాత్రం పెళ్ళిచేసుకోవాలని అసలులేదు. జీవితంలో ఒకసారి ప్రేమించాను! పెద్ద దెబ్బ తిన్నాను! ఇక చాలు. అనుభవం సంపాదించా. మళ్ళీ యింకొకర్ని నమ్మలేను! ఎలాగో ధైర్యం పుంజుకొని అమ్మకు చెప్పాను "నన్ను ఇలా వదిలేయండి, నేనే దన్నా వుద్యోగం చేసుకొని బ్రతుకుతాను గాని పెళ్ళి చేసుకోను." అమ్మ నా మొండితనం చూచి బెదరించుకొంది.

నాన్న ఈ సంగతి విని "సుమతీ! మన ఇంటి మర్యాద నిలబెట్టడానికన్నా నీవు పెళ్ళిచేసుకొని తీరవలసిందే! ఒకప్రక్కన అంతా సిద్ధమవుతుంటే నీ విటువంటి పిచ్చివేషాలు వెయ్యకు" కసిరారు నాన్న!

నేను మౌనంగా విన్నాను. ఆ రాత్రి నేను యేడ్చినంత ఎప్పుడూ ఏడ్వలేదనుకుంటా! ఇక పెళ్ళి పదిరోజులుంది! బావను పెళ్ళికొడుకుగా ఊహించుకొన్నాను. నా పిచ్చి ఊహలకు అంత బాధలోనూ నవ్వుకున్నాను. చచ్చిపోతే? అనుకున్నాను. బ్రతికి సాధించలేనిది చచ్చి సాధిస్తానా? బ్రతకడానికి భయం, గాని చావడానికి ధైర్యంలేదు.

ఈ వార్త తెలియగానే చుట్టుప్రక్కల అమ్మలక్కలందరూ మా యింటికి వచ్చి భోగట్టా సేకరించడం మొదలుబెట్టారు.

ఈ ప్రపంచంనుంచి దూరంగా పారిపోయి ఏ కొండల్లోనో తలదాచుకుంటే బాగుంటుందనిపిస్తుంది! కాని యిదిమటుకు సాధ్యమవుతుందా!

నేను అన్నయ్య పెళ్ళికి వెళ్ళలేకపోయాను! మీరు ఆశ్చర్యపోరనుకుంటా!

మరుసటిరోజు అన్నయ్యకు ఉత్తరం వ్రాశాను. నా బాధంతా వ్రాసేద్దామనుకొన్నాను గాని అన్నయ్య బాధపడతాడని యింతకాలం దాచిన విషయాలు ఇప్పుడు చెప్పటంలో అర్థంలేదు! "ఆయన అర్జెంటుగా ఏదో ఊరికి వెళ్ళవలసివచ్చింది! అందుకని రాలేక పోతున్నాం! క్షమించన్నయ్యా!" యిలా క్లుప్తంగా వ్రాశాను. అన్నయ్యకు అబద్ధం వ్రాస్తున్నందుకు బాధగా ఉన్నా గత్యంతరంలేక ఉత్తరం పోస్టే చేశాను.

ఇదంతా జరిగి యిప్పటికి అయిదు సంవత్సరాలయింది. ఇంతవరకూ అన్నయ్యను చూచే అదృష్టము కలుగలేదు. ఎప్పుడన్నా ఆ భాగ్యం కలుగుతుందనే ఆశతో కనిపెట్టుకున్నాను. ఎందుకంటే పెళ్ళికాగానే అన్నయ్య, వదిన విదేశాలకు వెళ్ళారు. ★

# సుజాత

13 వ పేజీ తరువాయి

అది నాగభూషణం నాటకం—'రక్త కన్నీరు.' ఈ నాటకంలో నటించి, ఊరూరా సుజాత వంద పైచిలుకు ప్రదర్శనాలలో పాల్గొన్నది! ఈ నాటకంతో ఆమెకు మంచి అనుభవం కలిగింది. సంభాషణలు పలకటమూ, ముఖ కవళికలు మార్చటమూ వంటివి బాగా అలవడ్డాయి.

అప్పుడా ప్రయత్నంలోనే సుజాతకు 'అంబరీష' చిత్రంలో ప్రప్రథమంగా అవకాశం కలిగింది. ఆ చిత్రంలో ఆమె ఒక చిన్న వృద్ధపాత్రను ధరించింది. ఆ తర్వాత 'కన్నకొడుకు', నాగార్జున' చిత్రాలలో నటించింది. 'నాగార్జున' జరుగుతూ ఉండగానే ఆమెకు చాలా మంచి అవకాశం కలిగింది. అది—'భీష్మ' చిత్రంలో సత్యవతి పాత్ర! దర్శక—నిర్మాత బి. ఏ. సుబ్బారావుగారు సుజాతకు, ఒకటికి రెండుసార్లూ మూడుసార్లూ కూడా చెప్పి—ఆ పాత్రను నటింపచేశారు. సుజాతను అందంగా చూపించటానికీ, ఆ అమ్మాయిని నటిగా రూపించటానికి ఆయన అమితమైన శ్రద్ధ తీసుకున్నారు. అందుకనే సుజాత ఎప్పుడూ సుబ్బారావుగారికి కృతజ్ఞతలు చెప్పుకుంటూనే ఉంటుంది.



శుభోదయవారి సెట్టుమీద బి. ఏ. సుబ్బారావు, ప్రతిభశాస్త్రి, పేకేటి, చిత్రనాయకుడు రామారావు, దర్శకుడు తాపీ చాణక్య. ఫొటో: రూప.

విక్రమ ప్రొడక్షన్స్‌వారి "మదన కామరాజు కథ"లో అనూరాధ



చిన్నప్పుడు నాట్య ప్రదర్శనంలో సుజాత.



బాబూ మూవీస్ వారి 'మంచిమనసులు' రజితోత్సవంలో పాల్గొన్న శ్రీ డి. వి. యస్. శర్మ (శ్రీ ఫిలింస్) నిర్మాత శ్రీ సుందరం, సభాధ్యక్షుడు శ్రీ నాగయ్య, శ్రీ శివన్న.

# సుజాత

'భీష్మ' చిత్రం విడుదలైన తర్వాత, సుజాత పేరు అందరికీ బాగా తెలిసింది. ఇటీవలే ఈ అమ్మాయి 'మదన కామరాజు'లో కనకవల్లిగా నటించింది! వాల్టా వారి సాంఘిక చిత్రంలోనూ, 'పతిశక్తి' అనే కన్నడ చిత్రంలోనూ. మరో కన్నడ సాంఘిక చిత్రంలోనూ సుజాత ఇప్పుడు మంచి పాత్రలు ధరిస్తున్నది.

సుజాతకు తమిళం, హిందీ భాషలు—రెండూ రాయటమూ, చదవటమూ వచ్చును. చిలిపితనంగా ఉండే పాత్రలంటే తనకు మహా యిష్టం అన్నది సుజాత.

పత్రికలలో కథలు చదవటం అంటే ఆమెకు ప్రాణం. ఇంట్లో ఉన్నప్పుడల్లా ఆమె పని—పఠనమే! లేకపోతే చిన్న పిల్లల్లే వాళ్లింట్లో ఉన్న బొచ్చు కుక్కతో కాలక్షేపం చేస్తుంది. సుజాత కారు నడుపుతుంది; సైకిలు తొక్కుతుంది; ఈత కొడుతుంది. బాడ్మింటన్‌లాంటి ఆటలు బాగా ఆడుతుంది.

ఈ విద్య లన్నింటినీ ప్రదర్శించాలంటే—అవన్నీ చూపే అవకాశంగల పాత్ర లభిస్తేనేగాని, సాధ్యం కాదనీ, అటువంటి చలాకీ పాత్రను నటించాలనే తాను అభిలషిస్తున్నాననీ—అన్నది వర్ధమాన తార సుజాత!

★

—సుకుమార్

---

# తెలుగు చిత్రవార్తలు

## మంచిమనసులు-రజితోత్సవం

బాబూ మూవీస్‌వారి "మంచిమనసులు" చిత్రము రజితోత్సవము ఇటీవల మద్రాసు, విజయా గార్డెన్స్‌లో వైభవంగా జరిగింది. ఆ నాటి సభకు ప్రఖ్యాత నటకులు శ్రీ నాగయ్య అధ్యక్షత వహించారు. సభకు పలువురు నిర్మాతలు, సాంకేతిక నిపుణులు, నటీనటులు వచ్చారు. నటీనటులను, సాంకేతిక నిపుణులను శ్రీ సుందరం (నిర్మాత) పుష్ప మాలాంలకృతులను చేశారు.

ప్రముఖ చలనచిత్ర నిర్మాత, విజయా అధినేత శ్రీ నాగిరెడ్డి ప్రసంగిస్తూ యీనాటి చిత్ర పరిశ్రమను ఎదుర్కొంటున్న సమస్యలనుగురించి వివరించి, చిత్రనిర్మాతలు, సాంకేతిక నిపుణులు, నటీనటులు ఒకరికొకరు అండగా నిలబడి చలన చిత్రపరిశ్రమను ముందుకు తీసుకుపోవాలని కోరారు. అలా అందరూ కలసిమెలసి పనిచేయబట్టే శ్రీ సుందరం నిర్మించిన చిత్రం 'మంచిమనసులు' 3 నెలల్లో పూర్తయి, 6 నెలలుగా అఖండవిజయం పొందింద‌ని వక్కాణించారు.

తరువాత ప్రముఖ దర్శకుడు శ్రీ పి. పుల్లయ్య చిత్రనిర్మాణంలో దర్శకుడు, సాంకేతిక నిపుణులు ఎదుర్కొనే సమస్యలనుగురించి వివరించారు.

నటుడు శ్రీ నాగభూషణం ప్రసంగిస్తూ, ఇలాటి రజితోత్సవాలాధారంగా నిర్మాతలు, నటులు తమతమ చిత్రాల బాగులు చర్చించుకున్నట్లుగానే, పరాజయం పొందిన చిత్రాల నిర్మాతలు, నటీనటులు కూడా సమావేశమై తమ చిత్రాలనుగూర్చి చర్చించుకుంటే చిత్రాలు బాగుపడతాయని సూచించారు. తరువాత

దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు, ప్రముఖనటుడు శ్రీ ఎన్. టి. రామారావును పుష్పమాలాలంకృతులను గావిస్తూ, వారు అడిగినంతనే సహకరించినందులకు వారి ఉదార స్వభావాన్ని కొనియాడారు. శ్రీ చక్రవర్తి అయ్యంగార్ వందన సమర్పణతో సభ ముగిసింది. సభానంతరం బాబూ మూవీస్ వారు విజయా గార్డెన్సులో విందు ఏర్పాటు చేశారు.

## "మహాభారతము"

మహాభారతము సంపూర్ణ కథతో నిర్మింపబడిన ఈ మహోన్నత పౌరాణికచిత్రాన్ని చూడ్డానికి వేయికళ్లయినా చాలవేమో అన్నట్లుగా రూపొందింది. సువర్ణా ఫిలింస్‌వారు సమర్పించు ఈ చిత్రం ఆంధ్రలో అతి త్వరలో విడుదలవుతుంది.

ఇందులో—మహీపాల్ శ్రీ కృష్ణుడుగా, త్రిలోక్‌పూర్ అర్జునుడుగా, త్రిపాటి కర్ణుడు గా, కైలాష్ దుర్యోధనుడుగా, బాబూరావు పహిల్వాన్ భీముడుగా, నిరుపరాయ్ ద్రౌపదిగా నటించారు. మాటలు—పాటలు: శ్రీ శ్రీ; సంగీతం: పామర్తి; నిర్మాత: తుమ్మల రామారావు; దర్శకుడు: రామచంద్ర ఠాకూర్.

## "అ ను రా గం"

శివరంజని పిక్చర్సువారు సమర్పించు ఈ చిత్రం త్వరలో సెట్‌మీది కెళ్లటానికి సర్వసన్నాహాలతో సిద్ధమవుతోంది. జమున, జగ్గయ్య, గుమ్మడి, రమణారెడ్డి, పద్మశ్రీ, మారంపల్లి అన్నపూర్ణ, ప్రముఖ తారాగణం అంతా నటించనున్న ఈ చిత్రానికి దర్శకుడు టి. యన్. రామారావు; మాటలు: పినిశెట్టి; పాటలు: సముద్రాల, శ్రీ శ్రీ, ఆరుద్ర, కొసరాజు, శ్రీ కృష్ణ, వీటూరి మున్నగువారు.

## "చూడబోతే చుట్టాలే"

స్వాతి ఫిలింస్ సమర్పించు ఈ చిత్రం నవంబరునెలలో విడుదలయ్యేందుకు సిద్ధమవుతోంది. జమున, కళ్యాణకుమార్ ప్రధానపాత్రలు ధరించిన ఈ చిత్రానికి నిర్మాత: బి. వెంకటేశ్వరరావు; నిర్వహణ: టి. యన్. రామారావు.

## శ్రీకృష్ణసాయి ఫిలింస్

గాంధారి గర్వభంగం, వీరజగ్గడు, మాయామోహిని—మున్నగు చిత్రాలను ఆంధ్ర ప్రజానీకానికి సమర్పించిన శ్రీ కృష్ణసాయి ఫిలింస్‌వారు తమిళనాడులో శత దినోత్సవాలు జరుపుకున్న "వెంజిల్ ఓర్ ఆలయం" అను తమిళ చిత్రాన్ని తెలుగులోకి అనువదించటానికి సర్వసన్నాహాలు సాగుతున్నాయి.

## "ప్రే మ కా ను క"

లోగడ 'శ్రీ కృష్ణ పాండవయుద్ధం' చిత్రాన్ని ఆంధ్ర ప్రజానీకానికి అందించిన పెనుశిలా పతాక నిర్మాత శ్రీ దామర పెంచలునాయుడుగారు యిప్పుడు డి. పి. ఎస్. పిక్చర్సు పతాకం క్రింద—శ్రీ కృష్ణ వ్రాసిన "ప్రేమకానుక" కథను త్వరలో వెండితెరమీది కెక్కించటానికి సర్వసన్నాహాలు వడివడిగా సాగిస్తున్నారు. బహుశా ఈ చిత్రం డిసెంబరు, జనవరిలో సెట్‌మీదికెళ్లే ప్రయత్నంలో వున్నది. ★



స్వాతి ఫిలింస్ వారి "చూడబోతే చుట్టాలే" ఒక దృశ్యం.

### హమేషా - తమాషా రచయితలకు విజ్ఞప్తి

ఈ శీర్షికకు పంపే రచయితలు కవరుపై స్పష్టంగా 'హమేషా - తమాషా' అని రాయాలి. స్టాంపులు జతచేసి పంపరాదని మనవి. సం॥



### కథ కాని కథల రచయితలకు విజ్ఞప్తి

రచయితలీశీర్షికకు కేవలం 'హాస్య సంఘటనల'నే పంపుతున్నారు. నిత్యజీవితంలో చిత్రవిచిత్రాలైన సంఘటనలెన్నో తటస్థిస్తూ ఉంటాయి. వాటిని గురించి కూడా వ్రాస్తే బాగుంటుందని రచయితలకు మనవిచేస్తున్నాము.



### రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంపగోరుతాము. అల్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరి కొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

# రాజధాని కబుర్లు

11—వ పేజీతరువాయి

పళ్ల సంగతి చూద్దామా, ఆకాశాన్నంటే ధరలు. అయితే ఎప్పుడైనా సరదాగా అరటిపళ్ళు కొనుక్కోవచ్చులెండి! అయినా రాబడి భోజనాలకే సరిపోక సతమతమవుతుంటే, వీటి ధ్యాస ఎవరికి పోతుంది. ఇక తిండి పదార్థాల్లో అన్నీ కల్తీలే! బియ్యంలో కలిసిపోయే రాళ్ళు!! పప్పుల్లో కన బడని రాళ్లు! నెయ్యి అనే మాట వాడుక భాష లోంచి తొలగించాల్సిందే! దాని పేరట రకరకాల కొవ్వు పదార్థాలు చెలామణీ అవుతున్నాయి. గానుగ నూనె అని పేరే గాని, ఒక్క ఆకారం మినహా యిస్తే, రుచీ, వాసనా అంటూ ఉండవుగదా! అయితే వికారం మాత్రం వస్తుంది. ఆహార పదా ర్థాల లక్షణాలు ఈ విధంగా ఉంటుంటే, పుష్టి కరమైన ఆహారం లభ్యం కావాలంటే ఎట్లా కుదురుతుంది! దీన్ని గురించి పెద్ద రిపోర్టు అక్కర్లేదు. ఉన్నవి ఉన్నట్టుగా లభ్యమయ్యేటట్లు చూస్తే చాలు. కల్తీ ఆహార పదార్థాలు తిని రోగాలు తెచ్చుకుంటే నకిలీ మందులు తిని గమ్య స్థానం చేరుకోవటమే!

ఈ కల్తీలకు నిరసనగా తీవ్రంగా ఆక్షేపణ తెలియచేస్తూ అఖిల—భారత వారివణుల సంస్థ, తాలూకు హైదరాబాదు శాఖవారు ఓ సభను ఏర్పాటు చేశారు. కల్తీలను ప్రోత్సహించే దుష్ట శక్తులను నిర్దాక్షిణ్యంగా అణచివేయాలసిన ఆవశ్య కతను ప్రభుత్వంవారి దృష్టికి తేవటానికి ప్రయత్నం చేశారు. నిజమే! తిండి పదార్థాల్లో అనుక్షణం కలుపుతున్న కల్తీల పర్యవసానంగా ఘోరమైన చెడు ఫలితాలు కలుగుతున్నట్లు వార్తా పత్రికల్లో చూస్తూనే ఉన్నాం. కొంతమందిని ఆసు పత్రులలో చేర్పించటం, మరికొంతమందికి ఆ అవ సరం కూడా లేకపోవడం గమనిస్తూనే ఉన్నాం. ఇలాంటి దారుణమైన పరిస్థితిని అరికట్టటానికి ప్రభుత్వంవారు తీవ్రమైన చర్యలు తీసుకోవటంలో జాప్యం చేయకూడదు.

ఈ గొడవలు ఇట్లా ఉంటూ ఉండగా, అసలు ఏ తిండీ దొరక్క 'పేవ్‌మెంట్ల' మీద, బస్సు స్టాండుల్లోను, రైలు స్టేషన్లోను కొల్లలు కొల్ల లుగా 'ప్రజలు' అల్లాడిపోతున్నారు, అయ్యో, అమ్మో అనుకొంటూ. ఈ 'వర్గానికి' పుష్టికరమైన ఆహార సమస్యే లేదు, కల్తీలు అసలే లేవు. ఏదో ఒకటి ఇంత తింటానికి ఉంటే చాలు.

రోజురోజుకు ధరలు పెరిగిపోతున్నాయి. అవి పెరుగుతున్నకొద్దీ కొనుగోలు శక్తి క్షీణించి పోతోంది. ఇవ్వాళ రూపాయికున్న విలువ నెల దాటేటప్పటికి లేకుండా పోతుంది. రూపాయి కాగితం పరిమాణాలు అట్లాగే ఉంటున్నాయి, అదే రూపాయి అనుకుంటున్నాం. అయితే క్రమక్రమంగా మనకు తెలియకుండానే దాని విలువ కుంగిపోతూనే ఉంది. ఈమధ్య పెద్దలంతా ఢిల్లీలో సమావేశమై, ఈ ధరల పెరుగుదలను ఆపెయ్యాలనుకున్నారుట! రోజుకో పన్ను సృష్టిస్తూ, ప్రజల్ని హింస పెడు

తూనే ఉన్నారు. ద్రవ్యోల్బణం ఉండనే ఉంది. ధరలు తగ్గమంటే ఎట్లా తగ్గుతాయి!

ఈ 'కలి' ప్రపంచానికి అతీతులై శుద్ధ ఆయుర్వేదాన్ని అభ్యసించాలని, విద్యార్థులు కొంత మంది ఉద్యుక్తులయితే, వాళ్లకు తగినంత ప్రోత్సాహం లభించకపోయె! రెండేళ్లనుంచి ప్రభుత్వంవారితో తగాదాలే, పేచీలే! ఆయుర్వేదాన్ని ఉద్ధరించాలని ఉపన్యాసాలు చెయ్యటంలో లోపం లేదు. మరి ఆ విద్యార్థులకు తగినంత అవకాశం ఇచ్చి, పరీక్షలు ప్యాసయి సర్టిఫికేట్లు తీసుకున్నవాడు, వాళ్లకో స్టేటస్ అంటూ కల్పించకపోతే ఎట్లా! విద్యార్థుల ఆందోళన, తీవ్రరూపం దాల్చింది. అయితే పరీక్షల్లో ప్యాసయిన వాళ్లకు శుద్ధ ఆయుర్వేదంలో ప్రావీణ్యత సంపాదించి నట్టు సర్టిఫికెట్లు ఇస్తామని ప్రభుత్వంవారు ప్రకటించారు. అయితే ఈ సర్టిఫికెట్ల విలువల విషయంలోనే పేచీ ఉంది. ఈ ఆందోళన ఇంకా మరింత తీవ్రరూపం దాల్చకముందే, సామరస్యంగా ఓ ఒప్పందానికి రావటం వాంఛనీయం.

ఇక్కడున్న సమస్యలు చాలవన్నట్లు, ఉత్తర హిందూదేశం నుంచి కొంతమంది ప్రముఖులు సరికొత్త సమస్యను తీసుకువచ్చారు. ఇంగ్లీషును దేశాన్నుంచి తరిమెయ్యాలిట. ఇంగ్లీషువాళ్ల నయితే తరిమేశాం గాని, ఇంగ్లీషును తరిమెయ్యటం ఎట్లా! ఆ రోజుల్లో వర్తకానికని మన దేశంలో అడుగు పెట్టారు. అప్పటి ప్రభువులు ఉదార స్వభావంతో రమ్మనమని ఆహ్వానించారు. వర్తకం వర్తకం అంటూనే పెద్ద వ్యాపారమే చేశారు చివరికి! చాలా భేషుగ్గా ఉందిలే, ఇక మీరు మీ దేశానికి తరలి వెళ్లిపొండి, మీరు చేసిన వ్యాపారం చాల్లే అన్నాం. మూటా ముల్లే సద్దుకుని వాళ్ల దోవన వాళ్లు వెళ్లిపోయారు. వాళ్లు వెళ్లిపోతే యేం, వాళ్ల వేషభాషలు మన మొక్కడ మరచిపోయాం! ఇంగ్లీషు వాళ్లు అధిపతులై ఉన్న రోజుల్లో ప్రవేశపెట్టిన వాటిలో మంచివాటిని మనం గ్రహించుకోలేదు. ఇంగ్లీషుభాష బానిసత్వానికి చిహ్నమెట్లా అవుతుంది. భావదాస్యం అంటూ విన్నాం గాని, భాషాదాస్యం కొత్తమాటే! 'అంగ్రేజీ హటావ్, తెలుగూ లావ్' అని అరిచినంతమాత్రాన ఇంగ్లీషు యొక్క ప్రాశస్త్యానికి ముప్పేమీ రాదు. దాని విలువేమీ తగ్గదు. అంతర్జాతీయ భాషైన ఇంగ్లీషును అభ్యసిస్తే కలిగే లాభాలేమిటో విస్మరించరాదు. అయితే మన పాఠశాలల్లోనూ, కళాశాలలోనూ ఆ భాషను ఏవిధంగా నేర్పించాలి? మాతృభాషల అభివృద్ధికి అడ్డు తగులకుండా ఎంతవరకు సర్దుబాటు కావాలి అనే విషయం ఆలోచించి, ఓ నిర్దుష్టమైన విద్యావిధానాన్ని రూపొందించాలి. అంతేగాని ఇంగ్లీషును తీసెయ్యాలని ఉద్యమం లేవదీయటము చాలా అనుచితం. మన దేశాన్ని ఎదుర్కొంటున్న క్లిష్ట సమస్యలపట్ల ఈ ఉద్యమ కర్తలు తమ శక్తి సామర్థ్యాలను మరలిస్తే, తమకు తాముగానూ, దేశానికి ఎంతో సేవచేసినవారవుతారు.

ఏదైనా విపరీతమే! అసలు ఇంగ్లీషే వద్దని ఓవైపు ఆందోళన జరుగుతుంటే, అవసరంలేని చోట ఇంగ్లీషులోనే ప్రసంగించటం. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, మూడవ సంపుటి ఆవిష్కరణోత్సవం జరిగింది. ఆ సంస్థ తరఫున సభికులను ఆహ్వానిస్తూ శ్రీ పి. వి. జి. రాజాగారు (ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు) ఇంగ్లీషుతో అనర్గళంగా ప్రసంగించారు. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు అయితే సంపుటాన్ని ఆవిష్కరిస్తూ తెలుగులోనే ఉపన్యాసం చేశారు. ప్రతిదానికి ముఖ్యమంత్రే రావాలి అనే మనస్తత్వం మీద దాడిచేస్తూ "ఇలాంటి ఉత్సవాలకు ఏ ప్రఖ్యాత కవిగారినో, సాహిత్యాచార్యునో ఆహ్వానిస్తే బాగుంటుంది గాని, తమబోటివారిని ఆవిష్కరించమనటం సమంజసంగా లేదు. ముఖ్యమంత్రిగారు ప్రతి విషయంమీద మాట్లాడగలరని అనుకోవటం కూడా పొరపాటే" అన్నారు. దీంట్లో అసత్యమేముంది! నిజమే! అయితే ఆ సభకు విచ్చేసిన ఆస్థానకవిగారి ఆశీస్సు పూర్తిగా వినకముందే సగంలోనే ముఖ్యమంత్రిగారు హఠాత్తుగా సభనుంచి లేచి వెళ్లిపోయారు. కారణం కోపం వచ్చి కాదు. పక్కనే సరోజినీదేవి హాలులో అఖిల భారతీయ గాంధర్వ మహా విద్యాలయ స్నాతకోత్సవంలో పాల్గొనటానికి. ఇది సాహిత్యానికి సంబంధించినది కాదు. సంగీతానికి సంబంధించినది. ★



'రాజకీయాలలో స్త్రీలపాత్ర' వ్యాస రచనా పోటీలో రెండవ బహుమతి పొందిన శ్రీమతి పవని నిర్మల ప్రభావతి వీరి గ్రామం మొగలిచెర్ల. భర్తతోపాటు గ్రామీణ సేవా కార్యక్రమాలలో పాల్గొనడం కుటుంబ నిర్వహణ, తీరిక సమయాల్లో పత్రికలకు వ్యాసాలూ, కథలు రాయడం చేస్తూంటారు. ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె కలరు.

★

దీపావళి కథల పోటీలో "అనుబంధం" కథకు రెండవ బహుమతి పొందిన రచయిత శ్రీ కె. ఆర్. కె. మోహన్ (మచిలీపట్నం) వీరు ప్రస్తుతం తపాలా శాఖలో ఉద్యోగం చేస్తున్నారు.



# ప్రగతిప్రధాన ప్రజాస్వామ్యం

డా॥ ఎం. చెన్నారెడ్డి

(ప్రణాళికలు, పంచాయతీశాఖల మంత్రి ఆంధ్రప్రదేశ్)

ఈ మధ్య వార్తాపత్రికలో ఒక ఆంగ్ల మేధావి ఇలా వ్రాశారు మనకు ఇష్టమైనది లేనపుడు ఉన్నదానికే ఇష్టపడాలని. ఈ అభిప్రాయం అన్ని సందర్భాల్లోను వర్తించదు. కొన్ని సూత్రాలలో ఈ విషయం సత్ఫలితాలనే ఇచ్చినా, మరికొన్నింటిలో అభివృద్ధిని కుంటుపరచి, హానికరం కూడా కావచ్చు. మనదేశం విషయమే తీసికొందాం. 15 సంవత్సరాలకు పూర్వం మనం స్వతంత్రులంగాము. ఇష్టమున్నా లేకపోయినా శతాబ్దాలుగా పరదేశ పాలనలో ఉన్నాం. ప్రజాస్వామ్య పరిమళం ప్రపంచంలో ప్రాకినకొద్దీ ఆఘ్రాణం చాలనేకాంక్ష అస్వతంత్ర దేశాలలో కూడ కల్గింది. మనదేశంలో కూడ దాస్య శృఖలాల నుండి బయటపడాలన్న భావానికి బలం చేకూరింది. అలాంటప్పుడు పై సూత్రానికే ప్రాధాన్యమిస్తే ఈనాడు మనం స్వాతంత్ర్యాన్ని అనుభవించేవాళ్లం కాదు.

స్వాతంత్ర్యం వచ్చాకనైనా ఆంగ్ల మేధావి వాక్యం మనదేశంలో అంతగా వర్తించదేమో. అప్పుడు దేశం ఆర్థికంగాను, సాంస్కృతికంగాను ఎంతో వెనుక బడివుంది. మానవునికి కావలసిన ప్రాథమిక అవసరాలు కూడా అందుబాటులో లేవు. అంత మాత్రంచేత, ఉన్నదానితోనే తృప్తి పడాలన్నభావం జాతి ప్రగతికే అవరోధం కాగలదు. దేశంలోని వనరుల నన్నింటినీ ప్రణాళికాబద్ధంగా, ప్రాధాన్యత ననుబట్టి వినియోగపరుస్తూ, ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచాలనే దృష్టితో 1951 లో మన తొలి పంచవర్ష ప్రణాళికను ప్రారంభించాం. కార్యక్రమాలు అమలు జరుగుతున్నకొద్దీ అనుభవాన్ని గడించాం. వటవృక్షంలా ప్రజాస్వామ్యపు వ్రేళ్లు దేశం నలుమూలలా వ్యాపించాలన్నది మన కోర్కె. దేశంలో ప్రతి పౌరుడూ ఏదో ఒకవిధంగా అభివృద్ధిలో భాగస్వామినన్నభావం కల్గినపుడు మనం వివిధ రంగాలలో పెట్టుకొన్న లక్ష్యాలను వేగంగా చేరగలం అనే సత్యాన్ని కూడా గుర్తించాం.

1952 లో ప్రారంభమైన మన జాతీయ వికాస, సమాజాభివృద్ధి కార్యక్రమాలు ఈ ఆశయంతోనే ప్రారంభమయ్యాయి. మన సమాజాభివృద్ధి కార్యక్రమాలు ఎంతో ప్రోత్సాహాన్ని కల్పించి ప్రజలలో చైతన్యం కలుగజేశాయి. ఏ రాష్ట్రానికారాష్ట్రం స్వయంపోషకమై, తన సంస్కృతిని వెదజల్లినపుడు రాష్ట్రాల సముదాయమైన దేశం అన్నివిధాల ముందుకుపోతుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం తన ధర్మాన్ని ఎల్లప్పుడు నెరవేరుస్తూనేవుంది. తన అవసరాలను, ఆశయాలను దేశపు సమగ్రదృష్టితోనే అమలు జరుపుతోంది. సమాజాభివృద్ధిలో కూడ మనదే ముందడుగు. అధికార వికేంద్రీకరణ విధానాన్ని ఇతర రాష్ట్రాలకన్న ముందు ఆచరణలో పెట్టగల్గాం. గత ప్రణాళికలలో "వ్యవసాయం, పశుపోషణ, సమాజాభివృద్ధి కార్యక్రమాలలోని మన విజయాలు అఖిల భారత ప్రశంసనే పొందాయి.

1959—60 నాటికి రాష్ట్రంలో 26.91 మిలియన్ల ఎకరాల భూమి పంటక్రిందకి లబడినట్లు తేలింది. మరో 14.61 మిలియన్ల ఎకరాలు అడవులక్రింద ఉంది. అంటే రాష్ట్ర వైశాల్యంలో 39.8 శాతం పంటభూములక్రింద, 21.7 శాతం అడవులక్రింద ఉందన్నమాట. రాష్ట్రంలోని పశుసంపద 1956 లో 29.51 మిలియన్లనుండి 1961 నాటికి 32.64 మిలియన్లకు పెరిగింది. 10.6 శాతం ఈ 5 సంవత్సరాలలోనూ పెరిగింది. 1955—56 నుండి 1959—60 కాలంలో సగటు ఉత్పత్తినిబట్టి రాష్ట్రంలోని వివిధ ధాన్యాల ఉత్పత్తి దేశపు ఉత్పత్తిలో 9.9 శాతం ఉంది. ప్రణాళికా కాలంలో విద్యుదుత్పాదనశక్తి రెటింపుకుపైగా పెరిగింది. 1955—56 కంటె 1960లో ఉత్పత్తయిన విద్యుచ్ఛక్తి 466 శాతం ఉంది. పొరుగు రాష్ట్రాలతో పోల్చిచూచినా కిలోవాటు స్థాపిత యంత్ర శక్తికి సంవత్సరంలో ఉత్పత్తయ్యే యూనిట్లసంఖ్య మన రాష్ట్రంలోనే అధికంగాఉంది.

మనరాష్ట్రంలో 1961—62లో విద్యుత్ వినిమయశాతం 50 కు పెరిగింది. ఇక యుద్ధానంతర పథకాలలోని కిలోవాటు స్థాపిత యంత్రశక్తి ఖర్చు చూసినా, ఇతర రాష్ట్రాలలో కంటే మన రాష్ట్రంలో హెచ్చుగాలేదు. చివరకు ఒక మైలుకు విద్యుచ్ఛక్తి లైనులకయ్యే ఖర్చు చూసినా మద్రాసుకు, మన రాష్ట్రానికి తేడా పెద్దగా లేదు. ఈ సందర్భంలో ఒక విషయంమాత్రం గమనించాలి. గ్రామీణ విద్యుత్తు సరఫరా కార్యక్రమాన్ని మద్రాసురాష్ట్రం మనకంటె ఎన్నో సంవత్సరాల ముందునుండి అమలు జరుపుతోంది.

పరిశ్రమలకు వినియోగింపబడిన విద్యుచ్ఛక్తి 1956 కంటె 1960 లో నాల్గు రెట్లకుపైగా ఉంది. 1960—61 నాటికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడిన గ్రామాలసంఖ్య 700 నుండి 3206 కు పెరిగింది.

రవాణా రాకపోకల విషయంలో పేర్కొనదగ్గ అభివృద్ధి సాధింపబడిందనే చెప్పాలి. 1956 లో ఉన్న రవాణా బండ్లసంఖ్య 20,232 నుండి 1960 నాటికి 46,001 అయింది. పోస్టాఫీసులసంఖ్య 6,083 నుండి 9,142 కు పెరిగింది. ఇదేకాలంలో టెలిఫోను కనక్షన్లు 9,630 నుండి 17,127కు పెరిగాయి.

1956 లో రాష్ట్రంలో ఫ్యాక్టరీచట్టం క్రిందికివచ్చే పారిశ్రామిక సంస్థలు 2985 ఉన్నాయి 1959 అంతానికి వీటిసంఖ్య 5,341 కు హెచ్చింది. వీటిలో పనిచేసే కార్మికుల సంఖ్య 1.30 లక్షలనుండి 1.79 లక్షలకు పెరిగింది.

విద్యా, వైద్య రంగాలలో కృషి తగినంతగా జరిగింది. 1955—56 నుండి 1959—60 మధ్యకాలంలో ప్రాథమిక పాఠశాలలు 29,076 నుండి 32,556 కు, మాధ్యమిక పాఠశాలలు 329 నుండి 817 కు, హైస్కూళ్లసంఖ్య 733 నుండి 1,082 కు పెరిగింది. 1959—60 నాటికి రాష్ట్రంలో 264 పట్టణ ఆసుపత్రులు 730 గ్రామీణ ఆసుపత్రులు, డిస్పెన్సరీలు పని చేస్తున్నాయి. వీటిలోని పడకలసంఖ్య 19,411. డాక్టర్లసంఖ్య 1955—56 లో 923 నుండి 1959—60 నాటికి 1,500 కు పెరిగింది.

అన్నిటికన్న మన రాష్ట్రంలో పేర్కొనదగింది సమాజాభివృద్ధి కార్యక్రమం. ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విధానం చట్టబద్ధంగా 1959 నవంబరులో ప్రవేశపెట్టబడింది. వివిధ దశలలో ప్రజలకు ప్రాతినిధ్యం కల్పించేటందుకు జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులు, గ్రామ పంచాయతీలు ఏర్పాటు చేయబడ్డాయి. 1963 అక్టోబరునాటికి రాష్ట్రమంతా సమాజాభివృద్ధి కార్యక్రమం క్రిందికి తేబడుతుంది. ఇంతేగాదు. మన ప్రజాస్వామ్యానికి మరింత బలం చేకూర్చేటందుకు రాష్ట్రంలో గ్రామ సభలు కూడ ఏర్పాటవుతాయి. గ్రామంలోని వయోజన ఓటర్లంతా గ్రామసభ సభ్యులుగాఉండి, పంచాయతీ కార్యక్రమాలకు మార్గదర్శకులుగాఉంటారు. లోక్ సభనుండి గ్రామసభవరకు సమన్వయం కల్పించబడి పరిపాలనలో ప్రజలు పాల్గొనేటందుకు అవకాశం కల్పింపబడింది. రెండవ ప్రణాళిక ముగిసేనాటికి రాష్ట్రంలో మొత్తం 326 అభివృద్ధి కేంద్రాలు పని చేస్తున్నాయి. వీటిలో 4 గిరిజన ప్రాంతాలలోని బహూళార్థ సాధక కేంద్రాలు, 5 సమాజాభివృద్ధి కేంద్రాలు, 82 రెండవదశ కేంద్రాలు, 192 మొదటిదశ కేంద్రాలు, 43 పూర్వాభివృద్ధి కేంద్రాలు ఉన్నాయి. ఇవి 73,570 చ. మై. విస్తీర్ణంలో 20,901 గ్రామాలలోని 206 లక్షలమంది ప్రజలకు వర్తిస్తున్నాయి. అంటే రెండవ ప్రణాళిక అంతానికి రాష్ట్రం మొత్తం వైశాల్యంలో 69.4 శాతం ఈ కార్యక్రమాల క్రిందకి తేబడ్డాయన్నమాట.

భారత రాజ్యాంగంలో నిర్వచించిన రీతిగా గ్రామాలను పటిష్టంచేసేటందుకు అన్ని చర్యలు తీసికొనబడుతున్నాయి. ఈనాడు అన్ని రాష్ట్రాలలోని పరిపాలనా విధానం దాదాపు ఒకే రీతికి తేబడుతోంది. ఇందువల్ల పరిపాలనలో సౌలభ్యం చేకూరడమేగాక, జాతీయసమైక్యతకు ఎంతో దోహదం చేకూరుతుంది. ముందడుగు వేసిన మనరాష్ట్ర ప్రజలు పంచాయతీ రాజ్య విధానాన్ని దిగ్విజయంచేసి, ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకులు కాగలరని ఆశిస్తాను. ★



# పంచాయతీ రాజ్యం ద్వారా

★★ రాజకీయ స్వాతంత్ర్యం, వయోజనులకు వోటు చేసే హక్కు - ప్రజాస్వామిక జీవన విధానం - ఇది ఒక త్రివేణి సంగమం. అదే పంచాయతీ రాజ్యం.

★★ సమాజ వికాసోద్యమం ద్వారా ఆర్థిక ప్రగతి సాధనకు వివిధ రంగాలలో కృషి జరుగుతున్నది. ఈ ఉద్యమానికి బలం చేకూర్చేది గ్రామ పంచాయతీయే.

★★ గ్రామ సీమలలో పరిశుభ్రత, ఆరోగ్యకరమైన జీవితం, అభివృద్ధి మన లక్ష్యాలు. అందుకు మన సాధనాలు పరిశ్రమ, స్వయం సహాయం, పరస్పర సహకారం.

# సమాజ వికాసం

సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్ర ప్రదేశ్





# బురఖా

8 వ పేజీ తరువాయి

వర్షం చప్పునఆగిపోయింది. సంధ్య ఫుట్‌పాత్ ఎడ్జ్ కొచ్చింది. ఆకాశంలోకి చూసింది. మేఘాలు కొల్లపోతలుగా, దట్టంగా, నల్లగా ఘనీభవించి ఉన్నాయ్! వాటిమీద దూదిపింజల్లా పల్చని మబ్బు తునకలు వాయువేగానికి ఉరకలు, పరువులు పెడుతున్నాయ్! సంధ్య రోడ్డుమీద కొచ్చింది. రెండడుగులు వేసింది. అంతలో 'జాంయ్' మన్న చప్పుడూ దాంతో పెద్ద వాన జల్లూ వచ్చిపడ్డది. ఆమె గబ—గబ అడుగులు వేసుకుంటూ తిరిగి ఆ దుకాణంలోకే చేరుకుంది. జల్లుపోయి కుండపోతగా వర్షిస్తున్నది. సంధ్యకు ఆరాటం ఎక్కువైంది. వర్షం వదిలే సూచనలు లేవు. అవతల స్కూలుకు టైమైపోతున్నది. అప్పటికే ఆ నెలలో రెండు 'లేటు' మార్కులు! ఇది మూడోది! అసలు తన కా టీచరు ఉద్యోగం అతుకుల బొంతగా ఉన్నది. ఉన్నవాళ్లలో తనొక్కతే మెట్రిక్ ఫెయిలైన టీచరు. మున్ముందు తనకే స్కూల్లోనూ స్థానం ఉండదు. చివరకు ఒ, న, మా లు నేర్పడానికి కూడా తన చదువు పనికిరాదు. ప్రభుత్వంనుంచి వస్తున్న ఆంక్షపత్రాలు వజ్రాయుధాల్లా కనిపిస్తున్నయ్! అలాంటప్పుడు నెలనెలా ఈ విధంగా లేట్లు చేస్తుంటే ఎలా?

వర్షాలారంభించకముందే సంధ్య గొడుగు కొన్నది. కొన్న వారంలోనే ట్రాంలో మర్చిపోయింది. మళ్లీ కొనుక్కోవడానికి తాహతులేకపోతున్నది. ఇంటి ఖర్చులకే చాలని జీతం! ఒక తమ్ముడున్నాడంటే సినిమా హాల్లో గేటుకీపరు. నెలకు ఇరవై రూపాయిల కన్నా వాడు ఎక్కువ ఇవ్వలేకపోతున్నాడు. మరో తమ్ముడింకా చిన్నవాడు. కార్పొరేషను బడిలో ప్రయిమరీ చదువుతున్నాడు. జీతం కట్టక్కరలేదు. మిగిలింది తల్లి! అహర్నిశాదులూ ఆమె వాతరోగంతో మంచం దిగలేని స్థితిలోఉన్నది. తనకు వచ్చిన అరవై రూపాయిలు, తమ్ముడిచ్చిన ఇరవై, మొత్తం ఎనభై రూపాయలతో, ఆ కలకత్తా మహా నగరంలో నాలుగు తలకాయలకు కాలం గడవాలి! ఆఁ! ఈమధ్యనే ఒక ట్యూషను దొరికింది. దానిమీద ఇరవై వస్తుంది!

వర్షం తగ్గలేదు. తగ్గే సూచనలూ లేవు. వస్తూ పోతున్న ట్రాంబండ్లు పొగరేగిన ఆ వర్షంలో మసక మసగ్గా కనిపిస్తున్నాయ్! ఎలాగో వెళ్ళి ఒక ట్రాం అందుకుంటే బావుణ్ణు అనుకుంది. కాని, ఆ వెళ్లడమనేదే ఎలా? సాహసించినా లాభంలేదు. తడిసి ముద్దయిపోవడంతప్ప వేరే గతిలేదు. కాగా, ఆ తడి బట్టలతో రోజంతాఉంటే ఏం ముంచుకొస్తుందో? అలా ఏదైనా ముంచుకొస్తే అవతల ఉద్యోగమూ మునిగిపోతుంది! దాంతో జీవితం కూడా! "రాకూడదూ? ట్రాం దాకా దిగబెడ్తా!" అన్నమాట ఆమె చెవిలో పడ్డది.

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగింది. చటుక్కున వెనక్కు తిరిగి చూసింది. వాడే!......ఆ వెధవాయ్!.......ఆవారా గాడు! ఆ టీ దుకాణం వద్ద రాత్రీ, పగలూ చస్తూ ఉంటాడు. బీడీలు తాగ తాలుస్తూ, కీర్తీలు నములుస్తూ, చవకబారు సినిమా

ల్లోని అసభ్యపు పాటలు పాడుతూ, స్కూలుకు పోతున్న ఆడపిల్లల్ని సతాయించుకు తింటుంటాడు! తను చేసిన మహా కార్యాలకు మురిసిపోతుంటాడు! ఇదివరకైతే పిచ్చి పిచ్చి వేషాలు వేస్తూ, సమయమూ, స్థలమూ చూసుకొని, ఆ ఆడపిల్లలకి యమయాతనలు కలిగిస్తుండేవాడు. ఒకసారి అలాటి పరిస్థితిలో ఒక పోలీసు సార్జెంటు దృష్టిలో పడేసరికి చావుతప్పి, కన్ను లొట్టపోయినట్టు దుమ్ములు విరగగొట్టించుకొని రెండు మాసాలు మంచం వేశాడు! తరవాత ఆ అలవాటు మానుకున్నాడు.

సర్వదా నేమిస్తున్న జర్దా తాంబూలంవల్ల కారెక్కిపోయిన దంతాల్ని బయటపెట్టి, ఇకిలిస్తూ, "నా దగ్గిర గొడుగుంది—పద" అన్నాడు. సంధ్యకు ఒళ్లు మండుకొచ్చింది. దవడ వాచిపోయేలా స్లిప్పరుతో ఒకటి తగిలిద్దామా అనుకుంది. కాని—వెంటనే ఆలోచించింది—'రౌడీ వెధవ! ఎంతకైనా తెగిస్తాడు. ప్రతి రాత్రి తొమ్మిదీ, తొమ్మిదిన్నర ప్రాంతంలో, ఆ మసక దీపాల మధ్యనుంచి ఇంటికి పోతుండాలి! పగ పెట్టుకొని, ఏ క్షణాన ఏదేనా అఘాయిత్యం తల పెడితే?' అనుకున్నది. కోపాన్ని తమాయించుకొని, రూక్షంగా చూసి, "అవసరంలేదు" అన్నది. సిగ్గూ, బిడియం లేని నవ్వుతో, "ఇస్కూలికి ఎళ్తాం పోతున్నాది కావాల......పద!" అన్నాడు మళ్లీ. సంధ్యకు కోపం నసాళానికి అంటుకుపోయింది. పండ్లు బిగించి "నోరు మూసుకుంటావా, లేక పోలీసుల్ని పిలవమంటావా?" అన్నది. అది విని, వాడు, సినీ మాల్లో విలనులా ఎడమకన్ను వంకరచేసి, బొమ ఎగరవేసి, సన్నగా ఈలకొట్టుకుంటూ, గొడుగు వేసుకొని ఎటో పోయాడు. కాసేపట్లో వర్షంకూడా తగ్గిపోయింది.

స్కూలునుంచి సంధ్య ఇంటికి చేరుకొనేసరికి పొయంత్రం అయ్యింది. ఆవేళ ప్రధానోపాధ్యాయిని తల వాచేలా చివాట్లు వేసింది— "ఏం సంధ్యా? ఇది స్కూలుఅనుకున్నావా, లేక ఆటకొట్టనుకున్నావా? నీకు గొడుగు లేకపోతే ఈ వర్షాకాలం నాలుగు నెలలూ స్కూలు మూసివేయమనా నీ ఉద్దేశం? ఇలా లేట్లు చేసుకొచ్చునేదానికన్నా శాశ్వతంగా శలవు తీసుకోవడం మంచిది—" ఇంకా ఏమేమో అన్నది. తత్పూర్వం ఆ రౌడీ వెధవ కూతలు! సంధ్య నిప్పుల్లో పొర్లాడినట్టు బాధ పడ్డది!

ఇంటికి వస్తుండగా, సరిగ్గా రోడ్డు మలుపు తిరిగి, ఆ టీ దుకాణం సమీపించేసరికి— హవామే ఉడతాజాయ్......లాల్ దుపట్టా మల్ మల్ కా—' పాట చరణం ఆమె చెవుల్లో పడ్డది! అదే స్వరం! వాడిదే! ఆ రౌడీ వెధవదే!

సంధ్య అనుకోకుండా అటువేపు చూసింది. ఒక చేతిలో టీ కప్పూ, ఇంకో చేతిలో కాల్తున్న బీడీ! కుత్సితంగా నవ్వుతూ, ఎడమకన్ను వికారంగా మూసి, "హవామే......ఉడతాజాయ్ —"అన్నాడు. ముమ్మరంగా వస్తున్న కోపాన్నీ, దుఃఖాన్నీ బలవంతంగా మింగుకొని, తడిసి ముద్దయిపోయిన స్లిప్పర్లు ఈడ్చుకుంటూ, గబగబ నడిచి ఆమె ఇంటికి చేరుకున్నది. ద్వారం దగ్గిర ఆమె పెద్ద తమ్ముడు—విజయుడు చెప్పులువేసుకొని బయటకు పోవడానికి తయారవుతున్నాడు.

"విజయా!"

గడప దిగుతూ, విజయుడు నిల్చుండిపోయి సంధ్యవేపు చూశాడు.

"మాట!" అన్న దామె.

"ఏమిటి అక్కా?" ప్రశ్నించాడు విజయుడు.

"ఆ టీ దుకాణంలోని ఆ పోకిరీ వెధవనుంచి ప్రాణాలు కడగట్టుకుపోతున్నాయిరా! తొందరగా రావడం గండమైపోతున్నది. ఏదో బందోబస్తు చేస్తేనే కాని"—

"ఎవడు ?.... ఆ ముఖేను సంగతేనా ?.... వాడో పక్కా గుండా వెధవే అక్కా !"

"ఐతే ఏ మైందిరా ?"

"సరే ! చూద్దాం !.... కానీ వాడిసంగతి నీకు తెలీదు. వాడొక్కడే అనుకుంటున్నావేమో ? అదంతా ఒక ముఠా. వాడు దానికి సర్దారు. ఈవాడు పెత్తన మంతా వాడిదే ! అందరకూ వాడంటే హడల్ ! ఇక మనం ఉన్నామంటే—యీ వీధికి కొత్త !

---

రైలుపట్టామీద పడుకున్న నేరానికి ఒక వ్యక్తిని అరెస్టు చేశారు. "ఎందుకు ఆత్మహత్య చేసుకుందా మనుకున్నావ్?" అడిగాడు మాజిస్ట్రేటు.

"లేదు బాబూ! రైలు రెండు గంట లాలస్యంగా వస్తుందికదా! కాసేపు విశ్రాంతికోసం అలా పడుకున్నా"నన్నాడు అతగాడు.

---

చవకబారు అద్దెకొంపలు యిలాటి వీధుల్లోనే దొరుకుతయ్ !.... వీడన్నా, వీటిముఠా అన్నా పోలీసులకుకూడా పక్కా బెదురు ! ఏ చీకట్లోనో, సమయంచూసి, మొదలంటా వీపులో బాకు దించేస్తే— ఎవడు దిక్కు ?"

"ఐతే—వీళ్లాడే ఆటా, పాడే పాటా సాగాల్సిందే అన్నమాట ? వీళ్లను పాతమార్చే చట్టమూ, చట్టుబండలూ లేవేలేవా ?"

"హుఁ ! చట్టాల్ని చేతుల్లో పెట్టుకునే ఈ గుండా వెధవలు చెలరేగుతున్నారు !"

"కమీషనరుకు అర్జీ దాఖలు చేస్తే ?"

"అమ్మో ? ఆ అర్జీ మనమీదకే విర్చుకు పడుతుంది !.... తేనెపట్టు కదిపితే ఏ మవుతుందో తెలుసా ? పేరుకు ఒకర్నో, యిద్దర్నో పట్టుకుంటారు ! శిక్షిస్తారు ! కాని మిగిలినవాళ్లు ?.... ఊరుకుంటారా ? నడుంలో బిగించిన బాకులు తీసి, పొసరాళ్లమీద పడునెక్కిస్తారు ! అదను చూసి గుండెల్లో దించేస్తారు ! మనలాటివాళ్లం వీళ్లనేమీ చెయ్యలేం !.... కళ్లూ చెవులూ మూసుకొని మనకెందుకన్నట్టు ఊరుకుంటూ కాలం గడపాల్సిందే !" అని విజయుడు బయటకు పోయాడు.

'పిరికి దద్దమ్మ' అనుకుంటూ సంధ్య నిట్టూర్చి ఇంట్లోకి వెళ్లిపోయింది. పాపం ! మనసులో వ్యథ మనసులో వెళ్లగక్కుకోవడానికికూడా ఆమెకు తీరికలేదు. ఆరింటికల్లా వంటచేసి, చిన్నతమ్ముడికీ తల్లికీ వడ్డించి, తరువాత పనిపాట్లు చక్కబెట్టుకొని ఏడింటికల్లా ట్యూషను చెప్పడానికి వెళ్లాలి ! ఇద్దరమ్మాయిలకు ఏడునుంచి ఎనిమిదిన్నర వరకు ట్యూషను ఉన్నది. దాని మూలంగా నెలకు యిరవై రూపాయలు ముడుతున్నది.

సంధ్య ఏడింటికల్లా బయలుదేరింది. ఆ వేళ ఆలస్యమైపోయింది. విసవిస నడుచుకుంటూ పోసాగింది. రోడ్డుమలుపులో టీ దుకాణంలో ముఖేన్ను చూసింది. వాడు తనవేపే— రెప్పార్పకుండా చూస్తున్నాడు. దుకాణం సమీపించేసరికి "గోరీ.. గోరీ..ఓ బాంకీ ఛోరీ" అని ఒక చరణం విసిరాడు.

సంధ్య చటుక్కున నిల్చుండిపోయింది. ఆమెకు శరీరమంతా నిప్పి కారం రాసుకున్నట్టయింది !... 'ఈ వీధిలో సభ్యత తెలిసినవాడెవడూ లేడా ? అంతా యిదే రకమా ? ఈ పాడు కొంపలమధ్య, ఈ టిన్ను షెడ్ల పరిసరాల్లో — ఈ గతుకు రోడ్లపక్క 'శిష్టాచారం'— 'సభ్యత' — అనే పదాలు ఇగిరిపోయాయా ? లేక — ఈ చెత్తా, చెదారం, మన్నూ మశానంలో అవి కూరుకు పోయాయా ?.... కాక — ఈ మురికీ, కంపూ కాలవల్లో కొట్టుకు పోయాయా ? ఇదేనా ఏమిటి కలకత్తా మహానగరం ? ఆసియా ఖండంలో ఎక్కువ జనాభాఉన్న మహాపట్నాల్లో రెండోది ఇదేనా ? 'భవనాల నగరం'—అన్న ఘనమైన పేరు దీనికేనా ప్రదానం చేశారు ?.... వెధవకు— చెప్పుతీసి, చెడామడా వాయించేస్తే— మర్నాటికి బుద్ధివచ్చి ఉన్ను ! కాని— తమ్ముడన్నట్టు.... ఐనా— గొంగట్లో తింటూ వెంట్రుకలున్నాయని అనస్యూ పడ్డం దేనికి ? ఉన్నంత కాలం ఇదే రాకపోకలకు తోవా తెన్నూన్ను !.... ట్యూషన్నుంచి తిరిగి వచ్చేసరికి రాత్రిపడిపోతూంటుంది! ఏ సైమూలోగాని వెనకమారున వచ్చి .... వెధవది — ప్రాణంపోతే పోయింది.... కాని— మరేదైనా అఘాయిత్యం—

సంధ్య గజగజలాడిపోయింది ! తలవంచుకొని చరచరా వెళ్లిపోయింది !

* * *

పిల్లల్ని చదివిస్తున్నదన్నమాటేగాని— సంధ్య దృష్టి అక్కడలేదు. రాత్రవుతున్నకొద్దీ ఆమె మనసు డోలాందోళితమై పోతున్నది. ఆ రోడ్డు.... మలుపులో టీ దుకాణం.... బెంచిమీద ఆ గుండా ముఖేను... వాడి మాటలూ, పాటలూ, చేష్టలూ, ఆమె ఎదట భయంకరంగా తాండవిస్తున్నయ్ !

ఎనిమిదిన్నరయినా కాలేదు. ఇంకా పదినిమిషాలు బాకీ ఉన్నాయ్! ఆమె లేచి నిల్చుంది. వరండాలోకి తొంగి చూసింది. హిరణ్మయుబాబు పోర్టికోలో నిల్చొని కారెక్కడానికి సిద్ధపడుతున్నాడు. ఆమె మెట్లు దిగి విస—విస నడుస్తూ పదడుగుల

## బురఖా

వేసిందో లేదో హిరణ్మయబాబు "వెళ్తున్నా రేమిటి మిస్ సంధ్యా ?" అని ప్రశ్నించాడు.

"ఆఁ !.... ఇవ్వాళ నేను—" పేలవంగా సంధ్య జవాబిస్తుండేలోగా

"నేనూ మీ రోడ్డువైపే రావల్సిఉంది. అభ్యంతరం లేకపోతే కారులో కూచోండి. దిగవిడుస్తా"

సంధ్య సంశయంతో "కాని—మీకు శ్రమ" అని ఊరుకున్నది.

"శ్రమగాలేదు— రండి !" అని తలుపు తెరచాడు.

సంధ్య వెనక సీట్లో కూచుంది. హిరణ్మయబాబు కారు నడుపుతున్నాడు. ఐదు నిముషాలైంది. ఎవరూ మాటాడలేదు. తరువాత నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ "అమ్మాయిలెలా చదువుతున్నారు ?" అని హిరణ్మయబాబు ప్రశ్నించాడు.

"బాగానే చదువుతున్నారు" మెల్లిగా జవాబిచ్చింది సంధ్య.

"ఈ ఏడాది ప్యాసవుతారా ?"

"ఓ.... అవశ్యంగా !"

"అదేమిటో.... ఆటల్లో చూపిన శ్రద్ధ చదువులో చూపించరు. మీరు చెప్పిన ఆ గంటకాలం ఏదంటే ఉన్నదో అంతే ! ఆ బడిలో ఏం చేస్తారో ? ఆఁ.... బుద్ధి పుడితే అప్పటప్పటా యింటిదగ్గర ఓ గంట పట్టుదలగా చదువుతారు."

"సామాన్యంగా లేలివైనవాళ్ళు అలాగే చేస్తారు" చెప్పింది శ్రద్ధగా విని ఆ తరువాత ఒక గంట చదివితే చాలు—"

కారు ఆ వీధి రోడ్డుకు వచ్చింది.

"ఇక్కడ నిలపండి! మా వీధి— యిరుకు సందు కారు పోదు" అన్నది సంధ్య.

"ఎంత దూరం నడవాలి ?" హిరణ్మయబాబు ప్రశ్నించాడు కారు ఆపుతూ—

"అబ్బే ! దగ్గరే !" కారు దిగుతూ సంధ్య జవాబిచ్చింది.

"అలాగైతే నేనూ వస్తాను పదండి. ఒకసారి మీ ఇల్లు చూడనివ్వండి. ఎప్పుడైనా అవసరమొస్తే వెదుక్కోవాల్సిన అవసరం ఉండదు" సంధ్య ఉట్టిపడేలా హిరణ్మయ బాబన్నాడు.

"మా ఇల్లు చూస్తారా ? మీలాంటివాళ్ళు రావల్సిన చోటు కాదది—" అన్నది సంధ్య తలవంచుకొని ఖిన్న స్వరంతో.

"ఏం ?......నేను మనిషిని కానా ?......మీలాటి వాళ్ళందులో ఉండొచ్చుగాని, నాలాటివాళ్ళో దాన్ని చూస్తే తప్పా ? పరవాలేదు. పదండి!"

సంధ్య జవాబివ్వలేదు. ఇద్దరూ కలిసి నడుస్తున్నారు. టీ దుకాణం దగ్గరకు వచ్చారు.

హిరణ్మయబాబు ఆజానుబాహు మనిషి! దానికి తగిన బలిష్ఠమైన శరీరం! గుండ్రంగా, కండరాలో నిండిన వెడల్పయిన ముఖం! పెద్ద పులిలా ఉంటాడు! బూట్లతో నడుస్తూంటే భూమి దద్దరిల్లిపోతూంటుంది!

ఆ ఇద్దరూ పక్కపక్కగా నడుస్తూ టీ దుకాణం ఎదట కొచ్చారు. ముత్తేన్ బెంచీమీద కూచొని బీడీ దమ్ము లాగుతున్నాడు. అటువేపు ఖమికోలకుల్లో

నుంచి సంధ్య చూసింది. ముఖేన్ బీడీ పారేసి రెప్ప వాల్చకుండా పీళ్లవేపు చూస్తున్నాడు. వాని నోటి నుంచి ఒక మాటగాని, పాటగాని, ఈలగాని, ఇకి లింపుగాని రాలేదు! హిరణ్మయబాబు బూట్ల ధ్వని నిశ్శబ్ద నిశీథంలో రాజసంగా వినిపిస్తూ, కొత్త వాతావరణాన్ని కల్పిస్తున్నది!

ముఖేన్ పిరికితనానికి సంధ్య లోలోపల నవ్వుకున్నది. 'వెధవ!......తనకన్నా మించిపోయిన వాళ్లను చూస్తే పిల్లి కూన అయిపోతాడన్నమాట?.......లేనట్టయితే పులి!.......హు!" అనుకున్నది.

సంధ్య ఇల్లు సమీపించింది. ఆమె వరండాలోకి ఎక్కింది. హిరణ్మయబాబు గేటులో ఉండిపోయాడు.

"ఇంట్లోకి రారూ?" సంధ్య ప్రశ్నించింది.

"ఇప్పుడుకాదు. ఇంకోసారి!........ఇల్లు చూశాను కదా?"

"చాల శ్రమ కలిగించాను. క్షమించండి"

"శ్రమా? ఏముందిలెండి? మీరు పైవారా ఏమిటి?.......వెళ్లోస్తా"

"నమస్తే"

"నమస్తే"

పదడుగులు వేసి హిరణ్మయబాబు వెనక్కు తిరిగి చూశాడు. సంధ్య అలా నిల్చొనే అతని వెళడ గమనిస్తూ ఉన్నది. అతనదోలా నవ్వి ముందుకు సాగిపోయాడు. సంధ్య అది చూడలేదు. ఇంట్లోకి వెళ్తూ, "మంచి పనే ఐంది. కూచోడానికి చోటే లేదు. ఒక గది. అటు అమ్మ మంచం! ఇటు పెట్టెల్లు! పెరటి వరండాలో వంట పాత్రలూ, పొయ్యీ, బొగ్గులూ, చెత్తా చెదారం! కాగా—కప్పు టీ ఇవ్వడానికి పాలూ, పంచదారా లేవు!" అనుకున్నది.

మర్నాడు సంధ్య స్కూలుకు బయలుదేరింది. టీ దుకాణం దగ్గర కొచ్చేసరికి ముఖేన్ ఆమెకు విని పించేలా ఎవరితోనో అంటున్నాడు—"ఇవ్వాళా, రేపూ బాడీగార్డులూ, ఫ్లీమతుకార్లూ, చెట్టా పట్టాలూ!... శేష్! శేష్!" అని, బన్ కీ చిడియా—బన్ బన్ డోలూరే అని పాడ నారంభించాడు.

ఆ మాటల్నీ, పాటల్నీ తనకు కాదన్నట్టు విని పించుకోకుండా సంధ్య గబగబ అడుగులు వేసుకుంటూ పోయింది.

* * *

రెండు రోజుల తరవాత మళ్ళీ వర్షంపడ్డది. సంధ్య ట్యూషనులో ఉన్నది. బయట వర్షం ధారాపాతంగా కురుస్తున్నది. తగ్గే సూచనలు లేవు. గంట తొమ్మిది దాటింది. ఆమె కంగారు పడుతున్నది.

హిరణ్మయబాబు భార్య ఇంట్లో లేదు. పెళ్లింటికి ఖిదర్పురంవెళ్లింది. వర్షాటంకంవల్ల కామోసు ఇంకా చేరుకోలేదు. హిరణ్మయబాబు డ్రాయింగ్ రూములో సోఫాలో కూచొని ఏదో లావుపాటి పుస్తకాన్ని చదువుతున్నాడు. ఆ డ్రాయింగురూముకూ, ట్యూషను చెబుతున్న గదికీ మధ్యఉన్న ద్వారం కర్టెను గాలికి అప్పటప్పటా కదులుతున్నది. దాని సందునుంచి హిరణ్మయబాబు పాదాలకున్న సల్ల రబ్బరు స్లిప్పర్లూ, వాటికి మీదుగాఉన్న తెల్లని బిగుతు పైజమా కని పిస్తున్నవి. ఆ దృశ్యాన్ని సంధ్య గమనిస్తూ, కిటికీ నుంచి బయటకు తొంగిచూస్తూ, వర్షం ఎప్పు డాగిపోతుందా అని నిముషాలు లెక్కిస్తున్నది.

తెరదా కదిలింది! హిరణ్మయబాబు గదిలోకి వచ్చాడు. "తొమ్మిదైపోయింది మిస్ సంధ్యా! ఎలా వెళ్తారింటికి?" ప్రశ్నించాడు.

"అదే ఆలోచిస్తున్నాను—" అన్నది సంధ్య.

కిటికీనుంచి ఆకాశంవేపు చూస్తూ "మేఘాలు దట్టంగా ఉన్నాయ్, ఇంతలో వర్షం తగ్గేటట్టు లేదు" అన్నాడు.

"కాను! ఐనా పరవాలేదులెండి! రెండడుగులు వేస్తే ట్రాం దొరుకుతుంది" అని సంధ్య లేచింది.

"ఎందుకూ?.......కార్లో దిగవిడుస్తా" అన్నాడు హిరణ్మయబాబు.

"ఉహూ!......రోజూ మీకు శ్రమ కలిగించడం" అన్నది సంధ్య.

"శ్రమ కేమున్నది? మీరేమో మా పిల్లల ట్యూషనులో చిక్కుపడిపోయారు. మిమ్మల్ని మీ ఇంటికి చేర్చడం—నా కర్తవ్యం!....... ఇప్పుడే వస్తా" నంటూ అతను డ్రాయింగ్‌రూములో చొరబడ్డాడు.

ఎందువల్లనో హిరణ్మయబాబు చూపుతున్న ఆప్యాయత సంధ్యకు ఇష్టపడలేదు. ద్వివిధమైన మనసుతో ఆమె స్థాణువులా నిల్చుండిపోయింది! కాని, అంతలో ఆమె మనోవీధిలో ఆ రౌడీ ముఖేన్ సాక్షాత్కరించాడు!......రాత్రిపూట!..... గాఢాంధకారం!......పైగా వర్షం! నిర్మానుష్యపు వీధి!...... టీ దుకాణం దాటుతూండగా......ఆ గుండా వెధవ.... వెనక నుంచి వచ్చి......? ఆమె గజగజలాడి పోయింది!

---

ఏమయ్యా ! నువ్వు పెద్ద కథలురాసి "నవలలనేస్తున్నావ్" అని దబాయించాడు ఒక 'క్రిటిక్' ఒక 'రైటర్'ని. నువ్వు తెనుగులో విమర్శకుడవైనవల్లే 'నవలం'టే తెనుగులో పెద్ద కథ అని అర్థంగా నన్నాడు రచయిత.

ప్రమీలారాణి

---

హిరణ్మయబాబు తయారై వచ్చాడు. పెద్ద వర్షపు—కోటు భుజంమీద వేసుకున్నాడు. గమ్ బూట్లు తొడుక్కున్నాడు! నోట్లో లావుపాటి 'హవానా' చుట్ట వెలుగుతున్నది!

"పదండి!" అన్నాడతను.

వరండా కంటేఉన్న మెట్ల సమీపంలో పోర్టికో దిగువ కారు ఉన్నది. ఇద్దరూ వెళ్ళి కారులో కూచు న్నారు. వర్షాన్ని చీల్చుకుంటూ తారు—రోడ్డుమీద 'సర్' మనే శబ్దం చేస్తూ కారు పోతున్నది. సంధ్య వెనక సీట్లో, అన్యమనస్కగా రోడ్డువేపు చూస్తు న్నది. ఆ ఇద్దరిలో ఎవరూ మాటాడలేదు.

రోడ్డు మలుపు దగ్గర కారు ఆపాడు, హిరణ్మయ బాబు. చటుక్కున తలుపు తీసి, సంధ్య బయటకు వచ్చి "శలవిప్పించండి! నమస్తే" అన్నది.

"అరే? ఒక్కరూ......ఈ చీకట్లో—వర్షంలో వెళ్లేదు. నే వొచ్చి దిగవిడుస్తా" అన్నాడు హిరణ్మయ బాబు.

"ఎక్కువ దూరం లేదు కదండీ......భయం లేదు" అన్నది సంధ్య.

హిరణ్మయబాబు కారునుంచి బయటకొచ్చి "ఛ... ఛ! అదెలా అవుతుంది?" అని, "అరే? గొడుగు మర్చిపోయాను. వర్షపు—కోటు ఒకటే ఉన్నది" అన్నాడు.

"ఏమైంది లెండి......మీరు కోటు వేసుకోండి! నే నిలా వస్తాను" అన్నది సంధ్య

"బాగు బాగు! మీరు తడుస్తారా? కోటు మీరే వేసుకోండి! నాకాట్టే బాధలేదు—" అంటూ కోటు అందించాడు.

"నన్నే తీసుకోమంటారా?" గత్యంతరంలేని స్వరంతో సంధ్య అన్నది కోటు అందుకుంటూ.

"ఆఁ!" దృఢస్వరంతో, హిరణ్మయబాబన్నాడు.

కారులో చిన్న బల్బు వెలుగుతున్నది. ఆ వెలుతురులో హిరణ్మయబాబు కండ్లు ఎర్రగా జ్వలించి పోతున్నాయ్!

భారంగాఉన్న కోటును సంధ్య భుజాలమీదుగా వేసుకొని శరీరం కప్పుకున్నది. ఆ కోటునుంచి హవానా చుట్ట పొగకంపూ, కూటికూరా పొడరు వాసనా, ఈవ్నింగ్—ఇన్—పారిస్ సెంటు గుబాళింపూ ఆమెను వికారపు మత్తులో ముంచుతున్నవి.

ఇద్దరూ నడుస్తున్నారు. రోడ్డు చివర దీపం కాంతి వర్షపు ప్రదేశాల్లో నిల్చిన నీళ్లమీద పడి, 'జిగేల్—జిగేల్' మనిపిస్తున్నది. పెద్ద పెద్ద చినుకులు ఆనీళ్ళలోపడి ప్రచలిత పరుస్తున్నవి! సంధ్య చటుక్కున నిల్చుండిపోయింది హిరణ్మయబాబువేపు చూసి. అతని తల పూర్తిగా తడిసిపోయింది! వెంట్రుకల చివరనుంచి నీళ్లు జారి ముఖమంతా కమ్ముకున్నవి. తన అవభ్యతకు లోలోన సిగ్గుపడి, మెల్లిగా "మీరు తడిసిపోతున్నారు. ఇలా కోటు లోపలకు రండి! ..... కోటు పెద్దది. ఇద్దర్నీ ఆపేయగలదు—" అన్నది.

"థాంక్స్!" అంటూ హిరణ్మయబాబు సంధ్య పక్కగా వచ్చి కోటు సర్దుకున్నాడు.

నాలుగడుగులు వేసేసరికి సంధ్యకు తప్పినంత పనైంది! హిరణ్మయబాబు బరువైన శరీరం ఆమెను రాసుకుపోతున్నది! ఒక పక్క సిగ్గూ, ఇంకోపక్క జంకుతో ఆమె కుంచుకుపోసాగింది! ఎందుకో గుండె దడ దడ మన్నది! ఒక్క ఉదుటుతో ఆ కోటునుంచి బయటపడి పరుగు పరుగున పారిపోదామా అనుకున్నది. కాని—మహా పర్వతంలా ఆ కోటు తనను అణచి దొక్కివేస్తున్నట్టు అనుభవించి కదలలేకపోయింది. ఇల్లు సమీపంలో ఉన్నప్పటికీ—ఎన్నో యోజనాల దూరం నడవాలి కామోసు అనుకుంటున్నది!

టీ దుకాణం ఎప్పుడు దాటిపోయిందో సంధ్యకు తెలియలేదు. ఆమెలో చైతన్యం ఉంటేగా తెలియడానికి?......ఉన్నట్లుండి ఆమె త్రుళ్లిపడ్డది! భయంకరమైన కొండ చిలువ తన నడుమును చుట్టుకొని బిగిస్తున్నట్టు ఆమె అనుభవించింది! గజగజలాడుతున్న చేతిని ఆ చుట్టమీద వేసింది! చర్మ మాంసాస్థులతో కూడి బలిష్ఠంగాఉన్న హిరణ్మయబాబు చేయి ఆమెకు దొరికింది!

"ఆఁ....ఇదేమిటి?......ఎందు...కిలా...... పట్టుకొంటున్నారు?" కంపిత కంఠంతో సంధ్య ప్రశ్నించింది.

వర్షం జోరున పడుతున్నది. అంతటా చీకటిగా ఉన్నది! దీపస్తంభం ఆరేటు బారల దూరంలో ఉన్నది.

# బురఖా

నర సంచారంలేదు. హిరణ్మయబాబు కండ్లలో క్రూర జంతువు హింసాభావం ద్యోతకమవుతున్నది.

"ఇలాంటి రాత్రి మళ్ళీ వస్తుందా డార్లింగ్?" అన్నాడు హిరణ్మయబాబు సంధ్య చెవిలో మత్తెక్కిన స్వరంతో.

అతని రెండు చేతులూ సంధ్యను పొదివి పట్టాయ్! ముఖం సంధ్య ముఖంమీదకు వెళ్తున్నది! అంతలో 'ఫడేల్' మన్న ధ్వని హిరణ్మయబాబు కుడి చెంప మీద నుంచి విన వచ్చింది.

"డార్లింగ్! ఎందుకు కోపం?" అంటూ హిరణ్మయబాబు పర్సు—కోటు దూరంగా విసిరికొట్టి సంధ్యను అమాంతంగా ఎత్తుకోచూశాడు. కాని— సంధ్య అతిలాఘవంతో అతని పట్టునుంచి తప్పించుకొని పారిపోబోయింది! హిరణ్మయబాబు ఒక్క అంగలో వెళ్ళి, ఆమె చేతిని పట్టుకొని—"నీ దరిద్రం ఒదిలిపోయేలా కావల్సినంత డబ్బూ, బంగారమూ ఇస్తాను! అల్లరి చెయ్యకుండా......వదు!" అన్నాడు.

ఒక్క విదలింపుతో చేతిని విడిపించుకొని "మర్యాదాగా పోతావా......లేదా?......జాగ్రత్త!" అన్నది సంధ్య.

"అక్కో దంభాలకుపోక, చెప్పినట్టు చక్కగా విను! క్షణంలో.....వేలకొద్దీ డబ్బు!...... 'ఊఁ' అను! కనక వర్షం కురిపిస్తాను" అన్నాడు హిరణ్మయబాబు ఆమెను సమీపిస్తూ!

"నీ డబ్బెవరకు కావాలి?.....నీలాటి కుక్కలకు డబ్బు ఖాతరు కాని—నాకు లేదు! తిన్నగా వచ్చిన తోవపో!" అన్నది. ఆమె వెనక్కు అడుగులు వేస్తూ.

"నువ్వింత మొండిగా వింటావా?" అంటూ ఒక్క ఉదుటున వెళ్ళి ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు. ఆమె "బద్మాష్" అంటూ గట్టిగా కేకలు వేసింది. ఆ కేకలు—ఎక్కణ్ణో—ఆ ప్రాంతంలోనే తిరుగుతున్న సుఖేన్ చెవిలో పడ్డవి! ఒక్క పరుగున వచ్చాడు! హిరణ్మయబాబు సంధ్య చేతిని ఒదిలి, రొప్పుతూ నిల్చున్నాడు. సుఖేన్, సంధ్య వెనక్కు వచ్చి "ఏమైంది?" అని కర్కశంగా ప్రశ్నించాడు.

కనీ కనిపించని ఆ దీపపు వెల్తురులో హిరణ్మయబాబు శరీరమూ, ముఖమూ, కండ్లూ పిశాచత్వాన్ని తలపింప చేస్తున్నాయ్! ఆ రూపాన్ని సంధ్య ఒకసారి చూసి, సుఖేన్వైపు తిరిగి, "ఏం లేదన్నాయ్! అల్లదుగో......అక్కడ ఏదో కనిపిస్తే దయ్యమని దడుసుకున్నాను! కాస్త ఇంటివరకూ వద్దూ.....తిరిగి వెళ్ళిపోదువుగాని—" అన్నది.

హిరణ్మయబాబు భయంకర రూపాన్ని దిగువ నుంచి మీదిదాకా ఒకసారి జుగుప్సతో చూసి, "పదవన్నా చెల్లాయ్! నేను బతికున్నంతకాలమూ నిన్నే దెయ్యమూ ఏమీ చెయ్యలేదు. ఆఁ.....ఏదైనా ఏమైనా చేసిందా.....పొట్ట పేగులు బయటకు లాగేస్తాను" అంటూ సంధ్యను వెంబడించాడు! ★

(శ్రీ నారాయణ్ గంగోపాధ్యాయ బంగ కథ ఆధారంతో)



# కొత్త నుడికట్టు-12

## అడ్డం :

1. మా వంటవాడు అగ్గితో వినుగు పడుతాడు!
3. ఎదురుచూడటం తిరగబడింది.
7. పార్వతి.
9. అధరం చిందరవందర.
11. ఊరు.
13. కరుణ హృదయము మధ్యలోనే ఉంటుంది.
14. చంద—
15. ఏకలివ్యపురుషుడూ ముందర మారితే రాజా కాగలడు ?
17. —కథ, అంటారు.
19. టంబ్లర్ !
20. 18 నిలువూ ఇదే.
21. కథా—, అంటారు. (సరకు అనుకోవచ్చునా ?)

## నిలువు :

2. సంపద చిందర వందర.
4. ఆ ! వెళ్ళు, మంచిదికాదు.
5. వనము.
6. బాణము.
8. చివర 'గ' వచ్చేట్టు అవరోహణ చెయ్యండి!
10. దీనికి కొన్ని సమయాలలో గోముఖము ఉండవచ్చు.
12. లక్షణము.
15. ఒక గొప్ప మత స్థాపకుడు.
16. అబద్ధం !
17. గర్వమా ?
18. చింతపండు రుచి.

★

## 11-వ కొత్త నుడికట్టుకు జవాబులు.

### అడ్డం

1. కడవ, 3. కప్పము, 6. తురుష్కులు, 7. వసుధ, 8. అవి, 9. నావ, 10. మరది, 11. ఆళి, 12. అన, 13. కాముడు, 14. తలవరి, 16. ముఖ్యము, 17. సఖ్యము.

### నిలువు

2. వగరు, 3. కవులు, 4. వివరము, 5. కథకళి, 6. తులువ, 8. అది, 9. నానుడులు, 10. మన, 11. ఆవిరి, 12. ఆకారము, 14. తల్పము, 15. వరన.

★

# హరివంశము

### 14-వ పేజీ తరువాయి

పార్వతితోపాటి ఆరాధించదలచుకొనినాను. నా ఈ ఆరాధనమును పట్టిపోజేతువా! మహాకాళి!" మహాకాళుడేమనుకొనినాడో, అప్పటికాయన జ్యోతిర్లింగము, దేదీప్యమానముగ వెలిగిపోయినది. అది నగము తీక్ష్ణమును, నగము వండు వెన్నెలయుగ మున్నది. తండ్రీ! మహాకాళా! ఇది యేమి యను కొన్నది రాజాధిదేవి. మిత్రవిందయు, నామాక్షియు మహాకాళు నారాధించిరి. మిత్రవిందకు శివునియందు కన్నతల్లి అంబిక యున్నచో మక్కువ. ఆమె ఆమెన్య మనసులోనే ప్రార్థించినది. ప్రార్థించుచు తనలోన నవ్వుకొన్నది. తల్లి అది యేమే యన్నది.

నామాక్షి అన్నది:—"ఏమీ లేదండి! అత్తగారు! నీకు కోరినవరుడు లభించునని అంబిక మీ పిల్లకు చెప్పినట్లున్నది. నిజముగా చెప్పినది. కాదో, మా అన్న ఇప్పటికి వచ్చుట ఎట్లు సంభవము"

"అవును. అసంభవము" అన్న మాటలు వారికి వినవైనవి.

ముగ్గురును ఆ మాటలు వచ్చిన దిక్కు చూచిరి.

మహారాజు జయత్సేనుడప్పుడు నిలబడి వారికి కన్పించినాడు. మహారాణి విచిత్రమైన సిగ్గుతో తలవంచుకొన్నది.

"సెయి! మహాకాళీ ఇన్నియేండ్లు మా కాపురములో, నా ఎదుట నేడు యాదవుల యాడుబడుచు నన్ను చూచి, సిగ్గుపడుచున్నదయ్యా! కానిమ్ము! కానిమ్ము!" అని మహారాజు గట్టిగ నవ్వినాడు.

పరమశివుడును వారి దాంపత్యమునుచూచి సంతోషించినాడేమో, తలనుండి ఒక తమ్మిపువ్వును రాల్చినాడు.

అర్చకుడు దానిని రాజునకు అందీయగా నాయన దానిని రాజాధిదేవి తలలో నలంకరించినాడు.

"మహారాజులకు ఇది దేవాలయమని గూడ లేదు. పసిపిల్లలయిపోవుచున్నారు"

"ఓసి! రాజాధీ! నేను పరమశివునిముందుకాక, మరి యెప్పటనే పిల్లవాడను. మాకు ఆయన తండ్రి కదా!" అని తాళి మరల మహారాజు ఇట్లనినాడు.

"పనియుండివచ్చినాను. దేవిగారు చిత్తగించవలయును."

"పిల్లలున్నారని గూడ మహారాజునకు లేదు."

"పిల్లలును చిత్తగింతురు మహాకాళీ! సెలవు దయచేయవయ్యా. అటుపోయి ఇటు వత్తును."

నామాక్షి నగలబడి నవ్వినది.

"మహారాజా! మీరు, నాకు వచ్చినారు" అన్నది.

"ఓసి! పిల్లా! ఆచార్య సుదాములకన్నను వచ్చితినా!"

నామాక్షి సిగ్గుల బరణియై పోయినది. ★




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA